# సింహాగర్జన

లక్ష్మీకాంత మోహన్





మహాకవి హరీంద్రుని పరిచయ వాక్యాలతో



నవయుగ పబ్లిషింగ్ హౌస్, గుంటూరు.



రచయిత - మిత్రుడు

**కీ.శే. లక్ష్మీకాంత మోహన్**

# సింహగర్జన

(తెలంగాణ రైతాంగ పోరాట నవల)



రచన :

లక్ష్మీకాంత మోహన్



నవయుగ పబ్లిషింగ్ హౌస్

గుంటూరు.

# అంకితం

తెలంగాణ పోరాట యోధుడు, మార్క్సిస్టు సిద్ధాంతవేత్త

క్రీ.శే. **మాకినేని బసవపున్నయ్య** గారికి



# ముందుమాట

సింహగర్జన అన్న నవల వీరోచిత తెలంగాణా విప్లవ పోరాటానికి ప్రతిధ్వని. దాని రచయిత కామ్రేడ్ పమిడిముక్కల లక్ష్మీకాంతమోహన్. 1953లో యీ నవలను నవయుగ బుక్‌హౌస్ తరపున మేము ముద్రించాం. దాని ఆంగ్లసేతకు సుప్రసిద్ధ ఆంగ్ల కవి హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ పరిచయవాక్యాలు వ్రాశారు. "ఈ నవలా రచయిత లక్ష్మీకాంతం అత్యంత వాస్తవికత ప్రతిభగల ఆంధ్రప్రదేశ్ రచయితల్లో ఒకరు. రచయిత తన రక్తాక్షరాలతో రాసినట్లున్నదీ నవల" అని హరీంద్రనాథ్ ప్రశంసించారు. ఈ నవలా రచనా కాలానికింకా తెలంగాణా పోరాట నాయకుడుగా వున్న కామ్రేడ్ మాకినేని బసవపున్నయ్యగారు రహస్య జీవితంలోనే వున్నారు. ఆ నేతకు అప్పుడు లక్ష్మీకాంతమోహన్ తన నవలను అంకితం చేశారు. తర్వాత ఆ నవలను ఆంధ్ర, నైజాం, మద్రాసు ప్రభుత్వాలు మూడు నిషేధించాయి. ఇటీవల లక్ష్మీంకాంతమోహన్ 1995 మే 5వ తేదీన మరణించారని రవిబాబుగారి ద్వారా తెలుసుకున్న మీదట బొమ్మారెడ్డిగారు ఆయన రచనల ప్రతులేమేమివున్నాయని పాత లైబ్రరీలను నుండి గాలించి సింహగర్జన ప్రతినొకదానిని పట్టుకున్నారు. దానిని పునర్ముద్రించగలరా అని మోటూరు హనుమంతరావుగారు ఆ ప్రతిని నాకందించారు. అందుకు సంతోషంగా అంగీకరించి పునర్ముద్రణకు పూనుకున్నాను. రచయిత లక్ష్మీకాంతమోహనూ నేనూ ఒక తాలూకా నుండి ఉద్యమంలోకి రావడమేగాకుండా, రేపల్లె హైస్కూలులో క్లాస్‌మేట్సుము అయివుండటము కూడా అప్పుడూ ఇప్పుడూ ఈ నవలను ముద్రించడానికి నాకు ప్రోత్సాహమిచ్చినది. ప్రథమ వర్థంతి సమయానికే పునర్ముద్రణను పూర్తి చేద్దామని తలపెట్టినా కారణాంతరాల వల్ల సాధ్యపడలేదు. ఆలస్యంగా అయినా అందించకలుగుతున్నందుకు సంతసిస్తున్నాను.

సందర్భోచితంగా వుండగలదని భావించి రచయితను గురించిన శ్రీ మోటూరు హనుమంతరావుగారి పరిచయాన్ని, శ్రీ వరవరరావుగారు ఆ నవలా రచనను గురించి పేర్కొన్న ప్రశంసను ఇందులో ముద్రించుతున్నాను.

ఇట్లు
**గద్దిపాటి కోటేశ్వరరావు**
ప్రచురణ కర్త

## ప్రపంచ ప్రసిద్ధ మహాకవి

# శ్రీ హరీంద్రనాథ చట్టోపాధ్యాయుని

## పరిచయ వాక్యాలు.......

'సింహగర్జన!' **(TELENGANA THUNDERS!)** అనేది వొక యువ గ్రంధకర్తచే రాయబడిన శక్తిమంతమైన చిన్న నవల; అతన్ని నేను వ్యక్తిగతంగా చూశాను; అందుకు నాకు సంతోషంగా వుందిగూడాను. ఆ యువకుని కళ్ళల్లో ఏదో ఆవేదన, హృదయంలో యేదో ఆందోళన, వోటమిని అంగీకరించనొల్లని నిశ్చితత్వం నాకగుపించేయి; కొద్దిలో చెప్పాలంటే - గత కొద్ది సంవత్సరాలుగా యే ఆంధ్ర, తెలంగాణా రచయితలైతే జీవితంతో యెడతెగని పోరాటంతో ఉత్తేజితులయ్యారో, దినదినాభివృద్ధి గాంచుతూన్న ఆ రచయితల కుటంబానికి చెందిన కార్యశూరుడైన రచయిత యితడు; యీనాడు ఆ రచయితలు రాసిన పాటలు ప్రజలచే పాడబడుతున్నాయి; వారు శాంతిని గురించిన నాటకాలు - అవి మామూలు నాటకాలుగాక జీవితంతో పెనవేసుకొన్న అద్భుత సందేశసంభరితాలు - స్త్రీ పురుష దళాలచే ఆడబడుతున్నాయి; భూస్వామ్య దోపిడికీ, నిర్బంధానికీ వ్యతిరేకంగా ప్రజలు జరిపే మహత్తర పోరాటమును గురించి వారు చిత్రించే కధానికలు పాఠకులచే అత్యంతాసక్తితో చదవబడుతున్నాయి.

ఈ నవలారచయిత - లక్ష్మీకాంతం - అత్యంత వాస్తవికత, అత్యంత ప్రతిభ గల ఆంధ్ర రచయితల్లో వొకడు. రచయిత తన రక్తాక్షరాలతో రాసినట్లుందీ నవల; ఏ తెలంగాణాగడ్డ వీరుల త్యాగంతో యే తెలంగాణాగడ్డ వీరవాయువులను పీల్చిందో, రచయిత చాలా పసందుగా చిత్రించిన ఆ తెలంగాణా పల్లెసీమల వాతావరణాన్ని యీ నవలలోని ప్రతి సమాసమూ విస్పష్టంగా వివరించుతూ, వెలుగొందుతూ, అడుగడుగునా వుత్తేజితుల్ని చేస్తూంటుంది. ఈ కథ చదివేప్పుడు, అతి జాగ్రతతోనూ, సిసలైన వాస్తవిక దృక్పథంతోనూ చరిత్ర పునశ్చరణ చేయబడుతూన్నట్లు చూస్తాం; వొకదృశ్యంతర్వాత మరొక దృశ్యం మన జ్ఞాన నేత్రంలో అగుపించుతూ వాస్తవిక జీవితచిత్రాన్ని కళ్ళకి కట్టినట్లు చూపుతుంది; చివరికి వోటమితత్వం, నిరాశ, మటుమాయమౌతాయి; ప్రేమ, జాలి, కడుపుమంట, ఐక్యకార్యాచరణ జయిస్తాయి.

ఆంధ్ర తెలంగాణాలకు బయటవున్న పాఠకులకి ఇంగ్లీషులో రాయబడిన యీ చక్కని, చిన్న నవలని పరిచయం చేయటమనేది వొక గౌరవంగా యెంచుకొంటున్నాను.

# పరిచయం

ప్రజాశక్తి

5-3-96

సుప్రసిద్ధ జానపద గాయకుడు,కళాకారుడు, కవి, రచయిత అయిన శ్రీ పమిడిముక్కల లక్ష్మీకాంత మోహన్ 1995 మే 5వ తేదీన కన్నుమూశారు. ఆరోజు మార్క్స్ జన్మదినోత్సవంగావడం ఒక విశేషం.

లక్ష్మీకాంత మోహన్ మావూరివాడేనని చెప్పుకోవడం నాకు గర్వకారణంగా వున్నది. మాది వెల్లటూరు. ఆయన నాకన్నా ఏడెనిమిదేళ్ళు చిన్నవాడు. రేపల్లె హైస్కూల్‌లో ఆయన చదివినది కేవలం 9వ క్లాసు మాత్రమే. దారిద్ర్యంలో పుట్టాడు. ఆ దారిద్ర్యంతోనే పెనుగులాడుతూ కవిగా, రచయితగా, కళాకారుడుగా స్వయం కృషితో అభివృద్ధి చెందాడు. నిజంగా మట్టిలో నుండి పుట్టిన మాణిక్యం ఆయన. ఆంగ్ల రచయితగా, అందునా షేక్స్పియర్‌ను అధ్యయనం చేసి ఆయన స్త్రీ, పురుష పాత్రలను, ఆ పాత్రల మనస్తత్వాలను విశ్లేషించి పోల్చడంలో అద్వితీయుడని పేరు పొందడం అన్నిటికన్నా విశేషం. Shakespears men and women: A Physchological Interpretation అన్న రెండు సంపుటాల ఆంగ్ల గ్రంథాన్ని ఆయన రచించాడు.

ఆ రచనలు సుప్రసిద్ధ కవి, గాయకుడూ అయిన హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ, హుమాయూన్ కబీర్, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీష్ డైరెక్టర్‌గా వున్న వి.కె. గోకక్, మరికొందరు ఇంగ్లండ్‌కు, అమెరికాకు చెందిన ఆంగ్ల కవులూ ఆచార్యులూ మొదలైన వారి ప్రశంసలు పొందాయి. ఎందరెందరి సహాయాన్నో పొంది పదేళ్ళ కాలాన్ని ఆ రచనలకు వెచ్చించి ఆయన ప్రచురించారు. ఆంధ్రా యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ ఎం.ఆర్. అప్పారావుగారికి, సుప్రసిద్ధ సినీనటుడు కీ.శే. ఎస్.వి. రంగారావు గారికి వాటిని ఆయన అంకితమిచ్చాడు. షేక్స్పియర్ వంటి ఆంగ్ల మహాకవి రచనలను కొద్దిపాటి చదువు చదివిన లక్ష్మీకాంత మోహనా అర్థం చేసుకునేది అని ఎవరైనా అనవచ్చు గాని, "ఆంగ్ల కవి నాటకాలను ఆంగ్లేయులే బాగా అర్థం చేసుకోగలరని ఎక్కడా రాసి పెట్టిలేదు. నిజానికి నేనే నాకున్న అనుభవంతో షేక్స్పియర్‌ని బాగా అర్థం చేసుకున్నాను. చదువు ఘాటకొస్తే షేక్స్పియర్ చదివినదీ ఏడేళ్ళ చదువు మాత్రమేన"ని ధీమాగా లక్ష్మీంకాంతమోహన్ చెప్పుకున్నాడు. 1960లో మొదటి సంపుటాన్ని, 1966లో రెండవ సంపుటాన్ని ఆయన ప్రచురించారు. ఒకరోజు ప్రత్యేకంగా నా వద్దకు వచ్చి "With Love and Humility (ప్రేమా, నమ్రతలతో)" ఆ గ్రంథాలను నాకు బహుకరించి నన్ను ఆశ్చర్య చకితుణ్ణి చేశారు. అంతేగాక దాదాపు 15 షేక్స్పియర్ నాటకాలను ఆయన తెలుగులోకి అనువదించాడు. ప్రఖ్యాత నవలా రచయిత త్రిపురనేని గోపీచంద్‌గారు బాగా ప్రశంసించిన తెలుగు సేతలవి.

ఆ విధంగా ఉన్నతస్థాయి మేధావిగా పెంపొందిన లక్ష్మీకాంత మోహన్ మావూరు వాడు అయివుండటమే గాదు ఆదిలో ఏ వాతావరణంలో ఆయన ప్రభావితుడుగావడం కూడా నాకు

గర్వకారణంగానే వుండేది. తన అంతర్జాతీయ అవగాహనను మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌ల విజ్ఞానమే తీర్చిదిద్దినట్లు ఆయన వ్రాసుకున్నారు. ఉద్యోగం కోసం తిరిగి తిరిగి వేసారి చివరకు వార్ టెక్నీషియన్‌గా చేరాడు.

1942 అనంతరం ఆంధ్రలో కమ్యూనిస్టు ఉద్యమం పెద్ద వూపు తీసుకున్నది. ఆ దశలో జానపద కళలకు, సంస్కరణలకు, సంస్కృతికి, సాహిత్యానికి ఆ ఉద్యమం పునర్జీవం పోసింది. అందుకు ఆకర్షితుడైన లక్ష్మీకాంతమోహన్ బుర్రకథకుడుగా, చెంచిత, గొల్లసుద్దుల దళాల నిర్వాహకుడుగా, విచిత్ర వేష ప్రదర్శనల్లోనూ, నాటకాలలోనూ పాత్రధారిగా పైకి వచ్చారు. గుంటూరుజిల్లా ప్రజా నాట్యమండలిలో భాగస్వామిగా అభివృద్ధి చెందాడు. తెలంగాణా పోరాటకాలంలో సింహగర్జన అన్న నవలను రచించాడు. తెలంగాణా జానపద గేయాల సంకలనాన్ని తయారుచేశారు. జయప్రకాశ్ బుర్రకథను రచించి ప్రదర్శించాడు. పిల్లలకోసం మహాపురుషుల జీవిత కథలను, గాథలను అనేకంగా రచించి అచ్చువేయించాడు.

అయితే ఆయన జీవితం అనేక పెడదారులకు దారితీసింది. ఆయన ధ్యాసంతా కళలపై వుండగా మా రాజకీయ సిద్ధాంత అవగాహనకే ఆయన పరిమితమై వుండలేక తన ప్రతిభకు ఎక్కడ అవకాశం దొరికితే అక్కడికి ఆయన పయనించాడు. ప్రభుత్వ జానపద కళాకేంద్ర నిర్వాహకుడుగా చేరి దేశవ్యాపిత ప్రదర్శనల్లో పాల్గొన్నాడు. ఆకాశవాణి ఆయన కళా ప్రదర్శనలను అనేకంగా ప్రసారం చేసింది. గొల్లసుద్దులను ఆంగ్లంలో కూడా రచించి ప్రదర్శించాడు. జాతీయ జానపద గాయకుడుగా ప్రథమ బహుమతి పొందాడు.

అన్నివిధాల కళకు అంకితమై 20 సంవత్సరాల స్వయం కృషితో లక్ష్మీకాంతమోహన్ బహుముఖ ప్రజ్ఞాశాలిగా అభివృద్ధి చెందాడు. చిన్నవీ పెద్దవీ 60 పుస్తకాల్లో ఆయన రచనలు ప్రచురితమైనాయి. 40 జానపద కళారూపాల పాత్రధారి ఆయన. రాష్ట్రంలోనూ, దేశంలోనూ 1500 ప్రదర్శనల్లో పాల్గొన్న కళాకారుడు.

లక్ష్మీకాంత మోహన్ తల్లిదండ్రులూ, ఆయన పినతండ్రి, అన్న నాకు చిరపరిచితులు. మావూరులో గాంధీ రాఘవయ్యగా పేరుపొందిన దేశభక్తుడు వాడి పినతండ్రి. మా ఊరి గ్రంథాలయాన్ని నిర్వహిస్తూ మాకు దేశభక్తిని నూరిపోసి తర్వాత నాతోపాటు కమ్యూనిస్టు ఉద్యమ కార్యకర్తగా వున్నారు. ఆర్థిక ఇబ్బందులతో నర్సంపేట తాలూకా ఖానాపురం వెళ్ళి అక్కడే కాలగర్భంలో కలిసిపోయారు. వాడి అన్న రాజబాబు నా స్కూల్‌మేటు, చెరుకుపల్లిలో కట్టెల అడితీ పెట్టి వ్యాపారం చేసేవాడు. 1952 శాసనసభా ఎన్నికల్లో ఆయన ఇల్లే ఆ కేంద్రంలో నాకు ఆశ్రయంగా వుండేది. 1978 నుండి 84 వరకు నేను శాసనమండలి సభ్యుడుగా న్యూ ఎం.ఎల్.ఏ. క్వార్టర్స్‌లో వుండేవాడిని. అంతవరకు దాదాపు నేను క్వార్టర్స్‌లో వున్నప్పుడంతా నా వద్దకు వచ్చి వాడి సంసార బాధలూ గాథలు చెబుతుండేవాడు. సానుభూతితో వినడం తప్ప వాడి సమస్యలు నేను తీర్చగలవీ ఆర్చకలిగినవీ కావనుకునేవాడిని.

అనేక సందర్భాల్లో తన రచనలను ప్రచురించమని నన్ను కోరేవాడు. కాని ఒక నికరమైన రాజకీయ విధానానికి నీవు కట్టుబడిలేనప్పుడు నేనేవిధంగా అందుకు తోడ్పడగలనురా అని చనువుగా మందలించేవాడిని.

వాడి ఆర్థిక ఇబ్బందులను తీర్చగలిగిన సత్తా నావద్ద లేకపోయినా ఎప్పటికప్పుడు తాత్కాలిక అవసరాలకు కొద్ది మొత్తాలను మాత్రమే ఇవ్వగలిగేవాడిని. ఆ ప్రతిభావంతుడితో నాకు గల చనువునూ, సాన్నిహిత్యాన్ని తెలిపేందుకే యీ మాటలు వ్రాస్తున్నాను. తన జీవితంలో పరస్పర వైరుధ్యాలున్నాయని, లక్ష్మీకాంతమోహన్ వ్రాసుకున్నాడు. ఇంగ్లీషు మాటల స్పెల్లింగుకూ, ఉచ్ఛారణకు మధ్యగల వైరుధ్యంలాంటిదే అది అని వర్ణించుకున్నాడు.

ఏమైనా లక్ష్మీకాంత మోహన్ ప్రతిభకు తగ్గ పలుకుబడికి నోచుకోలేదు. అందుకు విశ్వనాథగారు చెప్పినట్లు "డిగ్రీలు లేని పాండిత్యంబు వన్నెకురాని యీ పాడుకాలాన" పుట్టడమూగావచ్చు. లక్ష్మీకాంతమోహన్ వ్రాసినట్టు "పేదవాడి తలపై కిరీటధారణ జరగదు. ఆ తల విచార సాగరంలోనే మునిగిపోతుంది" అన్న నేటి సామాజిక వాస్తవమూగావచ్చు. అయినా లక్ష్మీకాంత మోహన్ స్వయం ప్రకాశం అందరికీ విశ్వాసం కలిగించకమానదు. అటువంటి వారికి సముచిత స్థానం లభ్యమవ్వాలంటే అందుకు సోషలిజమే శరణ్యాం.

1984 అనంతరం నేను తరచుగా హైదరాబాద్ వెళ్ళే వాడినిగాదు. అందుకే ఆ తర్వాత వాడి జీవితం ఎన్ని వంకలు తిరిగిందీ నాకు తెలియదు. అడపా దడపా వెళ్ళినప్పుడైనా వాడు నాకు కనిపించలేదు. గుర్తుకు వచ్చినప్పుడల్లా కనిపించకపోవడానికి బహుశా వ్యాధిగ్రస్తుడైవుండటమే కారణం అనుకునేవాడిని. చివరిదశలో ఆయన తాగుడుకు అలవాటుపడినట్లు కొందరు వ్రాస్తున్నారు. నిజమే గావచ్చు. కాని నావద్దకు ఆవాలకంగా వాడు ఎన్నడూ రాలేదు. చుట్టలు మాత్రం విపరీతంగా కాల్చేవాడు.

ఏమైనా మా వూరి మహాకవి కాంతారావు. వెల్లటూరులోనూ, రేపల్లెలోనూ, విజయవాడలోనూ వాడికి సన్మానాలు జరుగుతుండటం నాకు సంతోషంగా వుండేది. ఒకరోజు సాంస్కృతిక రంగ శ్రేయోభిలాషిగా వున్న శ్రీమతి రోడామిస్త్రిని విజయవాడలో నా వద్దకు తీసుకువచ్చాడు. వాడి రంగంలో వాడనేకవిధాల రాణింపుకు వస్తున్నాడనిపించింది. అన్ని గొప్ప లక్షణాలున్నా సంఘటితోద్యమంలో లక్ష్మీకాంతం కొనసాగలేకపోవడంవల్ల అరాచకం వాడిని ఆవరించివుంటుంది. నాకు మావూరి ఆప్తమిత్రుడు ఉద్యమ సహచరుడూ అయిన లక్ష్మణరావు కుమారుడు చంద్రశేఖర్ అజాద్ మంచి నవలా రచయితగా పేరులోకి వచ్చాడు. అజాద్ వెల్లటూరులో వున్నది కొద్ది కాలమే అయినా ఆ వూరు గొప్పదని మురిసిపోతూ వుంటాడు. నాతో ఇటీవలనే అన్నాడు. "మామయ్యా మనూరు నుండి చెదిరిపోయిన పెద్దలందరినీ ఒక ఫంక్షన్ పెట్టి ఆహ్వానించాలని వున్నది" అన్నాడు. లక్ష్మీకాంతం! చనిపోయినట్లు తెలియడమే ఆలస్యం కాగా అందర్నీ ఒక చోటికి చేర్చేందుకు యీ ప్రథమ వర్ధంతిని వినియోగించుకోలేకపోయాం. ద్వితీయ వర్ధంతికైనా ఆ పని చేయగలుగుతామని ఆశిస్తున్నాను.

ఏమైనా ఇంతటి ప్రాముఖ్యతగల కాంతారావు అంత నిరాడంబరంగానూ మనమధ్య లేకుండా అదృశ్యమైనందుకు ఖిన్నుడనై వాడికి నా శ్రద్ధాంజలి ఘటిస్తున్నాను. అతని కుటుంబానికి నా సానుభూతిని తెలుపుతున్నాను. నేను సూచించినంతనే అంగీకరించి నా చిరకాల మిత్రుడు కోటేశ్వరరావు, సింహగర్జనను పునర్ముద్రిస్తున్నందుకు అనేక ధన్యవాదాలు తెలుపుతున్నాను.

**- మోటూరు హనుమంతరావు**

ప్రసాద్
6-11-2003

# నిజానికిది ప్రజాగర్జన

(**"తెలంగాణా విమోచనోద్యమం తెలుగు నవల"** అన్న గ్రంథంలో సుప్రసిద్ధ రచయిత శ్రీ వరవరరావు కొన్ని నవలలను విశ్లేషించి వాటి సమాజ సాహిత్య సంబంధాలను సమీక్షించారు. వట్టికోట ఆళ్వారుస్వామిగారు రచించిన "ప్రజల మనిషి", "గంగు", శ్రీ మహీధరరామమోహన్‌రావుగారు రచించిన "ఓనమాలు", "మృత్యువు నీడల్లో" అన్న నవలలను, శ్రీ బొల్లిముంత శివరామకృష్ణగారు రచించిన "మృత్యుంజయులు" అన్న నవలను, శ్రీ లక్ష్మీకాంతమోహన్ రచించిన "సింహగర్జన"ను శ్రీ వరవరరావు తన పుస్తకంలో సమీక్షించారు. అందులో ప్రత్యేకంగా "సింహగర్జన"ను "నిజానికిది ప్రజాగర్జన" అని విశ్లేషించారు. ఆ విధంగానే "సింహగర్జన"ను గురించి దాని రచయితను గురించి వారి విశ్లేషణలో వేరువేరు పేజీల్లో పేర్కొన్న భాగాలను దిగువనిస్తున్నాం. ప్రచురణ కర్త.)

తెలంగాణ రైతాంగ పోరాటం గురించి వచ్చిన నవలల్లో "సింహగర్జన" రెండు విధాల ప్రత్యేకమైన నవల, నైజాం రాష్ట్రంలోని మరింత నికృష్టమైన అణచివేతకు గురి అయిన జాగీరు గ్రామం ఈ నవలలో కథా కేంద్రం. అట్లాగే పోలీసు చర్య తరువాత యూనియన్ పోలీసులకూ, మిలటరీకీ వ్యతిరేకంగా రైతాంగం చేసిన పోరాటం ఈ నవలలో చిత్రించబడింది.

లక్ష్మీకాంత మోహన్ రచించిన "సింహగర్జన" రచనాకాలం 1951 మొదటి సాధారణ ఎన్నికలకన్నా ముందుకాలం. లక్ష్మీంకాంత మోహన్ ఇంగ్లీషు నవల 'తెలంగాణా థండర్స్' (తెలంగాణా గర్జిస్తోంది) కి హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ రచించిన పరిచయ వాక్యాలనే రచయిత ఈ రెండింటిలోనూ "కథ ఒకటే అవటంవల్ల" ఈ నవల పరిచయ వాక్యాలుగా కూడా వేసుకున్నారు.

తెలంగాణా విమోచనోద్యమంపై "సింహగర్జన" తొట్ట తొలి నవలల్లో ఒకటి.

"సింహగర్జన"లో ప్రధానంగా చోటు చేసుకున్న అంశాలు తెలంగాణాలో దేశముఖ్‌ల, జాగీర్దార్ల వాళ్ళ తైనాతీల దౌర్జన్యాలు, వెట్టిచాకిరీ, అణచివేత చర్యలు, వీటికి వ్యతిరేకంగా "సంఘం" నాయకత్వంలో ప్రజల ప్రతిఘటన, ఈ దశలో పోలీసు, రజాకార్ల దారుణ హింసాకాండ, కమ్యూనిస్టు గెరిల్లాల వీరోచిత సాయుధ పోరాటం, గ్రామాల విముక్తి, యూనియన్ మిలిటరీ, పోలీసుల ప్రవేశం, హిందూ, ముస్లిం విద్వేషాలు, భూస్వాములు గ్రామాల్లో పునఃప్రవేశం, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో రైతాంగ సాయుధ పోరాట కొనసాగింపు, యూనియన్ పోలీసులు కమ్యూనిస్టులపై సాగించిన దమనకాండ, ప్రజల, కమ్యూనిస్టుల త్యాగనిరతి.

ఈ అంశాలను వివరించడానికి రచయిత ఉద్యమంలో తాను భాగంగా చాలా చోట్ల చరిత్రనే యథాతథంగా చెప్పినప్పటికీ ఒక గ్రామాన్ని ఆ గ్రామంలోని రైతు కుటుంబాలను వాళ్ళ సమస్యలను నవలలో ఇతివృత్తంగా మలచి చరిత్రనే కల్పనకన్నా గగుర్పాటు కలిగించేలా కళ్ళముందు వుంచాడు. వాస్తవ ఘటనలను వాస్తవ పాత్రలను తీసుకుని రచించిన నవల కాబట్టి యిందులో మనకందరూ మనుషులే కనబడతారు. అందరిలోనూ మానవ సహజమైన బలహీనతలు, గుణాలు కన్పిస్తాయి. మట్టి మనుషులే వీరులుగా రూపొందుతారు.

కమ్యూనిస్టులు ప్రజల కొరకు అన్ని పనులు చేసిపెట్టే వీరులు, సాహసికులు, హీరోలు అనే భావాన్ని కమ్యూనిస్టులు ప్రోత్సహించరు. రచయిత ఒకటి రెండుసార్లు వాడిన పోలికలాగ తల్లి స్తన్యాన్ని అంటిపెట్టుకుని వుండే పిల్లలవలె ప్రజల కంటిపెట్టుకుని వుండేవాళ్ళు కమ్యూనిస్టులు. ప్రజల్లో వుంటూ, ప్రజలతో వుంటూ, ప్రజల కష్టసుఖాలు అనుభవిస్తూ, ప్రజల్లో వర్గ చైతన్యాన్ని, పోరాట చైతన్యాన్ని కలుగజేస్తూ, ఆ చైతన్య స్థాయిని బట్టి భౌతిక పరిస్థితులకు అనుగుణంగా ప్రజలను ముందుకు నడిపించేవాళ్ళే కమ్యూనిస్టులు. నీళ్ళల్లో చేపల్లాగా, భూమిలో విత్తనాల్లాగా వాళ్ళు ప్రజల్లో కలగలిసిపోయిన వ్యక్తులు. అందుకే ప్రజలలో కమ్యూనిస్టులు లేకపోతే తాము గొల్లలేని గొర్రెలు అయిపోతామన్న భావన రానివ్వరు. కమ్యూనిస్టులతోపాటు ప్రజలు కూడా కత్తిపట్టి తయారైనప్పుడే, అందరూ పోరాడినప్పుడే విముక్తి అన్నది వాళ్ళ శాస్త్రీయమైన అవగాహన.

ప్రజా వెల్లువ పెల్లుబికి, ప్రజలు సాయుధ పోరాటాన్ని నిర్వహించిన విషయం కూడా ఈ నవలలో ప్రస్తావనకు వచ్చింది. ఆత్మరక్షణ దళాలుగా ఏర్పడి రజాకార్ల నుంచి గ్రామాలను కాపాడుకుంటూ పోలీసు స్టేషన్లపై, క్యాంపులపై దాడులు చేసి గెరిల్లాలు ఆత్మరక్షణ, ఎదురుదాడి అనే రెండు పోరాట రూపాలను నిర్వహించారు. గ్రామ ప్రజలను రజాకారు, పోలీసు దౌర్జన్యాల నుంచి కాపాడారు. అప్పుపత్రాలు, పటేల్, పట్వారీల దగ్గర వుండే రికార్డులు తగులబెట్టారు. పోలీసు నాకాల మీద దాడి చేసి, రజాకారు దళాలను ఎదుర్కొని ప్రజా గెరిల్లా దళాలు తుపాకులు స్వాధీనం చేసుకున్నారు. తెలంగాణాలో రైతాంగం చేపట్టిన ఈ సాయుధ పోరాటంతో పటేలు, పట్వారీలు, భూస్వాములు గ్రామాలు వదిలిపోయారు. జాగీర్దారు బొంబాయి పారిపోయాడు.

గ్రామాల్లోని భూమి అంతా ప్రజలు వశం చేసుకున్నారు. అలా 3,000 గ్రామాలకు పైగా ఫ్యూడల్ దోపిడీ నుంచి విముక్తి చేయబడినవి. పది లక్షల ఎకరాలకుపైగా భూమి కూలి రైతులకు పంచిపెట్టబడింది. గ్రామ పంచాయితీలు ఎన్నుకొనబడినవి. ఆ పంచాయితీల కిందే గ్రామ పరిపాలన సాగుతున్నది. కూలి రేట్లు పెంచబడినవి.

ఈ యదార్థ చరిత్రను రచచిత తన నవలలో భాగంగానే వివరిస్తాడు.

"సింహగర్జన" నవలలో విస్తృతికన్నా వేగం హెచ్చు. విశ్లేషణకన్నా విసురు హెచ్చు. పాత్రల భావన సంఘర్షణకన్నా సంఘటనలు హెచ్చు. పాత్రల ద్వారా కథ నడపడం కన్నా రచయిత జోక్యం, వాఖ్యానం ఎక్కువ. అందుకే తక్కిన అన్ని నవలలు కన్నా దీని కాల వ్యవధి చాలా ఎక్కువ, జాగీర్దారీ వెట్టిచాకిరీని దాని నగ్నమైన ఫ్యూడల్ స్వరూపంలో చూపెట్టడంతో ప్రారంభించింది. ఆంధ్ర మహాసభ, 'సంఘం', కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో సాయుధ పోరాటం, భూ సంస్కరణల గురించి చెబుతూ, ఢిల్లీలో బ్రిటీష్‌వాళ్ళు వెళ్ళిపోయి నైజాం సంస్థానంలోకి యూనియన్ పోలీసు, మిలిటరీ ప్రవేశాన్ని, స్టేట్ కాంగ్రెస్ పాలనను కూడా ఈ నవల చిత్రిస్తుంది. పారిపోయిన భూస్వాములు, పటేలు, పట్వారీలు యూనియన్ మిలిటరీ, పోలీసుల సహాయంతో గ్రామాలకు తిరిగి వచ్చి వాళ్ళే కాంగ్రెస్ నాయకులుగా వ్యవహరించి, మళ్ళీ భూములు, అధికారం చేపట్టడం ఈ నవలలో రచయిత చాలా బాధతో, కోపంతో, వర్ణిస్తాడు. యూనియన్ పోలీసు, మిలిటరీల ప్రవేశాన్ని, బూస్వాముల పునరాగమనాన్ని, భూస్వాములే కాంగ్రెస్ నాయకులుగా మారిన చరిత్రను చిత్రించిన ఒకే ఒక తెలంగాణా విమోచనోద్యమ నవల ఇది. అందువల్ల ఈ నవలకు ఒక ప్రత్యేకత వుంది.

ముఖ్యంగా యూనియన్ మిలిటరీ, పోలీసుల రాక తర్వాత ఈ నవలలో వస్తువు, సంఘటనలు కమ్యూనిస్టుల త్యాగాలకు నికషోపలంగా వున్నాయి. ఇవన్నీ రచయిత తాను కూడా పాల్గొంటూ, వ్యాఖ్యానిస్తూ ఉద్రేకం పట్టజాలక రాసిన ఘట్టాలుగా వుండవచ్చుగాని అయినా జరిగిన చరిత్రకన్నా ఇందులో అతిశయోక్తిలేదు.

రచయిత పరిశీలన, అభివ్యక్తి ఇందులో శక్తివంతంగా కనిపిస్తాయి. ఒక డాక్యుమెంటరీలాగా నాటి తెలంగాణా జీవితాన్ని, పోరాటాలను ఇది మన ముందుంచుతుంది. చారిత్రక వాస్తవికత, కల్పన రెండు కలగలసిన శిల్పం ఇందులో మనం చూస్తాం.

ఈ నవల నిజానికి "ప్రజాగర్జన". ఫ్యూడల్ రాజరికానికి చిహ్నమైన సింహం ప్రజల మీదే ఇంత విశ్వాసం వుంచిన కమ్యూనిస్టు పార్టీకి పోలిక కాజాలదు. చరిత్ర, ప్రజా జీవితం, పోరాటం కల్పనకన్నా కూడా ఉత్తేజకరంగానూ, ఉజ్వలంగానూ ఉంటాయనటానికి తెలంగాణా విమోజనోద్యమం, ఆ ఉద్యమాన్ని కళ్ళకు కట్టిన ఈ నవల నిదర్శనాలు. ప్రజలే నిర్మించిన చరిత్ర మన మలవాటుపడిన చరిత్ర పాఠం వలె కాకుండా సజీవ చైతన్యంతో కణకణమూ క్షణక్షణమూ ఉత్తేజాన్నిస్తూ ఉజ్వల భావి చరిత్రను నిర్మిస్తూ వుంటుంది.

- శ్రీ వరవరరావు

# మొదటి ముద్రణకు

## పాఠకులకు ముందుమాట

ముందుగా నేను చేయాల్సిన పని వొకటుంది; అదేమంటే మహాకవి శ్రీ హరీంద్రనాథ చటోపాధ్యాయకు నా హృదయపూర్వకమైన అభివందనాలు తెల్పటం.........

ఆయన్ని ఆంధ్రప్రజానీకంలో చాలామంది - ముఖ్యంగా పై తరగతులవారూ, మేధవులూ యెరుగుదురు. అఖండ ప్రఖ్యాతి గడించిన కవయిత్రీ, కాంగ్రెసు నాయకురాలూ ఐన శ్రీమతి సరోజినీ నాయుడికి శ్రీ హరీంద్రుడు తమ్ముడు; ఈయన ప్రస్తుతం మన పార్లమెంట్ మెంబరు; ఇంగ్లీషులో ఆశుకవిత్వం చెప్పగల దిట్ట; యీయన ఇంగ్లీషులో రాసిన నాటికలూ - ముఖ్యంగా యీ మధ్య రాసిన పద్యగ్రంధాలూ - సోవియట్ యూనియన్, తూర్పు యూరప్ దేశాలూ మొదలగువాటిల్లో బహుళ ప్రచారంలో వున్నాయి. ఈయన ఒక్క కవిమాత్రమే గాదు: చిత్రకారుడు, గాయకుడు, నటకుడు, నాట్యగాడు, వాయిద్యగాడు, గొప్ప వుపన్యాసకుడు ఒకటేమిటి? బహుముఖ కళాకారుడు - నేను అడగ్గానే ఎంతో ప్రేమతో నా నవలపై తన అభిప్రాయం వెలిబుచ్చినందుకు శ్రీ .హరీన్‌కు నా, హృదయపూర్వకమైన అభివందనాలర్పించుతున్నాను.

కధ వొకటే అవటంవల్ల శ్రీ హరీన్ నా ఇంగ్లీషు నవల Telengana Thunders (తెలంగాణా గర్జిస్తోంది) కు రాసిన పరిచయ వాక్యాలనే యీ తెలుగు నవలకి చేర్చటమైంది.

ఇంగ్లీషు భాషారచయితగా కాలు నిలదొక్కుకొనటానికి యెంతో సాహిత్యం అందించి సహాయపడిన నా మిత్రుడు శ్రీ యం. సాహిత్యం అందించి సహాయపడిన నా మిత్రుడు శ్రీ యం. బసవయ్యగారికీ, యీ నవల సందర్భంలో తగిన సలహాలిచ్చి తోడ్పడిన మిత్రుడు శ్రీ ఐ. సీతారామారావు గారికీ నా ప్రేమపూర్వకమైన అభివందనలు తెల్పుకొంటున్నాను.

ఈ నవలపై నిష్పక్షపాతంగానూ, ప్రేమపూర్వకంగాను తమతమ అభిప్రాయాల్ని నాకుపంపవలసిందిగా పాఠకులందర్నీ ప్రార్థిస్తున్నాను.

లక్ష్మీకాంత మోహన్

# భూత గర్జన !

పట్టపగటి కుట్ర . . . . . . .
మత్తువదలండి జా
గ్రత్తసుమీ యండి :
మేల్కొండి! మేల్కొండి !

- షేక్స్‌పియర్ యొక్క "ది టెంపెస్ట్" నాటకంలో ఏరియల్.



**అ**ప్పటికి చీకటిపడింది. కొన్ని యిళ్లల్లో దీపాలు వెలిగిస్తున్నారు. కాని చాలా యిళ్ళు - యెలాంటి యిళ్లు! పందుల గుడెసెల్లాగావుండే ఆ యిళ్లు - మూతపడే వున్నాయి. ఆ పాడు చీకట్లో యెవరేనా వాటివంకచూస్తే అదో భయంతో వొళ్లు జలదరించమానదు. ఇరుకుగావుండే ఆ సందు గొందుల్లో, యెగుడు దిగుళ్ళుగావుండే ఆ వీధులగుండా ఆ చీకట్లో తడుముకొంటూ గ్రామస్తులు పొలాలనుంచి యిళ్లకి వస్తున్నారు. తమ తమ దీపాలు విరజిమ్మే గుడ్డి వెల్తుర్లలో కొంతమంది స్త్రీలు జొన్నలు దంచుతున్నారు; మరికొంతమంది అన్నాలు వండుతున్నారు. మండుతున్న పొయ్యిలు నీలిపొగనీ, యెర్రటి కాంతినీ వారి ముఖాలమీద చిమ్ముతున్నాయి; ఆ యెర్రటి కాంతిలో వారి ముఖాల మీదవున్న చెమటబిందువులు యెర్రటి ముత్యాలా అన్నట్లు జిగేల్‌మని మెరుస్తున్నాయి. పొలాలనుంచి వచ్చే పశువులతో వీధులింకా రద్దిగానే వున్నాయి. అర్ధ నగ్నంగావున్న బక్కచిక్కిన పిల్లలు కొందరు తమ తమ యిళ్లముందు ఆ చీకట్లోనే రణగొణ ధ్వనిచేస్తూ ఆడుకొంటున్నారు. ముసలాళ్లు కుక్కి మంచాల్లో పడుకునో, లేకపోతే యింటి చూరులకింద కూచునో దగ్గుతూ, యేమిటో గొణుగుతూ, యెవరినో శాపనార్థాలు పెడుతున్నారు.

ఈ రద్దీ రభసల మధ్య హఠాత్తుగా తప్పెట మోత వినబడింది. తప్పెట మోత అంటే యేమిటో ఆ గ్రామస్తులకి బాగా తెలుసు. అయితే యేదో మూడిందన్నమాట! ఆ తప్పెట మోత వింటూనే - అదేదో తాచుపాము బుస్సైనట్లు - గ్రామస్తులు భయంతో కంపించిపోయారు!

తలలు వంచుకొని, నిట్టూర్పులు విడుస్తూ, ఏదో శవం వెంట స్మశానానికి పోతున్నట్లు ఆ గ్రామస్తులు కాళ్లీడ్చుకుంటూ గ్రామ మధ్యస్త ప్రదేశానికి చేరుకొన్నారు.

వెట్టివాడు ప్రముఖంగా గొంతు సవరించి, పెద్దగా ఇలా అరిచేడు :

"యిందు మూలంగా జనం యావన్మందికీ శెప్పేదేందంటే, మన దొర, జగ్గారెడ్డిగోరు,

గుఱ్రపుశాల యెల్లుండి మట్టీ కట్టిత్తారు గాబట్టి గ్యామస్తులు యావనమందీ - పెద్దా శిన్నా, పిల్లా జెల్లా, కూలీ నాలీ, రైతూ రెడ్డీ - యావన మంది - వచ్చి ఆ గుఱ్రపుశాల తొరగా పూర్తిశెయ్యాలి. అట్టా గనక రాకపోతే గట్టిగా సీచ్చింపబడతారహో . . .''

అది విన్న ఆ ప్రజలు నిట్టూర్చి, తలలు వంచేరు; తమ ప్రియమైన బంధువుయొక్క మరణవార్త విన్నట్లుగా వారు దిగాలుపడిపోయేరు.

"గాడిద గుడ్డంటహో. . . .'' అని వొక రైతు యువకుడు అరిచేడు.

"నన్నేం శెయ్యమంటారు, దొరా? దొరోరు చెప్పమంటే నేను శెప్పినా . . . .'' అని వెట్టివాడు అన్నాడు.

"అరి నువ్వు వుండసోట వుండవేందిరా?'' వొక ముసలాడు అన్నాడు.

"యేంటి వుండేది? పన్లగాలంలో మనం గుఱ్రపుశాల గట్టాలీ?'' ఆ రైతు యువకుడు మండిపడ్డాడు.

"అయ్యో దొరా, మద్దెలోనాదేదండీ?'' మళ్లీ వెట్టివాడు అన్నాడు.

"అంతేలేరా, నీ పని మహ వాటంగవుండది . . . . హు . . . .''

"ఆరి దేముడ! కొంపకి నీవేదో తిప్పలు తెచ్చేదాక యిట్టాగే వాగుతుంటావురా! రా, పోదాం రారె....'' అని ఆ ముసలాడు ఆ యువకుణ్ణి దూరముగా లాక్కొనిపోయేడు.



# కొత్త మనుష్యులు

మహనీయు లెందరోగలరు యిచ్చటను !
మహ ఘనంబైనదీ మానవజాతి !
అవ్వారిగల్గిన నూత్నలోకం బా
నివ్వాళు లివ్విగో నీకు మాయమ్మా !

- షేక్స్‌పియర్ యొక్క "ది టెంపెస్ట్" లో మిరాండా.



**ఆ** మరుసటి రాత్రి వీరన్న పాడుబడిన యిల్లు మహసందడిగా వుంది. అది దెయ్యాల కొంపని ఆ వూళ్లో అంటూ వుంటారు. అసలీకొంప గురించి వింతకథ-మామూలుదే-వుంది.

నాలుగేళ్లకిందట, దెయ్యాలుపట్టి పీడించటం మూలంగా వీరన్న కొడుకుల్లో నలుగురు - బాగా యెదిగినవాళ్లే - చచ్చిపొయ్యారు. చుట్టూవున్న యిరుగుపొరుగువారు చాల భయపడి పోయేరు. ఏమో, యింటి పక్కనేవున్న దయ్యాలు తమ యిళ్లకి రాకుండా, తమని పట్టుకోకుండా వదులుతాయా? అందులోనూ నలుగురు కుర్రాళ్లని - యెద్దులాంటి మనుష్యుల్ని - విరుచుకొని తిన్నాయయ్యో! ఆ? అందువల్ల, ఆ యింటిని శుద్ధిచేయించమనీ, యిక ఆ యింట్లో వుండకుండా వేరే యిల్లు కట్టుకోమనీ, ఆ యిరుగు పొరుగువారు వీరన్నకి సలహాయిచ్చేరు. సరే, తప్పేదే ముంది? అదీగాక, తనకు యిక మిగిలివున్న ఆవొక్క కొడుకునీ - అంటే సోమన్నని - బతికించుకోవాలంటే యిక అంతకంటే మంచి మార్గంలేదు. ఆ మీదట వీరన్న భూతవైద్యుని పిలిపించేడు. ఆ భూతవైద్యుడు బుగ్గమీసాలూ, యెర్రటికళ్లూ కలిగుండి భీకరంగా వుంటాడు. వాడు మూడు రాత్రిళ్లపాటు హ్రాం హ్రీం అని పెడబొబ్బలు పెట్టి యిరుగు పొరుగువాళ్లని అదర గొట్టేసేడు. తరువాత వీరన్నా, భూత వైద్యుడూ, యింకా కొంతమంది వీరన్న చుట్టాలూ కంటివెంట నీళ్లుకారేటంత మస్తుగా కల్లుతాగి, తమలోతాము అరుచుకొని, తగవులాడుకొని, నేలమీదపడి అటూ యిటూ దొర్లి, యింట్లోవున్న దయ్యాల్ని వదల గొట్టేసేరు.

తర్వాత ఆ యింట్లోనే వుండేందుకు వీరన్న ధైర్యంచాలక వేరే ఇంకొక గుడిసె వేసుకొని దాంట్లో కాపురం పెట్టేడు.

అందువల్ల, "కమ్యూనిష్టు కుర్రోండ్లు" వీరన్న వద్దకి వొకనాడు వచ్చి ఆ దయ్యాలకొంపని తమ ఆఫీసుకోసం అద్దెకి యిమ్మని అతన్ని అడిగినపుడు, వీరన్న అదోరకంగా మొఖంపెట్టి, వణికే గొంతుతో వద్దో మొర్రోమని అన్నాడంటే ఆశ్చర్యమేమున్నదీ? దెయ్యాల కొంపలో

ఆఫీసుపెడతారా? యిదెక్కడున్నావుందా? ఆ కమ్యూనిస్టులు తన బంధువులు కాదనుకో, అయినప్పటికీ, యెవరైతేయేమి? తాను యేదో అద్దెవస్తుందిగదా అని సంతోషిస్తే, రేపు యేదన్నా జరిగితే పాపం వాళ్లకిమాత్రం నష్టంగాదూ? డబ్బుకోసమని కేవలం మనమేలు చూసుకొంటేనే చాలా? మంచీ చెడు యేమీ అక్కర్లా? అందువల్లనే వీరన్న వద్దుబాబు అని మహ చెప్పిచూశేడు.

"యినండి దొరల్లాలా, నామాటినండి, నాకు నా కన్న కొడుకులైనా మీరైనా వొక్కటే, యింకో యిల్లు చూసుకోండి..... యిదంతా శెప్పేది మీ మేలుకే!" అని వీరన్న బతిమాలేడు.

వూహూఁ, ఆ కుర్రాళ్లు వింటేగా!?

"దెయ్యాలా?" అని చట్టిముక్కు, పిల్లికళ్లూగలిగి యేపొద్దూ మున మున లాడుతావుండే సైదులు అనే కుర్రాడు ఖయిఁక్కుమన్నాడు. "వాటిని-ఆ దెయ్యాల్ని-రానియ్యి, ఆటిని జుట్టు అట్టా బట్టుకొని గిర గిరా తిప్పి నేలకేసి కొడతం! హుఁ. తెలిసిందా వీరన్న?"

"అట్టా అనబాకండిదొరో, అట్టా అనబాకండి. దెయ్యాల్ని మీరు యెంతగా యెక్కిరిస్తే అయ్యి మీమీద అంతగా పగబడతయ్యి...." అని వీరన్న బెదురు చూపులు చూసేడు.

"గాడిదగుడ్డు! యీపటేళ్లూ,యీ పట్వారీలూ, యీ జాగీర్దార్లూ - వీళ్లంతా యెవరంటావ్? వీండ్లు దెయ్యాలుగాదు? మణుసులా? అయితే, రోజూ యీ దెయ్యాలబాధ పడేమనం, ఆ దెయ్యాల[illegible]క్కడా కనపడని ఆ దెయ్యాలకి - యెందుకు బయపడాలీ? ఆ? ..." అని సైదులు మళ్లీ [illegible]డు.

[illegible] వీరన్న యెంతచెప్పినా వినక, వారు ఆ కొంపని తమ ఆఫీసుకింద అద్దెకి తీసుకొన్నారు. అయితే, అప్పట్నుంచీ ఆ యింట్లో దయ్యాలు అరవటం యిరుగుపొరుగు వాళ్లెవరూ వినలేదు.

"వాండ్లు కొత్తరకం మడుసులయ్యా - యీ కంనిష్ట్ కుర్రోండ్లూ! ఆ? లేకపోతేయేంది? మనమేమో ఆ యింటికేసి సూట్టానికే గిజ గిజ లాడతాంటిమి. మరి వాండ్లేమో యే బయమూ గియమూ లేకుండా యింట్లో జొరబడితిరి, పైగా అదేందో దాంటో పెడితిరి! ఆ? హుఁ - వాండ్లు నిజంగా అదోకరకం కొత్తమడుసులయ్యా ....." అని యిరుగు పొరుగువాళ్లు తమలో తాము గుస గుస లాడుకున్నారు.

[illegible]ంకే అనుమానస్తుడైన వీరన్నగూడా కమ్యూనిస్టు కుర్రాళ్ల నిర్భయత్వానికీ, పట్టుదలకు ఆశ్చర్యపడకుండా వుండలేకపోయేడు.

## 2

ఆ రాత్రి గ్రామ కమ్యూనిస్టు సెల్లు మెంబర్లు వొక్కొక్కళ్లే ఆ యింట్లోకి చేరుకుంటున్నారు. వచ్చినవాళ్లు వొక మురికి చింకి చాపమీద కూచుని యేవో కబుర్లు చెప్పుకుంటూ, చుట్టలో బీడీలో తగలేస్తూ, తెరచివున్న వాకిలిగుండా వుమ్ములూస్తూ, రవజ చేస్తున్నారు. తలుపు

ప్రక్కనే నిశ్చలంగా వెలుగుతోన్న వొకదీపం మనుషుల ముఖాలమీదకీ, గోడల మీదకీ, గోడల మీదవున్న బొమ్మలమీదకీ కాంతి చిమ్ముతోంది. గోడమీద అంటించబడివున్న వొక పెద్దబొమ్మ లోని స్టాలిన్ వీరిని వోరగంటితో చూస్తూ చిరునవ్వు నవ్వుతున్నాడు.

ఆ సెల్లు సెక్రెటరీ ఐన రామిరెడ్డి యింకా రాలేదు.

"భలేమొనగాడు - యీ రామిరెడ్డి!" వుండి వుండి సైదులు మునమున లాడేడు. "మనందర్నీ సెల్లు మీటింగుకి రమ్మని, అఖరికి బువ్వన్నాతినే తీరిక యివ్వకుండా, తొందరపెట్టి తానెక్కడో మాయమైపోయి పొద్దకి పొద్దోయివస్తడు! హూఁ-భలేమొనగాడు!"

"పిచ్చగా మాట్టాడమాక" యెర్రటి పెదిమలూ, మెరిసే కళ్లూ గల్గి చక్కగా చూపరిగా వుండే కోటిరెడ్డి మందలించేడు, "యేంటా వాగుడు?".

"గాడిదగుడ్డు!" సైదులు రుంజుకొన్నాడు.

తర్వాత వారిద్దరూ యెంత తీవ్రంగా వాదించుకొన్నారంటే, అక్కడికి దగ్గిర్లోనే కొత్తయింటో వుంటూన్న వీరన్న యీ గొడవ విని పరిగెత్తుకుంటూ వచ్చేడు.

"యేంలేదు, యేంలేదు, యిదేమి పోట్లాటగాదు." సైదులన్నాడు.

వీరన్న అంతమాత్రానికి నమ్ముతాడా? యింత ముందువరకీ, తాను వచ్చేవరకీ పెద్దగా అరుచుకొనిరీ! అందువల్ల తగాదా పడవద్దని వారికి సలహాయిచ్చి వీరన్న వెళ్లిపోయేడు.

"ఆలస్యంగా వచ్చానా?" అంటూ వొడ్డూపొడుగూ, అందచందంగలిగి, చక్కటి వంకరదేలిన ముక్కూ గల్లిన రామిరెడ్డి లోనికివస్తూ అన్నాడు. "నేను మాలపల్లి వెళ్లా, అక్కడొక ముఖ్యమైన సమస్య వస్తే దాని సంగతి జూస్తా యిప్పటిదాకా అక్కడేవుండా, అందుకని ఆలస్యమైంది..."

తర్వాత, అతని వెనకాలే, తాలూకా పార్టీ ఆర్గనైజరు అయిన శ్యామసుందరరావు వచ్చేడు. అతను వచ్చీ రావటంతోనే రామిరెడ్డి వంకచూస్తూ, "యిక మొదలుపెడదామా?" అన్నాడు.

"ఆఁ అంతా వచ్చారు..." అని రామిరెడ్డి అతనివంక చూడకుండా తల యింకొకవేపుకి తిప్పి అన్నాడు.

రామిరెడ్డియొక్క ఆ కఠినవైఖరికి శ్యామసుందరరావు హృదయంలో యేదో ముల్లు గుచ్చుకొన్నట్లయింది. ఆ బాధను బయటకు వదిలేస్తున్నట్లుగా అతను నిట్టూర్పు విడిచేడు.

శ్యామసుందరరావుది తెలంగాణా కాదు; అతనిది గుంటూరు జిల్లా, ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ యీ మధ్యనే అతన్ని ఆ తాలూకా ఆర్గనైజరుగా పంపింది.

అటూ యిటూ, అందరివంకా చూసి శ్యామసుందరరావు ప్రారంభించేడు :

"కామ్రేడ్స్! మనం యిక్కడెందుకు సమావేశమయ్యామో మీకు తెలుసు, నిన్న మీరు చాటింపు విన్నారు. ప్రజలందరిచేతా వెట్టిచాకిరీ చేయించి, యీ జాగీర్దారు జగ్గారెడ్డి వొక గుర్రపుశాల కట్టించదల్చుకొన్నాడు....."

"హుఁ. కట్టిస్తాడు, కట్టిస్తాడు!" సైదులు ఖఁయిక్కుమన్నాడు.

"వినండి. యీ నిరంకుశ రాక్షసచర్యని మనం వ్యతిరేకించాలి. మనమంతా ప్రజలమధ్యకిపోయి వారికి యిదంతా చెప్పి, వారిని యీ వెట్టిచాకిరికి యెదురుతిరిగేట్లు చేయ్యాలి..."

"కాని ప్రజలు వింటారా?" సైదులు అడిగేడు.

"యెందుకు వినరు?" రామిరెడ్డి, కోటిరెడ్డి వొకేసారి అన్నారు.

"మీరుండండి కామ్రేడ్స్... యెందుకు వినరు? ప్రజలచేత బలవంతంగా వెట్టిచేయించుకొనే అధికారం యీ జాగీర్దారుకి యెవరిచ్చారు? ప్రజల్లో మనం విశ్వాసముంచాలి. కాని ఆ విశ్వాసమనేది వొక్కసారి, వొక్క దెబ్బతోరాదు; ప్రజల్లో మనం యెప్పుడూ పనిచేయడం ద్వారానే అది వస్తుంది. యేమంటారు?"

"ఆఁ. గోంగూర! మన మెప్పుడు యెట్టా పనిచేయగలం? పొద్దన్నే లేచి, పొద్దుగూకేదాకా ఆ పొలాల్లోబడి కొట్టుకుంటాంటిమి. మరి...." సైదులు అన్నాడు.

"చూడు, కామ్రేడ్ ప్రజల్లో పనిచేయాలని అన్నానంటే, దాని అర్థం యిర్వైనాలుగు గంటలూ చెయ్యాలని గాదు. మనం పొలంపనో మరొకటో చేసేప్పుడు వొక్కరమే చెయ్యంగందా? యెవరో నలుగురిమధ్య చేస్తాంగదా? చూడూ, ఆ నలుగురికే చెప్పు. అంతేగాదు. తీరికవున్నప్పుడు యిళ్లవెంట పోయి పదిమందికి మంచీచెడూ చెప్పు..... చూడూ, ప్రజలు యివాళ కళ్ళు తెరవకపోతే, రేపు తప్పకుండా తెరుస్తారు. ప్రజల్లో నమ్మకముంచాలి. పట్టుదలతో పనిచేయ్యాలి...."

తర్వాత, భూమికోసం తెలంగాణా రైతాంగం జరపాల్సిన పోరాటం గురించీ, యింకా మరికొన్ని సమస్యల్ని గురించీ శ్యామసుందరరావు మాట్లాడేడు; ఆ తర్వాత తానే సందర్భంలో చెప్పకుండా విడిచిపెట్టని సోవియట్ రష్యాయొక్క మహోజ్వల ఆదర్శాన్ని గురించి వివరంగా చెప్పి, సెల్లు మెంబర్లు తమ ఆత్మ విమర్శనా రిపోర్టుయిచ్చిన తర్వాత, సమావేశం ముగించాడు...

మర్నాడు పార్టీ మెంబర్లంతా గ్రూపు మీటింగులు పెట్టి, ప్రజలకి వెట్టిచాకిరి నెదిరించమని చెప్పేరు. వారు చెప్పినదంతా ప్రజలు శ్రద్ధగావిని, తలలువంచి, నిట్టూర్చేరు!



# గుర్రపు శాల

ఏల వొక్కరి సుఖం కోసం

చాలనుంది శనిపీడ నొందాలీ?

- లూక్రెషీ (షేక్స్పియర్)



ఆనాడు దుర్భరమైన యెండకాస్తోంది; గాలి సవ్వడిలేదు; చుట్టు ప్రక్కలంతా తుక తుక వుడికిపోతోంది. దిక్కుచక్రం చుట్టూతా యెండమావులు ఆకలితో నాలికలు సాచి తెగ రొప్పుతున్నాయి. ఇంత యిదిగావున్నా పటేలు ఒక పాత గొడుగుకింద నుంచుని అరుస్తూ, తిడుతూ వున్నాడు.

"హుం. తొందర గా కానియ్యండిరా, కుక్కల కొడకల్లాలా. హుం. తొందరగా... త్వరగా ..." అని అతను విరామం లేకుండా మొరిగేస్తున్నాడు.

అతనికి ఆకలేస్తున్నప్పటికీ, జాగీర్దారు యొక్క మోహర్బానీ కోసం అతనలా బెక బెక మంటున్నాడు. ఆ ప్రదేశం జాగీర్దారు బంగళాకి దగ్గర్లోనే ఉంది. పటేలు యొక్క కంఠ ధ్వని అక్కడికి వినిపించి, "భేష్ ! భలే ! మన పటేలు విశ్వాసం గల సేవకుడు సుమా! !" అని ఆ జాగీర్దారు అనుకొని తీరాలి.

చాలా సుత్తులు రాళ్ళు పగలగొట్టి సరిజేస్తున్నాయి.. యే గాలి ధూళీ లేకుండా విపరీతంగా వుక్క బోసే ఈ వాతావరణం లో ఆ సుత్తుల మోత చికాకు కల్గిస్తో, కర్ణకఠోరంగా వుంది. చాలా మంది రాళ్ళని మోసుకొని పోతున్నారు; యింకా చాలామంది వాటిని గోడలుగా పేర్చుతున్నారు; గుర్రపు శాల అతివేగం తో తయారు కాబడుతోంది. అయినప్పటికీ పటేలు నోరు మాత్రం మూతపడేట్లు లేదు,

"రేయ్ ! అరేయ్ ! నిన్నేరా పిల్చేదీ... యిట్లారా.." నేల మీద విసిరేసిన కుళ్లి పోయిన కోడి గుడ్డు లాగా పటేలు పగిలి పడ్డాడు.

నల్లగా, సన్నగా వున్న వీరన్న వచ్చి నుంచున్నాడు. "యేరా ముండా ! నా మీద ఒక గజం యెత్తున వున్నావేరా ! ! చూడూ .....యేంరోగం ?"

"జరం, కడుపు నెప్పి......"

వూ. కానియ్, యింకా చెప్పు , యింకా చెప్పు : కలరా, టైఫాయిడు, మలేరియా ...గొడ్డుముండా కొడకా ! రాళ్లనట్టా కింద పడేస్తావెందుకూ? సరిగా యెత్తుక పోలేవూ ? ఆ? చెప్పూ........"

వీరన్న గుడ్లు మిటకరించి చూస్తున్నాడు.

''దొరా, ఆయనకి జరమండీ. యేంది యీరయ్యా దొరగారితో ఆ సంగతి శెప్పరాదు?'' అని అటుగా వొకరాయి మోసుకొని పోతున్న పాపన్న అనే హరిజనుడు అన్నాడు.

''నోర్‌ముయ్, లంజాకొడకా !'' పటేలు పగిలిపడ్డాడు. ''నిన్నెవరు మాట్టాడమన్నారు? నీ పని నువ్వు యేడవరా కుక్కా...... హు...వీరన్నా, యికపో. జాగర్త.... పో.. హు. జరం! యీ లంజాకొడుకుల కెప్పుడూ యేదో వొకరోగం వస్తానే వుంటది!... యేంటి, నువ్వింకా యిక్కడే యేడ్చావా!'' అని పటేలు వీరన్న వైపుకి తిరిగేడు.

భయంతోను, వె(ర్రివినయంతోనూ వీరన్న యింకా అక్కడే వున్నాడు; పటేలు మరోసారి ఘుయ్యిమని మొరిగే దాకా వీరన్న పోలేదు.

కొంతమంది కూలీలు గలిబిలిగా అరుస్తూ, తమచేతుల్లో వొక గాయపడ్డకూలీని ఎత్తుకొచ్చాడు. గోడమీద నుంచి వొక రాయి కాళ్లమీద పడటంమూలకంగా ఆ కూలీ కాళ్లు అతి ప్రమాదకరంగా దెబ్బతిన్నాయి. రక్తంలో ముంచి లేవనెత్తినట్లు ఆ రెండు కాళ్లూ రక్తకొల్లుగా వున్నాయి. అతడొక పండు ముసలాడు, నల్లటివాడు. కట్లపాము కరచినప్పటికి మల్లే అతని నోటి మూలల నురుగు దొబ్బలు పడుతున్నాయి; మలేరియా రోగికి తెరవచ్చినప్పటికిమల్లే అతని శరీరమంతా వూగిపోతోంది.

“నోర్ముయ్యండి. లంజాకొడకల్లాలా! అరవమాకండి'' అని పటేలు ఘుయ్యిమన్నాడు.

మనసులో పటేల్ని లక్ష తిడుతూ ఆ కూలీలు కిమ్మనకుండా వూరుకున్నారు. పటేలు చెప్పినాక, ఆ ముసలాణ్ణి చు(రుమనే ఆ నేలమీదనే పడుకోబెట్టి, వారు తమ తమ పనులకి వెళ్లేరు.

చీలమండలపైన ఆ ముసలాడి కాళ్ళు విరిగిపోయినాయి; విరిచిన కోడిపెట్ట తలలాగా అతని పాదాలు వేలుకాడుతున్నాయి. పడుకోబెట్టిన మరుక్షణంలోనే అతని కాళ్లచుట్టూ యె(ర్రటి రక్తపు మడుగు వొకటి యేర్పడింది. తొడలవరకూ అతని కాళ్లు లావుగా వుబ్బి, నల్లగా కందిపోయివున్నాయి.

అదేదో వెధవ కుళ్లికంపుగొట్టే గేదెశవం అయినట్లు, పటేలు అసహ్యంతో ఆ ముసలాడి వంక చూసేడు; ఆ భయానక దృశ్యానికి పటేలుకి వొళ్లు కంపించింది. మరణ వేదనలో గురక పెడుతున్న ఆ ముసలివాణ్ని చూడగానే పటేలు హృదయంలో బాధాకరమైన జాలికలిగింది; దాన్ని అణుచుకొనేందుకు అతడు పళ్లు బిగపట్టి ప్రయత్నించేడు.

పటేలు కొందరు కూలీల్ని పిలిచి “ యీ పిచ్చిముండా కొడుకుని'' అతని యింట్లో దిగబెట్టిరమ్మని చెప్పేడు.

వాళ్లా ముసలాణ్ని చేతులమీద యెత్తుకుని, నాలుగడుగులు వెయ్యగానే పటేలు వాళ్లని వెనక్కి పిలచేడు.

“యిదుగోరా. యీ అయిదురూపాయలు తీసికెళ్ళి, వాడింట్లో వాళ్ళకి యియ్యండి. యిదుగో?...'' అని తనకోటు జేబులోంచి స(రున వొక పాత మనీపర్సులాగి, అయిదురూపాయల నోటు వారికి యిచ్చేడు.

వాళ్ళు తిరిగొచ్చినాక, ‘యెట్లావున్నాడు?’ అనడిగేడు.

“ సచ్చిపోయిండు, దొరా!'' అని వాళ్ళంతా వొక్క సారే జవాబిచ్చారు.

# 2

అది మండు వేసంగి. ఉదయం. అప్పటికి పదకొండు గంటలు దాటింది. యీ గుర్రపు శాలవద్ద పనిచేసే వాళ్ళంటే తనకు ఆగ్రహం కలిగినట్లుగా సూర్యుడు నిర్దాక్షిణ్యంగా నిప్పులు చెరిగేస్తున్నాడు. యెండమావులు కుక్కరొప్పుడు రొప్పుతున్నాయి. దట్టమైన నీలిపొగతో చుట్టబడి ఉత్తరాన వున్న కొండలూ, తూర్పున వున్న అరణ్యమూ భయంతోనా అన్నట్లు వణకుతూ కనపడుతున్నాయి. చెట్లకొమ్మల సందున దూరిన పక్షులు నోళ్ళు తెరిచివుండి, అప్పుడప్పుడు మాత్రం చిరాకుతో కుఁయ్యి కుఁయ్యి మంటున్నాయి. ఎండ ఎంత తీక్షణంగా వుందంటే పనిచేసే వాళ్ళ శరీరాలు యిగుర్చుకుపోయి చెమట పోయటమే మానేసేయి.

ఇంతలో, హఠాత్తుగా ఆకాశమధ్యంలో ఒక నల్లటి మబ్బు అగపడింది. కొంతమంది కూలీలు ఈ చల్లటి మబ్బు క్రింద నుంచొని 'ఎంత సల్లగా వుండది, యెంతసల్లగా వుండది!'' అని లొట్టలు వేసారు.

'నోరుముయ్యండి లంజాకొడుకుల్లారా! యెక్కడున్నామనుకొంటున్నారు? మీ ముండమోపి గుడిసెల్లో వాగండా వాగుడు...' అని పటేలు భౌ మన్నాడు.

పనిచేసేవాళ్ళ గొంతులు యెండిపోయి, దాహంతో కొట్టుకాడుతున్నాయి. వాళ్ళు మంచినీళ్ళు కోసం అరవటం మొదలెట్టేరు.

"మంచినీళ్ళు, దొరా మంచినీళ్ళు!"

"దాహంతో సత్తున్నమండీ"

"బువ్వకి పోనీండి. బువ్వదినొచ్చినాక పొద్దాకే దాక పనిచేస్తాం"

పటేలు తనచేతిలోని వెండిపొన్ను కర్రని నేలకేసి కొట్టి "నోర్ముయ్యండి, లంజాకొడకల్లారా!' ' అని గై మన్నాడు.

వాళ్ళు గమ్మున వూరుకొన్నారు.

కొంతసేపటికి ఖాసిం వచ్చాడు. అతనొక ముస్లింరౌడీ. యిరవైయెనిమిదేళ్ళ వాడు, మచ్చల ముఖం, గుంట కళ్ళు, అతను పైజామా, ఒక నీలిరంగు బనీను తొడుక్కొనివున్నాడు. కాళ్ళకేవో బూట్లు వున్నాయి. నెత్తి పైనొక గొడుగుంది. యధాప్రకారం అతని వెనకాల, అతని గొడుగునీడ క్రింద తెల్లని బొచ్చు కుక్కపిల్ల వొకటి వచ్చింది. అసలు సంగతేమిటంటే జాగీర్దారు యెప్పుడు బైటకెళ్ళినా, అతనివెంట వొక నల్ల వేటకుక్క వుంటుంది, కనుక తనవెంట గూడా వొక కుక్కవుండటం నాజూకుగా, ఘరానాగా వుంటుందని ఖాసిం బహుశా అనుకొని వుంటాడు!

ఆ చిన్ని కుక్కపిల్ల ఎంత ముద్దువచ్చేట్లుగా వుందంటే, మామూలుగా కుక్కలంటేనూ, మనుష్యులంటేనూ అసహ్యించుకునే పటేలు దాన్ని 'చ్చొచ్చొచ్చొ!' అని పిలవకుండావుండలేక పోయాడు. కాని ఆ యెండ తీవ్రత మధ్య, ఆ వుడకపోతలో ఆ కుక్కపిల్లకి మర్యాదా సర్యాద

గ్నాపకముంటాయా? అది భౌమని పటేల్ని-మంచీ చెడూ చూడకుండా-విదలించి, దులపరించి, చీదరించుకొన్నది!

"ఓహ్! నీకుమల్లే నీ కుక్కపిల్లగూడా బహు చిర్రుబుర్రుమనే రకమయ్యా!!" అని యిక యేమీతోచక పటేలు యిహీహి అని యికిలించాడు.

ఖాసిం చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

తర్వాత ఆ యిద్దరూ అక్కడికి నాలుగ్గజాల దూరంలో వున్న వొక తాటాకు పాకలోకి వెళ్ళారు. అక్కడ మాత్రం, అంతమాత్రం చేత పటేలు తన "బాధ్యత" మరిచిపోతాడా? గూబలు పగిలే వడగాలి కొడుతున్నప్పటికీ, ఆ పాకకి అటొక కంతా యిటొక కంతా పెట్టి, ఆ కంతల్లో గుండా పనివాళ్ళని చూడసాగాడు.

"హెందుకయ్యా ఆ కంతల్? వడఘాలీ రాటంలేదు?" అని ఖాసిం అన్నాడు.

"అమ్మమ్మో! నీకు తెలవదయ్యోయ్. మనం కాసేపు అట్లా ఆదమరిస్తే యింకేముంది? దొంగముండా కొడుకులు ఆపర్నే నుంచోరూ?" అని పటేలు అన్నాడు.

'ఆ పోదూ. కేరేజాట్. వడఘాలీలో ఆ కూలీ లంఝాకొడుకూలకిమల్లే సస్తాం యేమయ్యా?'

"అదేమన్నమాట? పని పనే. పనిచేయించేటప్పుడు అది పనికి రాదు. అసలు నువ్వొచ్చానని యీ గుడిసెలో కొచ్చా. యిందాకటినుంచీ ఆపర్నే అక్కడ నుంచోలా? నాకు ఆకలి మండుకుపోతున్నది. యిక మనం ఆకలని యింటికెళ్తే, యింకా వాళ్ళేమన్నా యివతల పుల్ల అవతల పెడతారా?"

"సర్లే, సర్లే, హబ్బబ్బా! యేమి యెండయా, యేమి యెండ హాయ్ హాయ్!"

"మెల్లిగా అంటావేమయ్యా? యిందాకట్నుంచి ఆ ఎండలో ఆ ముండాకొడుకుల్తో వాగలేక చస్తావుండాననుకో..."

ఖాసిం పైజమా జేబులోంచి వొక చిన్న రుమాల తీసి ముఖం తుడుచుకున్నాడు.

"హబ్బా, హబ్బా! యేం యెండా, యేం యెండా!"

"మెల్లిగా అంటావేమయ్యా!? పొయ్యిమీద పెట్టిన కుండలో కూడుకి మల్లే వుడికిపోతున్నాననుకో, చూడూ-నమ్ముతావో నమ్మవోగానీ- రెండుకుండల నీళ్ళు తాగాననుకో! రెండు కుండల నీళ్ళు!! మరి ఆ ముండాకొడుకులు ప్రొద్దుటనుంచీ గుక్కెడు నీళ్ళన్నా తాగలేదే, యెట్లా ఆ మండుటెండలో పని చేస్తున్నారో ఆశ్చర్యంగా వుందయ్యా! ఆ?"

"వాళ్ళు మడుసూలయ్యా?" ఖాసిం వెగటుగా అన్నాడు. "అరే, వాళ్ళు ధున్నపోతులయ్యా-ధున్నపోతుల్!"

"మన దొరగారు హైదరాబాదెప్పుడు పోతారో? అని హఠాత్తుగా, సంభాషణమధ్య పటేలు అడిగాడు.

ఆ మాటల వెనకాల దాగివున్న రహస్యం యేమిటో ఖాసిం గ్రహించేశాడనేది స్పష్టం, యెందుకంటే పటేలువంక ఖాసిం అదోతరహాగా చూశాడు.

టాల్‌స్టాయ్ నవల-యుద్ధం, శాంతి లోని బెజుహోల్ యొక్క పెద్ద గుమాస్తా జాతికి ఆ యిద్దరు "నమ్మకస్తులూ" చెందుతారు, నక్కవినయమూ,కొంగజపమూ వారి ప్రధాన లక్షణాలు; ప్రతి ధనికుడి చుట్టూ యిలాంటి బాపతు వొకరో అరో వుంటారు. రోజూ కనీసం గడ్డిపరకన్నా తమ "దొరలు" ఆస్తిలోంచి తస్కరించుతుంటారు.

క్రొత్తగ వచ్చిన సిమెంటుబస్తాల్ని దృష్టిలో పెట్టుకునే పటేలు ఆ ప్రశ్న వేశాడని ఖాసిం పసిగట్టేడు.

"అంతేగదయ్యా?" అని ఖాసిం తల ఆడించుతూ అదో తరహాగా అనేశాడు గూడాను. పటేలు ఊఁ ఊఁ అన్నాడు.

తర్వాత వారి సంభాషణ ఆంధ్రమహాసభ మీదకీ, కమ్యూనిస్టు పార్టీమీదకీ పోయింది.

"యేమ్టివయ్యా వాళ్ళనీ లెక్కచేసేదీ?" అహంకారంతో ఖాసిం కనుబొమలెత్తుతూ అన్నాడు. "యీ సంఘాలు, గింఘాలూ కేరేజాట్" వాళ్ళూ యెంతామందీ? ఆ వూళ్లో యిద్దర్, యీ వూళ్లో యిద్దర్! కొరడా తీస్కో - బస్! మాలుం? హు హసల్ మీ హిందుల్కీ పిర్కా జాస్తివయ్యా. పిర్కా జాస్తీ!!! మీ హిందుల్ వొర్ధీ పిర్కా జాతీ..."

హిందువులు పిరికిజాతి అన్నందుకు పటేలుకి చుర్రుమని అంటుకొన్నది, 'తురకా, మరకా, యెగరేసి నరకా! మీకేం తెలుసు అంతకంటే?" అని అందామనుకొని, మళ్ళీ యెందుకులే అని తమాయించుకొని వూరుకున్నాడు.

కాని, ఆ వచ్చిన కోపాన్ని కాస్తా కూలీల మీద పటేలు వెళ్లగక్కేడు.

కంతలోగుండా చూస్తూ "ఏరే వీరన్నా, యిట్రారా" అని పటేలు వీరన్నని పిలిచేడు.

వీరన్న వచ్చి నుంచున్నాడు గుడిసె ముందర.

"నీ కెన్నిసార్లు చెప్పాల్రా, లంజాకొడకా?" అని ఖాసిం వంక చాటుగా వురిమిచూసి, పటేలు గుడిసె ముందర నుంచున్న వీరన్నని తిట్టేడు.

"జరం, దొరా, జరం..." అని వీరన్న నంగేడు.

అసలు వీరన్నకి పటేలుని బిగ్గరగా బూతులు తిడదామా అన్నంత వొగ్రం పెరిగొచ్చింది. కాని భయంతోనూ, తన పిరికిదనానికి తానే అసహ్యపడుతూనూ, వణుకుతూ వీరన్న అక్కడే నుంచున్నాడు.

కష్టం గలిగించే మాట వీరన్న యేమీ అనకపోయినప్పటికీ - బిచ్చగాణ్ణి చూచిన కుక్కకుమల్లే - ఖాసింకి మండుకొచ్చింది, ఆపళ్నే సర్రునలేచి, బైటకొచ్చి, నుంచున్న వీరన్నని నుంచున్న పాళాన తన చేతిలోని కొరడాతో చావబాదటం మొదలెట్టేడు. వీరన్న చాపచుట్టగా

కిందపడిపోయేడు. అయినా ఖాసిం వదిలిపెట్టలేదు. కుక్క రొప్పుడు రొప్పుతూ యింకా కొడుతూంటే, పటేలు గబుక్కున బేటికొచ్చి ఖాసిం చేతిలోని కొరడా లాక్కొన్నాడు.

"బలే మనిషివయ్యా మొత్తానికీ! ఛీ!" అని చీదరించుకొన్నాడు.

వీరాధివీరుడైన తన యజమానివంక కుక్కపిల్ల అదోవింతగా చూసింది.

తర్వాత ఖాసిం వెళ్లిపోయాడు.

"గజ్జికుక్క: దొంగలంజాకొడుకు!" పటేలు తిట్టేడు. పటేలు కొంతమంది కూలీల్ని పిలిచి కొత్తగా కట్టిన గోడనీడకి వీరన్నని చేర్పించేడు.

కూలీలకి యీ కొట్టిన సంగతి తెలిసింది, యేమిటేమిటో వాళ్లల్లో వాళ్లు గొణుక్కోటం మొదలెట్టేరు.

"యేంరా మీ రణగొణా? కానియ్యండి దబ్బునా..." అని పటేలు అరిచి, వీరన్న పడుకొన్న చోటికి వచ్చేడు. వీరన్న కోడలు గంగమ్మా యింకా కొందరూ అక్కడికి పరుగెత్తుకొని రాబోతుంటే "వచ్చారా, యిదిగో!" అని పటేలు తన చేతిలోని పొన్నుకర్రని ఝుళిపించేడు; వాళ్లు వెనక్కి తిరిగిపోయేరు.

వీరన్న చలిబుట్టినవాడికిమల్లే వొణుకుతున్నాడు.

"నామాట విన్నావంరా? చూడు యిప్పుడేమో ఆ వెధవ తురకాడి చేతుల్లో దెబ్బలు తింటివి! పో, యింటికి పో, యింటికి పోయి వంటికి బాగా కొబ్బరినూనె మర్ధనచేయించు, పో....' ' అని పటేలు అన్నాడు.

తూలుతూ, సోలుతూ, వీరన్న యింటికెళ్లేడు.

పటేలు తిరిగీ ఆ తాటాకుల గుడిసెలోకెళ్లినాక వీరన్న కోడలు - గంగమ్మ - వచ్చి గుడిసె ముందర నుంచుంది.

గంగి యువతి, చక్కనిది, బలంగలది. నల్లటి కళ్లు, జీబిరిగావున్న రాగిజుట్టు ముత్యాల్లాగావున్న ఆమె ముఖం మీది చెమట బిందువులు ఆ యెండలో తళుక్కుమని మెరుస్తున్నాయి.

"దొరా, దొరగారూ.." అని ఆమె నీరసంగానూ, యేదో ఆదుర్దాతోనూ పటేల్ని బతిమాలింది. "నీ కాళ్లకి మొక్కుతా... పిల్లతల్లిని.. పిల్లకి పాలియ్యాలి....నన్ను పోనియ్యండి...దొరా, మీ కాళ్లకి మొ[illegible]తా....'

పొద్దున్నే పనిలోకొచ్చేప్పుడెప్పుడో గంగి పిల్లకి పాలిచ్చుకొని వచ్చింది; అంతే, మళ్లీపోలేదు. యీ వడగాలికి బిడ్డ యెలావుందో! గుండ్రంగా ఆమె స్తన్యాలు పాలతో వుబ్బి వున్నాయి; వొక్కొక్క బొట్టే పాలుకారి రవిక తడిసిపోతూ వున్నది.

పటేలు పరాకుచూస్తో గంగికి అనుమతి యివ్వలేదు. గంగి కళ్లు చెమ్మగిల్లేయి. ఆమె దడాలున గుడిసెలోనికొచ్చి పటేలు రెండు కాళ్లు వాటేసుకొన్నది. "దొరా, నీ బానిచని..."

స్తన్యాల వత్తిడివల్ల పాలతో అతని కాళ్ళు తడి ఐనాయి. అసహ్యంతో ముఖం చిట్లిస్తూ, "పో ముండా, పో పో..." అని పటేలు చేయి విసిరేడు. "హు పిల్ల, పిల్ల! పిల్లని పిసికిపారెయ్; పీడ వదుల్తుంది!!"

యింటికి పొమ్మనగానే గంగి ముఖం ఆనందంతో వికసించింది. ఆమె లేచి బేటికొచ్చింది.

అంతవరకూ పటేలు ఆమెని దీక్షగా చూడలేదు. ఇప్పుడామె వొంపు సొంపుల్ని అతడు కన్నారా చూసేడు; బుర్రలో యేదో పురుగు తొలిసింది; చప్పున గంగిని వెనక్కి పిలిచేడు. దిగాలుపడుతూ గంగి తిరిగొచ్చింది.

పటేలు చిరునవ్వు నవ్వేడు, అతని చిరునవ్వు ముఖాన్ని చూసి గంగి యేమి ఫరవాలేదుగందా అనుకొని సంతృప్తిపడింది.

"నువ్వు నేను చెప్పినమాట వింటావా?" అని, తిరణాలకిపోయి తిరిగొచ్చిన తండ్రి తన వెనకాలయేదో 'తాయం' దాచి పిల్లల్ని అడిగేట్లుగా, పటేలు గంగిని అడిగేడు.

"వినకేం, దొరా? నీ బానిచని..." అని గంగి అంది.

"సరే చూడూ - దొరగారి తమ్ముణ్ణి యెరుగుదువు గదూ?" అని పటేలు అడిగేడు.

అవును - ఆ పోకిరీ ముండాకొడుకుని గంగి ఎందుకెరగదూ? బాగా యెరుగును ! ఆ నీచుడి పేరెత్తగానే యేదో భయంతో కంపించిపోతూ గంగి యెరుగుదునన్నట్లుగా తలనాడించింది.

"సరిసరే. చూడూ - వొక్కసారి - వొక్కసారి చాలు - ఆయన్తో నువ్వు... వుంటే కోరింది దొరుకుతుందనుకో యేది కావలిస్తే అది! తెలిసిందా?"

గంగి దిమ్మరగొనిపోయింది.

"యిటు జూడవే పిచ్చిముండా. యిదుగో చూడూ - నేను నీ మేలుగోరేవాణ్ణిగాని, కీడుగోరేవాణ్ణి గాదు. నీకు తండ్రితో సమానమైనవాణ్ణి..."

యిక గంగి ఆగలేకపోయింది.

"దొరా నా మాట గూడా యింటారా? మీరు నాకు తండ్రంటివోళ్లయితే తండ్రి యాడనన్నా తన కూతుర్ని పరాయి మొగాడితో పడుకోమని శెబుతాడా!

ఆ యెత్తిపొడుపుకి పటేలు గోపంచెందలేదు.

"దాంట్లో యేముందే పిచ్చిముండా? అంత భయపడాల్సిన అవసరమేమున్నది చెప్పూ?ఆ? పిచ్చముండా, బయపడమాక, యిక పో. మరచిపోమాక... రేపు రాత్రికి..."

యేమీ తిరుగుజవాబు యివ్వకుండా, రేపు రాత్రికి తన పసిబిడ్డ గొంతు యెవరో నులిమివేస్తారని తెలుసుకున్న దానికిమల్లే భయపడుతూ; లేకపోతే కాశీమజిలీ కధల్లోలాగా, యే దేవతకో తన బిడ్డని బలియివ్వక తప్పదని తెలుసుకొన్న తల్లికిమల్లే వణికిపోతూ, కిందచూపులు చూస్తూ, భారంగా ఒడుగులువేస్తూ, గంగి యింటిముఖం పట్టింది.

# 3

భుజం మీద వొక నాగలి పెట్టుకొని రంగారెడ్డి కంసాలి యింటివద్ద నుంచి వస్తున్నాడు. అప్పుడే బేటికి వచ్చిన పటేలు అతన్ని చూచి పిలిచేడు. ఆ మీద రంగారెడ్డి తనలో తానేదో గొణుక్కొని - బళ్లోకెళ్లకుండా తప్పించుకొని తిరిగే పిల్లాడు చిర్రు బుర్రులాడే తండ్రి వద్దకి వెళ్ళేట్లుగా - అయిష్టతతోనూ, భయంతోనూ గుడిసెవద్దకి వచ్చేడు.

"యెక్కణ్ణుంచీ?" పటేలు అడిగేడు.

"వడ్లబత్తుడి యింటికాడనుంచి"

'అది సరేగాని - యీపూట నీ బండి తోలుకురాలేదే? ఆ? కమ్యూనిష్టులు పురెక్కించారా?'

ముందు వెటకారంగా దీర్ఘంతీస్తూ మొదలెట్టి, తర్వాత అదరగొట్టేట్లు గొంతు పెంచుతూ - తాగుబోతు ఆఫీసరులాగా - పటేలు అడిగేడు.

దానిమీద, తన యెల్లెద్దు కుంటుతా వుందనీ, అదనీ యిదనీ రంగారెడ్డి వొక పెద్ద పురాణం యెత్తుకొన్నాడు. కాని యీ "వాగుడు" పటేలుకి నచ్చుతుందా? యెల్లెద్దు కుంటితే యెవడిక్కావాలి, నల్లెద్దు చస్తేమాత్రం యెవడిక్కావాలి? దొరగారు బండిని తోలుకురమ్మని అన్నారంటే తోలుకొని రావాల్సిందే, అంతే, యిక రెండోమాటలేదు !

"యేమిటా వాగుడు? ఆ!" పటేలు తన పొన్నుకర్రతో నేలని తట్టేడు. "యీ వెధవ్వాగుడుతో నాకేంపని గాని, నువ్వేపోయి దొరగారితో ఆ సంగతి చెప్పుకో, పో..."

"దొరగారు" అన్నమాట వినగానే రంగారెడ్డి కిందట్టు మీదట్టు అయిపోయేడు. రాక్షసుడైన ఆ జాగీర్దారు వద్దకెళ్లితే యేంజరుగుతుందో రంగారెడ్డికి బాగా తెలుసు; అందువల్ల యీ "విషపురుగు" తోనే యేదోవొక రాజీకి రావాలను కొన్నాడు. తను చేసిన యీ 'తప్పుడుపని' కి గాను నాలుగు రూపాయలు 'జుల్మానా' కింద యిచ్చుకొంటానని రంగారెడ్డి బతిమాలేడు. నాలుగు రూపాయల పేరు వినగానే పటేలు హృదయం మెత్తబడింది. ఆ మీద రంగారెడ్డి యింటికెళ్లేడు.

అప్పటికి పన్నెండు గంటలు దాటింది. జంబుక పటేలు యిక నేమాత్రం ఆకలికి తాళలేకపోయేడు. పని చేసేవాళ్లని కేకవేసి, అందర్నీ యింటికి అన్నాలకి పొమ్మని చేయి విసిరి, తాను యింటి ముఖంపట్టేడు.

యింటికి వెళ్ళమనగానే, తామెన్నాళ్ళుగానో అనుభవిస్తున్న బాధలన్ని తొలిగిపోయి నట్టుగా, ఆ భగవంతుడే దిగి వచ్చి, తమకేదో వెలలేని వరం ప్రసాదించినట్లుగా, పనిచేసే వాళ్ళంతా మహా సంతోషించి యిళ్ళకి వెళ్ళారు.

# 4

ఇంత మిరపగాయల పచ్చడీ, యింత జొన్నకూడూ, యిన్ని మజ్జిగ నీళ్లూ తాగి, వారంతా పనిలోకి తిరిగివచ్చారు.

వొంటికి పట్టించిన కొబ్బరినూనె ఆ యెండలో నున్నగా మెరుస్తుండగా, వీరన్న గూడా వచ్చాడు.

"నువ్వుగూడా వచ్చావేం, వీరన్నా?" అని పటేలు అడిగాడు.

"యేం శెయ్యమంటరు దొరా! రాకపోతే తమురు నాలుగు నూకుతారని బయం బుట్టివచ్చినా..."

"ఆరి పిచ్చముండా కొడకా! సరే, వచ్చినాడివి రానే వచ్చావు, ఏదో వొకపని చెయ్యి..."

చీకటిపడినాక పటేలు వాళ్లందర్నీ ఆ తాటాకులపాక ముందు చేర్చి, ప్రముఖంగా గొంతు సవరించి - ఫైలు తక్కువగా వున్న ప్లీడరు తనవద్దకి యెవరో క్రొత్త క్లయింటు వచ్చి నప్పటిలాగా చిరునవ్వు నవ్వుతూ - యిలా ప్రారంభించాడు.

"వినండిరా, పిచ్చముండాకొడకల్లారా. యెల్లుండి మన దొరగారింటికి పెద్ద ఆఫీసర్లు - పేద్దపేద్ద ఆఫీసర్లు! వస్తారు. వింటున్నారా?"

"యింటున్నం, దొరా."

"ఆ అదీ సంగతి! వినండి. కనక మీరంతా రేపు సాయంత్రానికే కోళ్లూ, కోడిగుడ్లూ, పాలూ, వెన్నపూసా వొకటేమిటి, యేది తేగలిగితే అది తీసుకొచ్చి దొరగారి యింటికాడ యివ్వాలి. ప్రతివాళ్లూ యేదో వొకటి తేవాలి. తెలిసిందా?"

"తెలిసింది, దొరా!"

"ఆ అదీ సంగతి! అట్లా తేకపోతే యేం జరుగుతుందో చెప్పండి..."

"కొరడా దెబ్బలు, దొరా!" అని వొక ముసలాడు పటేలు మెహర్బానీ కోసం పలికి, బానిస నవ్వు నవ్వేడు, కాని చాలామంది అతన్ని మింగేట్లు చూసేరు.

"ఆ అదీ సంగతి! తెలిసిందా? చూడండీ - కొన్ని మన యింటివద్ద గూడా యివ్వండి. కాని కోళ్లూ, కొక్కిరాయిలూ నాకొద్దురో! బ్రాహ్మణ్ణి..."

"శిత్తం, దొరా."

"ఆ యికపొండి. పాపం, చాలా పొద్దుగూకింది..." అని చెప్పి, తన జంబుకోపదేశానికి తానే సంతసపడుతూ కాంగ్రెసు నాయకులు 1948 నుంచి 1950 వరకూ పారా హుషారులో, పెద్ద పెద్ద అంగలు పంగల్లో, యిహీహీ వొహోహో అనుకుంటూ నడిచినట్లుగా నడుస్తూ - పటేలు వెళ్లిపోయేడు.

పనిచేసేవాళ్లు చిన్న చిన్న గుంపులుగా విడిపోయి తమలో తామేదో మాటాడుకొంటూ యింటిదోవ పట్టేరు. పోతే యిక వీరన్నా, పాపన్నలు మాత్రం అక్కడ దిగడ్డారు.

"కోడి గుడ్లా? గాడిదగుడ్లేం గాదు?'' అని పాపన్న గొణిగి, తుపుక్కున వుమ్మేసి, ఖాసింనీ, పటేలునీ,జాగీర్దారునీ సవాలక్ష బూతులు తిట్టేడు.

వీరన్న యిదేమీ వినిపించుకొన్నట్టు లేడు; అతని ఆలోచనల్లో అతను మునిగిపోయి పరాకుగా వున్నాడు; బాధాకరమైన అతని వొంటిపైన దెబ్బలు మరింత బాధకరమైన ఆలోచనల్ని పుట్టించాయి.

యెవరేనా తనని తిట్టినప్పుడుగానీ, కొట్టినప్పుడుగానీ వీరన్న అప్పుడేమీ చేయలేక అన్ని సహిస్తూ గమ్మున వూరుకొంటాడు; కాని ఆ తర్వాత యెవరేనా తనపట్ల సానుభూతి చూపితే తన పిరికితనానికి తనపై తానే కోపం చెంది కారాలు మిరియాలు నూరుతూ చిరుకోపీ, మెత్తని మనసూ గల తండ్రి తన బిడ్డని కొట్టిన తర్వాత జాలిపడి తనని తానే దూషించుకొనేట్లుగా వీరన్న తన పిడికిల్తో తన తలని బాదుకొంటాడు.

అలాగే, మరోసారి పాపన్న అదీ యిదీ తిట్టినప్పుడు, ద్వేషంతో పళ్ళు నూరుతూ వీరన్న మామూలు ప్రకారం తన తలని బాదుకొన్నాడు, అందుకు జవాబుగానా అన్నట్లు.



# ఆ వూరు

ఎవరండీ వీరూ!
ఎంతగానో వడిలి కంకాళాలై
వింతగాలిపే వస్త్రధారులై
నరలోకంలోని నరుల్లాగ అగపడకనే
నరలోకంలో నివసిస్తున్నారే!
ఎవరండీ వీరూ!

- మేక్ బెత్ (షేక్స్‌పియర్)



**యా**దగిరిగూడెం అనేది హైదరాబాదు సంస్థానంలోని వొక చిన్న జాగీర్దారీ గ్రామం. తక్కిన గ్రామాలకంటే అదేమీ వొక ప్రత్యేకమైన గ్రామంగాదు; ఆ సంస్థానంలోని దాదాపు అన్ని గ్రామాలకి మల్లేనే యాదగిరిగూడా ముక్కూ మొఖమూవున్న వీధులుగానీ, నీటిసౌకర్యంగానీ, రోడ్డుసౌకర్యంగానీ వొకటేమిటి? వొక్కటీ గూడా సరిగాలేదు. అసలు అవన్నీ వర్ణించటం మొదలుపెడితే వొక పెద్ద గ్రంథం అవుతుందంటే ఆశ్చర్యంగాదు. అందువల్ల మధ్యయుగాలకి ముందు పరిస్థితుల్ని మీరు వూహించుకోగలిగితే, నెత్తూరాలాంటి విప్లవపద జాలం వుపయోగించేవారిచేతా, మతతత్వం, కులతత్వం మొదలగు నీచపు ఆయుధాలచేతా రక్షింపబడే ఈ నైజాం నరకంలోని స్థితిగతుల్ని చక్కగా మీరు అర్థంచేసుకోగలరు.

తెల్లారు జామునే, 'మలికోడి' కూసినప్పుడు లేదా కొన్ని వేళల్లో 'తొలికోడి' కూసినప్పుడే - ఆ గ్రామస్తులు యిరుకుగా, మురికిగావున్న తమ చీకటి కొంపల్లోంచి బైటకొచ్చి తమతమ పనుల్లోకి పోతారు. మళ్ళీ పొద్దుగూకితేగాని ఇళ్లకి చేరుకోరు. యేపొద్దూ దగ్గుతూండే ముసలాళ్ళో, మంచంలోబడి మందిచ్చే దిక్కులేక మూలుగుతూండే రోగులో, పసిపిల్లలో తప్ప యింట్లో యెవరూవుండరు, మరీ, కాలం బాగాలేనప్పుడు వారుగూడా చచ్చినట్లు పనికి పోవాల్సిందే.

అంతా మెట్టభూమి. కొన్ని కొన్ని చోట్లకి మల్లే చెరువు కింద సాగయ్యే భూమి ఆ వూరికిలేదు. వున్న భూమి నిస్సారమైనది. సారవంతంజేసేశక్తి ఆ రైతులకిలేదు. గాలిపాటు బాగా వుండి నాలుగు వర్షపు చినుకులు పడితే భూమి కళకళలాడుతుంది, లేకపోతే క్షయరోగిలాగా పైరులు రోజురోజుకీ కృశించిపోతాయి.

తెల్లబట్టలూ, బెంగాలీ లాల్చీలూ, గాంధీటోపీలూ లాంటివి ఆవూళ్ళో అసలు లేవని చెప్పినా ఆశ్చర్యపడాల్సిన అవసరంలేదు; సోషలిస్టు అగ్రనాయకులలో నిజాయితీ యెంత

అరుదో, అవి ఆగ్రామంలో అంత అరుదు. ముతక మురికిబట్టలూ, నాటుచెప్పులూ, మాసిన తలలూ, వెర్రిచూపులూ, నీతీ, నిజాయితీ తనమూ, యింకా అలాంటివి యాదగిరిలో కనబడతాయి.

గ్రామానికి తూర్పున వొకదట్టమైన అరణ్యం వుంది. దాన్లో చిరుతపులులూ, పెద్దపులులూ మొదలైన భయంకర మృగాలు తిరుగుతూంటాయి. రాత్రిళ్లు అప్పుడప్పుడూ గ్రామంలో దొంగచాటుగా దొరబడి బర్రెనో, దూడనో, కొన్ని కొన్ని సమయాల్లో యేమనిషినో, నోటగరచుకొని పోవటం కద్దు. అందువల్ల రాత్రుళ్లు తమ పంట పొలాలవద్ద మంచెలమీదుండి కాపలాగాసే రైతులు నెగళ్లువేస్తారు రక్షణకోసం.

పోతే యిక ఉత్తరాన మొదలెట్టి దక్షిణం వరకూ, పడమటి దిక్కు కూడా కలుపుకొని వొక చిన్న కొండల వరసవుంది. ఆకొండల వరస మధ్యగుండా వాయవ్య మూలగా - సన్నగా, లోతుగా, వడిగా, చిన్న చిన్న సుడిగుండాలేస్తూ వూరికి దక్షిణంగాపోయే నది వొకటుంది. రాత్రిపూట దాని గలగల శబ్దాలు, మర్మరధ్వనులు - అబ్బా యెంత బాగుంటాయ్! ప్రియుడికి ప్రేయసీ చిరునవ్వువలె మత్తుగా, తల్లికి బిడ్డ కిలకిల ధ్వనులవలె హాయిగా, కమ్మగా వుంటాయి!!!

ఆ నది పేరు నాంచారమ్మ నది. యివతలి వొడ్డున వొక చిన్న గుడి వుంది. ప్రతి యేటా తిరుణాల జరుగుతుందక్కడ. ఆ గుడి నాంచారమ్మ అనే వీరవనితది; యిప్పుడామె వొక దేవత కింద భావించబడుతోంది. ఆమెను గురించి యీ కింది కథ వొకటుంది.

యెప్పుడో - తాత ముత్తాతలకాలంలో - ఆ వూళ్లో నాంచారమ్మ అనే రైతు స్త్రీ వుండేది. ఆ రోజుల్లో బందిపోటుల దాడులు తరచుగా, అకస్మాత్తుగా, అతి క్రూరంగా జరుగుతుండేవి. అయితే యేమయ్యిందంటే, వొకనాటిరాత్రి, గ్రామమంతా గాఢనిద్రలో వున్నపుడు, వొక బందిపోటు మూక యాదగిరిపై బడింది; దోచుకోటం మొదలెట్టింది. ప్రజలు హాహాకారాలు చేశారు; చేతులు కొట్టుకొన్నారు; రొమ్ము బాదుకొన్నారు - అంతా గంద్రగోళంగా వుంది.

కటిక చీకటి. యేమీ కనపడటంలేదు.

ఈ దోపిడీ, యీ రాక్షసత్వం చూసేసరికి నాంచారమ్మ హృదయంలో క్రోధాగ్ని భగ్గుమన్నది.

వెంటనే ఆమె పమిట గిర్రునతిప్పి నడుం చుట్టూ దట్టీ గట్టింది.

పదునుపాంటి గొడ్డలొకటి భుజాన వేసింది.

సింహంలాగా గర్జిస్తూ రంగాని కురికింది.

గొడ్డలితో తెగనరకటం మొదలెట్టింది.

దెబ్బదెబ్బకు తలలు తెగపడి క్రింద దొర్లుతున్నాయి.

తుపాను చెలరేగిన మహా సముద్రంలాగా ఆమె మహా గర్జన చేస్తూ మృత్యునాట్యం తొక్కింది.

చావగా మిగిలిన బందిపోట్లు తమ జాతకం బాగాలేదని గ్రహించి చెల్లాచెదురుగా పలాయనమయ్యారు.

పెడబొబ్బలు పెడుతూ, ప్రళయాట్టహాసం చేస్తూ నాంచారమ్మ వారి వెంటపడింది.

వారంతా అటూ యిటూ పరుగులు పెట్టి చివరకు నది వద్దకు చేరుకున్నారు. ప్రాణరక్షణ కోసం నదిలో దూకింది. వాళ్లు అవతలి వొడ్డు చేరారు. యీదుకని వస్తున్న నాంచారమ్మ మీదికి గొడ్డళ్లూ, కత్తులూ విసిరారు. లాభంలేదు. నాంచారమ్మ యీదుకొని వొడ్డెక్కింది.

భయంకర పోరాటం జరిగింది.

ఆ పోరాటంలో నాంచారమ్మ తుంపులు తుంపులుగా నరికివేయబడి నదిలోకి విసరివేయబడింది.

ఆనాటి నుంచి ఆ గ్రామంపై యే బందిపోట్లూ పడలేదు.

కాని......

కొన్నాళ్ళకి యివతలి వొడ్డున, వొకనాడు, నాంచారమ్మ శిలా విగ్రహం వొకటి పడివుండటం యెవరో చూచారు.

నాంచారమ్మ వెలిసిందన్నారు.

అక్కడొక గుడి కట్టించారు..........



# ఇంట్లో పెళ్లాం పోరు;
# వీధిలో పటేలు పోరు!

మర్మాన్ని తెలియంగబోము
కర్మ మిది యనుకొంటాము
మంచినో చెడ్డనో చేసుకొనే శక్తి
యెంచి చూస్తే మనకుందదే ముక్తి.

- ఆలీజ్ వెల్ దట్ ఎన్డ్స్ వెల్ లో హెలెనా (షేక్స్‌పియర్)

❊ ❊ ❊

**కొం**డారెడ్డి వుండే పూరికొంప వూరికి బాగా ఉత్తరాన వుంది. చాలా కిందా మీదాపడి కొండారెడ్డి పెద్ద కొడుకు రంగారెడ్డి యీ సంవత్సరం ఆ యిల్లు బాగుచేసి యేవో మట్టిగోడలు పెట్టేడు. చాలా యిళ్లకు మల్లేనే ఆ యింటికి గూడా కిటికీలులేవు; గోడల్లో రెండు కంతలు మాత్రమున్నాయి. ఆ కంతల గుండా వెల్తురు కొద్దిగా వస్తుంది. అయినప్పటికీ, పగటిపూట గూడా ఆ యింట్లో చీకటి బుయ్యారంగానే వుంటుంది. అందువల్ల బైట యెండలోంచి కళ్లు చిరతలాడి లోనికి వచ్చేవాళ్ళు - వొక్కసారి వెల్తురులోంచి చీకట్లోకి వచ్చినందువల్ల - కళ్ళు సరిగా కనపడక లోన వున్నవారిని ఢీకొనటం గూడా కద్దు.

ఆ యిల్లు కొంచెం పెద్దనే చెప్పాలి. కాని, పడుకోటానికీ కూచోటానికీ ఆ యింట్లో అందరికీ కలిపి రెండు కుక్కిమంచాలూ, మూడు మురికి చింకిచాపలూ మాత్రమే వున్నాయి. భారీగా వుండి, యెలుగ్గొడ్డులాగా భీకరంగావుండే కొండారెడ్డి యెప్పుడూ వొక మంచంలో కూచునో, పడుకునో వుంటాడు. అతనికి దాదాపుగా యెనభై సంవత్సరాలుంటాయి. అతని కళ్ళూ ముఖమూ, వృద్ధాప్యంతో వుబ్బరించివున్నాయి. రోజుకి రెండు మూడుసార్లు మాత్రం అవుసరాలకోసం అతను మంచంలోంచి లేస్తాడు.

ఒక మంచం కొండారెడ్డికిపోతే, ఇక రెండో మంచంలో రంగారెడ్డి రాత్రిపూట పడుకొంటాడు. యిక అతని భార్య కోటమ్మా, కూతురు సీతా, యిద్దరు చిన్నకొడుకులూ ఆ చింకి చాపలమీద పడుకోవాల్సిందే. అయితే యే చుట్టాలో వచ్చినప్పుడు - అదైనా అరుదుగానే లెండి - కొండా రెడ్డి వొక్కడు తప్ప అందరూ క్రింద పడుకోవాల్సిందే. ఆ చుట్టాలే యెక్కువ మంది వచ్చినప్పుడు రంగారెడ్డి, అతని కొడుకులూ యే యిరుగు పొరుగింటికో పోయి పడుకొంటారు.

అంతమాత్రానే అంతా చక్కబడిందనుకోరాదు. "బీదల మిత్రులు" ఐన నల్లులు ఆ మంచాల నిండా, చాపల నిండా.....ఆఖరికి గోడలనిండా, గుడ్డలనిండా.. వుండి, అందరూ మాంచి నిద్రమీద వుండగా, పోలీసు ఆఫీసర్లలాగా వారి అలసి సొలసి నిద్రించుతున్న దేహాలపై దాడి చేస్తాయి! చురుకు పుట్టిన చోట చటుక్కున చేత్తో కొట్టుకుంటూ, బూతులు తిడుతూ వారు రాత్రంతా కలతనిద్ర పోతారంటే వింతగాదు. ఆ పైన దోమలు! కొండారెడ్డి కి ముగ్గురు కొడుకులున్నారు. రెండో వాడైన సత్తిరెడ్డి కందులూ మొదలగు అపరాల మారుబేరగాడు. మూడోవాడైన నాగిరెడ్డి తన పెద్దన్న ఐన రంగారెడ్డి లాగానే వొక మామూలు రైతు. అంతా యేరిటి కాపురం పెట్టేరు. ముగ్గురూ తలా రెండు యకరాలు పంచుకోగా, ముసలాడికి వొక యకరం మిగిలింది. ముసలాడు తన పెద్ద కొడుకైన రంగారెడ్డి యింట్లోనే వుంటున్నాడు,

# 2

తొలికోడి కూసేటప్పటికే వాన కురిసింది.

ఇంకా చీకటిగానేవుంది ; తెల్లారలేదు. సన్నని తుషారం పడుతోంది. గోడకంతల్లో గుండా వచ్చిన చల్లని పిల్లగాలి ముసలాడి దేహానికి గిలిగింతలు పెట్టగా, ముసలాడు లేచి మంచంలో కూచుని, తనివితీరా గాలి యెగబీల్చి, సంతృప్తితో నిట్టూర్చేడు. తాము వెనక-చిన్నప్పుడు లిల్లాయిలు పల్లాయిలుగా బతికిన రోజులు మళ్ళీ రావుగదా అనే ముసలాళ్ళకి కలిగే తీయని విచార భావం ఆ నిట్టూర్పులో వుంది.

ఇంకా తెల్లారకపోవటంవల్ల కొండారెడ్డి తిరిగి మంచం మీద పడుకొని గురకనిద్ర పోసాగేడు.

తర్వాత రంగారెడ్డి లేచాడు.

వాన! హబ్బా యెలాంటివాన !!

వానని చూడగా, దాని చల్లని మెల్లని స్పర్శ తన శరీరానికి తగలగా బాగా అలిసిపోయిన మనిషికి వేన్నీళ్ల స్నానంచేయగా వచ్చేలాంటి తీయని మధురమైన మత్తు అతన్ని ఆవరించింది. ఆనందంలో అతనెంతగా ఆవేశం పొందాడంటే - తనకేదో నిండా బంగారు నాణాలువున్న పాత్ర దొరికినట్లు - వారందర్నీ లెగ్గొట్టి, యీ వానకురిసిన సంగతి వారికి చెప్పాలనుకొన్నాడు. కాని, ఆ వచ్చిన వుద్రేకాన్ని అణిచిపెట్టుకొని, బైటకి వెళ్లేడు.

హాయి గొలిపే చల్లని మందపవనం అతని దేహాన్ని సోకింది. అప్పటికి ఆ వాన తుషారం ఆగిపోయింది. అతను ఆకాశం వంక చూసేడు. యేవో నల్లటి మబ్బులు ఆకాశాన పరుగెడుతున్నాయి.

అతనికింకా ఆ ఆనందపు మైకం వదల్లేదు; యేదోవొక పని చెయ్యాలనే తలంపు అతనికి కలిగింది. కాని, యింకా తెల్లారని ఆ చీకట్లో చేసే పనేముంది? యేదన్నా పని కనపడుతుందా

అన్నట్లు అతను చుట్టూచూసేడు. వీధిలో యెవరూ లేరు. యిళ్లల్లోంచి యేదేదో యెవరెవరో మాట్లాడుకొనే ధ్వనులు చిన్నగా వినబడుతున్నాయి. పాలం పావాలనుకొన్నాడు. అయినా యిప్పుడక్కడ పడే పాటేమిటి? ఆఖరికి యింట్లోకి పోబోతూంటే అప్రయత్నంగా అతని దృష్టి యింటిచూరుకింద వున్న వొక కొయ్యదుంగ పైన బడింది; దాన్ని చూడంగానే వుత్సాహంలో అతని ప్రాణం లేచివచ్చింది; యిప్పుడు తనకేదో వొక పని కనపడింది!

ఆ దుంగని యెవరూ లేవకముందు పేళ్లు వేసిపెడితే, పొదిగే కోడిపెట్టలాగా యేపొద్దూ కస్సు బుస్సులాడే తన భార్య తప్పకుండా సంతోషిస్తుంది; యివాళ చిరబురలాడకుండా తనతో చక్కగా మాటాడుతుంది, మెలగుతుంది!

యెవర్నీ నిద్రలెగ్గొట్టకుండా వుండేందుకోసం, యెవరికీ తెలీకుండా ఆ పనిచేసి అందరికీ ఆశ్చర్యం ఆనందం కలిగించేందుకోసం, పిల్లిలాగా మెల్లగా అడుగులు వేసుకొంటూ లోపల కెళ్లి గొడ్డల్ని బేటికి తీసుకొచ్చి, ఆ దుంగని కొంచెం దూరం తీసికెళ్లి, పేళ్లు వేయటం మొదలెట్టేడు.

ఆ గొడ్డలి ధ్వనికి పొరుగింటి సుబ్బమ్మ వొక ముసలి విధవరాలు లేచి తన గోడకంతలో గుండా చూస్తూ, తానేదో దొంగ యొక్క ఆచూకీ సడికట్టినట్టు, యిలా అడిగింది.

"యేందది? యెవురు? ఆ?"

"నేను రంగారెడ్డి నత్తా. పోయి పడుకో." అని, ఆమె అడిగినందుకు తనకు గల్గిన కోపాన్ని అణుచుకొంటూ, రంగారెడ్డి చెప్పేడు.

కోటమ్మ గూడా ఆ గొడ్డలి ధ్వనికి లేచింది; వొళ్లు విరుచుకొంటూ ఆవులించింది. యెవగబ్బా ఆ గొడ్డల్తో నరికేదీ? అప్రయత్నంగా ఆమె తన పక్కన చూసుకొంది; తన పెనిమిటి అక్కడ లేడు. అయితే ఆ మనిషి తన భర్తన్నమాట! పిచ్చి మనిషి! నిద్ర చెడగొట్టుకొని యిప్పుడు పేళ్లు వేయకపోతే సుబ్బరంగా తెల్లారినాక వేసుకోరాదూ?

పెనిమిటిపట్ల కలిగిన జాలితో ఆమె హృదయం బరువెక్కింది. అతనికేదో మంచిమాటలు పలుకుదామని బేటికొచ్చింది. కాని, అనుకోకుండానే ఆమె చూరుకిందకు చూసింది. వొహో, దుంగలేదే!?

సర్రున భర్త వద్దకి పరుగెత్తి రొప్పుతూ యిలా అంది;

నీ శేతు లిరిగి తుంపులవ్వా, నీ శేతులిరగా! నీకు శివర రానూ! యేం రోగ మొచ్చింది? యేంది నువ్వు శేసేది? హయ్యో, హయ్యో...."

రంగారెడ్డి తెల్లబోయి నోరు వెళ్లబెట్టేడు. ఆ దుంగని కోటమ్మ యెక్కడో సంపాయించింది; దాన్ని కంసాలి యింటికి చేరవేయించి, మంచం చేయించి ఆమంచం తన కూతురు సీత పెళ్లికి యివ్వాలనుకొంది. కాని అదంతా ఆమె చెప్పి పెనిమిట్ని వొక లక్ష తిట్టింది.

రంగారెడ్డి తన తప్పును తెలుసుకొన్నాడు. అతని మనస్సు బాధపడింది. బీడీల కోసం యింట్లో బియ్యం దొంగిలించుతుండగా పట్టుబడిన పిల్లాడిలాగా అతను నత్తులుకొట్టేడు.

అయినప్పటికీ, కోటమ్మ కాస్తంత గూడ చల్లబడలేదు; తనదంతా తగులడిపోయినట్టు పెద్ద పెద్దగా రోదన చేసింది.

కాని, కొంచెంసేపటికి ఆ వేడి తగ్గినాక, ఆమె పురాతన భావాలు కలది అవటంవల్ల, తాను పెనిమిటిని దూషించినందుకు భగవంతుడేమి తిప్పలు తెచ్చిపెడతాడోనని ఆమె చాలా భయపడింది.

"తొందరపడ్డాను నాయనా. పిచ్చిదాన్ని. తెలవక మాటలు తూలాను. చెంపలేసుకొంటున్నా, రచ్చించు తండ్రి..." అని ఆమె భగవంతుడ్ని మనసులో మరీ మరీ ప్రార్థించింది.

తర్వాత ఆ ఆలుమగల్లిద్దరూ శాంతపడి, వొకరిపట్ల వొకరు విచారం నొందుతూ, పేళ్ళనీ మిగిలిన దుంగనీ తీసికెళ్ళి సూరు కింద పారేసి, లోనికెళ్ళేరు.

అప్పటికి కొండారెడ్డి మేలుకొనే వున్నాడు. ఆ గొడవ యేమిటని అతనడగ్గా, యేమీలేదని కోటమ్మ జవాబు యిచ్చింది.

కోటమ్మలాంటి గృహిణులు మనకు ప్రతి గ్రామంలోనూ- దాదాపు ప్రతి బీద, మధ్యతరగతి కుటుంబంలోనూ కనబడతారు. వారెప్పుడూ యేదో వొక పనిచేస్తూ, యెవరేది చెప్పినా నమ్మేస్థితిలో వుంటారు; ముక్కుమీద కోపం వుంటుంది; తగవులకి వెనకాడరు, మెత్తని మనసుగలవారు; ద్వేషంవున్నా యితరులను మోసంచేయలేనివారు అదీ వారి మనస్తత్వం.

అయితే అలాంటివారు భూస్వామ్య నాగరికతగల ప్రదేశాల్లో మాత్రం కనబడతారు.

యింకా సరిగా తెల్లారకపోయినా, కోటమ్మ వూరికనే కూచుని వుండలేకపోయింది; కుండలూ గిండలూ బైటకేసుకొచ్చి తోమటం ఆరంభించింది.

రంగారెడ్డి గూడా వూరికనే వుండలేకపోయాడు; యింత తాటినార ముందేసుకొని యేమిటో పేనసాగాడు.

కోటమ్మ తన పనిలో తాను నిమగ్నమై వున్నప్పటికీ పెండ్లిగాని కూతుర్ని తలచుకుంటూ ఉంటే మనసులో కలిగిన ఆందోళనని అణుచుకోలేకపోయింది. కూతురు పెళ్ళి విషయం చాలా ముఖ్యమైన విషయం. పగటిపూట యెవరి పనుల్లో వారు తలో దోవనా పోవటంవల్ల ఆ సంగతి చర్చించటానికి అవకాశం వుండదు. పోనీ, రాత్రి యింటికొచ్చినాక విషయం తడుముదామా అంటే, పగటి పనిలో అలసిపోయిన భర్త మంచాని కడ్డంగాపడి, గుర్రుపెట్టి తెల్లారగొట్టేస్తాడు గాని అదేమని యిదేమని వొక్క ముక్కన్నా ఆమెతో మాట్టాడడు. కనక యివాళ మంచి సమయం దొరికిందని కోటమ్మ అనుకొంది.

"నువ్వెరగవు?"

"యేందది? శెప్పరాదు?"

"యెన్ని తడవలని?"

"హబ్బ, యేందీ పంతం? అదేదో శెప్పరాదు!?"

"అదీ! అంతెనయ్యా, అంతే అంతే, నా మాటంటేనే నీకు మండుకొస్తది! నువ్వెప్పుడూ అంతే మునమునలాడతవు!''

"హబ్బబ్బ! యేందీ గోల? మళ్ళీ నేను వడ్లబత్తుడింటికెల్లాలా. మొన్న పటేలు నాలుగు రూపాయలు గుంజిండు, పని పూర్తిగాలేదు ఆడ్ని బూతం మింగ! యీదిలో పటేలు పోరు; యింట్లో పెళ్ళాం పోరు. యింక నెట్టా సచ్చేది!?''

"సరెసరె యెందుకులే.... నీ పనేదో నువ్వు సూసుకో... మొదలు నీకు పెళ్ళామూ, పిల్లలూ అన్నమాటుంటేగా శెప్పను?''

"హోరి దేముడ! యేందీ మూతియిరుపులూ, ముక్కు యిరుపులూ!?''

"అయితే నన్నేం శెయ్యమంటవు? గంగలో దూకమంటవా యేంది?ఆ?నేను మాత్తరం శేతులు కట్టుకొని కూకుండానా యేంది? ఆడా యీడా యిశారిచ్చటంల్లా పెళ్ళి సంగతి? నీ గొడవే నీదిగాని ఎదటి మడిసి యేవనుకుంటున్నాడో అన్న యిది నీకు లేదు.... యీ రోజుల్లో పెళ్ళంటే మాటలా యేంది? ఆ వూరు యీవూరు తిరగాల. ఆడా యీడా యిశారిచ్చాల. తగిన పిల్లగాడు దొరకాల... అప్పుడు పెళ్ళి... భగమంతుడు దయసూడాలగాని మన మనుకొన్నపట్టునే పెళ్లయిద్దాయేంది? ఆ? అసలా లగ్గం రావాలేగాని, కక్కొచ్చినా కళ్లేణ మొచ్చినా ఆగుద్దా, మనం లాగి పట్టితే మాత్తరం? ఆ?.... బలేగుందిది....''

'సర్లేగాని, యింతగొంతెత్తుకొని ఆటె అరవబాక! యిరుగు పొరుగోండ్లు యిని నవ్విపోతరు!'

"యెందుకు నగుతరు? మనమేమన్నా తప్పుచేసినమా, లేక యెవుడిదన్నా కట్టుకొచ్చినమా, యెందుకు!''

"యెందుకా? యీడొచ్చినపిల్లదాన్ని యింట్లో వుంచుకొన్నందుకు?''

"హబ్బ, నీ గొడవే నీదిగాని...''

అని రంగారెడ్డి గొంతుని మూలుగుడుకింద మార్చి యేడ్పుధ్వని వచ్చేట్లు అన్నాడు. కడుపులో యేదో పెద్దనెప్పి వచ్చినట్లు; మరుక్షణంలోనే దాన్ని పెద్దగా యేడ్పు స్వరంలోకి మార్చి అరుస్తూ పిడికిల్తో నేలని బాదేడు.

"పెళ్ళి పెళ్లి! కలిగినోండ్లయితే తఁరోయి అంటే బుఁరోయి మని నిమ్మెట్లమీద చేసుకొంటారు. మనబోటి లేనోండ్లకి అది మాటాలా మర్మాలా?...''

అతనిక యేమాత్రం శాంతం వహించలేక యింకా యేమిటేమిటో పెద్దగా అరిచి, తనని తాను తిట్టుకొన్నాడు.

"హోరి దేముడ! మగాడై పుట్టేకంటే అడివిలో మురగమై పుట్టటం మేలు!!''

కోటమ్మగూడా అందుకు తగ్గక తననోరు బాదుకొని యిలా అంది.

"అట్టగా? అసలాడదై పుట్టేకంటె చెట్టుమీద పచ్చయి పుడితే మేలు. యేబాదలూ లేక ఆడా యీడా యిన్ని గింజలేరుకొని తినిబతకొచ్చు....''

అంతవరకూ మెదలకుండా వూరుకున్న ముసలాడు తుపుక్కున కాండ్రించివూసి "అవునవును, అప్పుడందరికీ ఆయిగా వుండేది! దేనికి మీ బతుకు మంటగలవ! ఛీ!" అని అన్నాడు.

అప్పటికి తెల్లవారింది. ఆకాశం నిర్మలంగా వుంది. కాకులు అటూ యిటూ తిరుగుతూ కూస్తున్నాయి.

యీ భార్యాభర్తల రగడ పొరుగింటి సుబ్బమ్మ విన్నది. పొద్దున్నే తగువెందుకొచ్చిందబ్బా? పాపం, యేం జరిగిందో యేమిటో! యిద్దరికీ సద్ది చెబుదామని సుబ్బమ్మ అక్కడికొచ్చి, "యేంది పిల్లా అదీ?" అని కోటమ్మని అడిగింది.

ఆ ప్రశ్నతో కోటమ్మకి తగ లేసుకొచ్చింది. ముండ, అన్నీ విన్నది గామాలు! యింకేం, తెల్లారకముందే ఫలానా ఆలు మగళ్ళు గుద్దులాడుకొంటున్నారని యిల్లవెంట చాటించి వస్తుందిక!!

"యేదైతే యేంది పెద్దీ?" అని కోటమ్మ సర్రున లేచింది. "మేమంత నీశకంగా నీకళ్ళ కగపడుతున్నామా యేంది? యే యింట్లోనూ యే మొగుడూ పెళ్ళాలూ తకరార్లు పడరనా యేంది పెద్ద ఆచ్చర్యేంగ అడగొచ్చినవు!? ఆ?"

ఆ ముసలమ్మ తెల్లబోయి, యేదో గొణుక్కుంటూ, వెళ్ళిపోయింది. మధ్యలో తనకెందుకొచ్చిన పీడ!? ఆ యిద్దర్నీ కట్టగట్టుకొని గంగలో దూకనియ్యి. తన కెందుకు?

"ముండ! యాడా తగూలు లేనట్టూ, మన వొక్క యింట్లోనే వుండట్టూ, తానేదో పత్తిత్తు అయినట్టూ అడగొచ్చింది ముండ!!.... అసలు దాన్ననే పనేంటి? యింట్లో మొగాడు సరైనాడైతే అడ్డమైన ముండలకీ అట్టా యెల్తయ్యే వాళ్లమేనా? " అని కోటమ్మ ఆ ముసలిదాని వెనకాల మెటికలు విరుస్తూ అన్నది.

తర్వాత, తమ కీచులాట పట్ల తమకే రోత పుట్టగా ఆ ఆలుమగల్లిద్దరూ నిశ్శబ్దంగా వూరుకొన్నారు. యెడ్డెమంటే తెడ్డెమనే ఆ యిద్దరూ వొకర్నొకరు యిప్పుడు సొంతంగా అర్థం చేసికొన్నారా అన్నట్లు అగపడ్డారు. కాని కొంతసేపటి తర్వాత కోటమ్మ వొక 'లా పాయింటు' లాగింది. అసలింతకీ యీ తగాదాకి మూలకారణం యెవరు? తానా? తానేమీ అనలేదే? భర్త అనవసరంగా ఆ దుంగని పాడుచేస్తుంటే తాను అడిగింది. యింతే, తానింకేమీ అనలేదు. అయినా యిందులో తన తప్పేమిటి? దుంగ పాడుచేయట మెందుకనటం తప్పా? పిల్లపెళ్ళి సంగతి చూడమంటే తప్పా? యిందులో తన తప్పు అన్నది యేమి లేదు గందా, మరి తగవుకి మూలకారణం అసలీ గొడవంతా రావటం, ఆ ముండ వినటం యిదంతా తన భర్త తప్పుగాదా? సరే, అసలింతకీ తాను ఆడదీ, ఆయన మగాడూ - యిదంతా తన ఖర్మ!

యీ తగువుని తాను రెచ్చగొట్టలేదని రంగారెడ్డి పెద్దపెట్టున అరిచి, ఆమె లాగిన "లా పాయింటు"ని తలకిందులు చేసేడు.

నిజమే, తాను దుంగని పాడుచేసినమాట నిజమే! అయితే యీబిడ్డ ఆ దుంగని మంచం కోసం తెచ్చిందని తానేమన్నా ముందుగనే కలగన్నాడా? ఆ సంగతి తనకేమన్నా తెలుసా? తెలవక చేశాడు, తప్పయిందన్నాడు. ఆమె అంతటితోనే సరిపెట్టుకొని వూరుకోరాదూ? తగాదా లేకుండా పోయేదిగా!? అలా వూరుకోక ఆత్ఛగిడీ అని మీదకొస్తుందీ! ఆ? సరే, అది అయిపోయింది. మళ్ళీ యింట్లోకొస్తే పెళ్ళి పెళ్ళని యిదొక తగువా? మగాడు గూడా ఆడదానికి మల్లే మనిషే? ఆడ దానికి మల్లే రెండుచేతులూ రెండు కాళ్లూ వుండయ్యిగాని, పది చేతులూ, పదికాళ్ళూలేవు యేదిబడితే అది చిట్టుక్కులో చేసెయ్యటానికి! సరే, యింతకీ తాను మగాడై పుట్టడమే యీ పాపానికంతా కారణమనుకో, అంతా తన ఖర్మ!!

ఇద్దరూ దాని మీద చాలాసేపు అరుచుకొన్నారు. దాంతో ముసలాడికి మరోసారి వొళ్లు మండింది.

"యేందా ముండమోపి తగువు!? ఆ? శిగ్గులేదు? నా చిన్నతనంలో పెద్దాళ్ళ యెదట కొడుకులిట్టాగె వాగేవోండ్లా? ఛీఛీ..." అని ముసలాడు బొబ్బరించేడు.

# 3

మహమ్మదు గడపవద్ద కొచ్చేసరికి, సూర్యుడు తన బంగారు కిరణాల్ని విరజిమ్ముతూ నల్లగా మక మక లాడుతోన్న అరణ్యం వెనకాల పైకిలేస్తున్నాడు. యింటి చూరునుండి కిందకు టప్ టప్ మంటూ పడుతూన్న నీటిబిందువులు సూర్య కాంతిలో తళుకుతళుక్‌మంటూ చిరునవ్వు నవ్వుతున్నట్టున్నాయి,

యింట్లో చిన్న పిల్లలూ, సీతా తప్ప అందరూ వున్నారు, సీతావాళ్లు పొలంకేసి వేళ్ళేరు.

మహమ్మదు ముడుతలుపడిపోయిన ముసలాడు; బుగ్గలు దించుకపోయి దవుడ యెముకలు బాగా కనబడుతున్నాయి. కళాకారుడు వహ్వా అనేలాంటి చక్కని పెద్ద చెవులున్నాయి. ని నల్లని కనుబొమ్మలకీ, తెల్లని మేక గడ్డానికీ యెక్కడా అంతూ పొంతూ కుదరకుండా ంతగొలుపుతోంది.

ఆ గ్రామస్తులు అతన్నెప్పుడూ అతని పూర్తి పేరుతో పిలవరు; మమ్మూ అనిగాని మమ్మూసాయిబు అనిగాని పిలుస్తారు.

వాడికతో నున్నగా, గోధుమరంగుగా తయారైన తన కర్రమీద వంగి పోటేసుకుంటూ డుస్తూ, తన చురుకైన, మెరిసే కళ్ళతో ఆ చీకటి కొంపలోకి చూస్తూ, మమ్మూలోని కొచ్చాడు.

"రా తమ్ముడూ..." అంటూ కొండారెడ్డి ఆప్యాయంగా అన్నాడు.

మమ్మూ మెల్లగాపోయి కొండారెడ్డి మంచం మీద కూచున్నాడు.

మమ్మూ వచ్చినా, ఆరిపోయిన తగవుని కోటమ్మ మరోసారి రగిల్చింది. దాంతో యిక మరీ అంకచండాలం అవుతుందనేభయంతో, మమ్మూవంక తిరిగి, 'వత్తా, శిన్నయా' అని చెప్పి రంగారెడ్డి యిక అక్కడ వుండకుండా చల్లగా బైటికి జారుకొన్నాడు.

పోతూన్న భర్తవంక వోరగంట చూస్తూ, "యిను శిన్నమామా" అంటూ కోటమ్మ ప్రారంభించింది. "సీత ఈడొచ్చిన పిల్లని నువ్వు యెరుగుదువుగంద? యేం, శినమామా? మరి యింటికి గల్ల పెద్ద ఈ మడిసి, అసలా సంగతే బుఱ్రకి పట్టించుకోడే, యిక నెట్టగంట యీ సంసారం, పైకొచ్చేది? ఏం శినమామ? సూడూ - మనలో మాట-మన సీతని రామిరెడ్డి కియ్యాలని నాకు మనుసులో వుండది శినమామా....మరి..."

రామిరెడ్డిని మమ్మూ బాగా యెరుగును. రామిరెడ్డి స్కూలుఫైనలు చదివేడు; మంచిబుద్ధిగలాడు. కాని "సంగం సంగమో అని బుఱ్ర శెడగొట్టు కుంటున్నాడు!"

"మంచిదే అమ్మాయ్. కానీషంగం..." "అనిమమ్మూ ఆగేడు. "అదే శినమామా నాకు సందేవమూ" అనన్నది కోటమ్మ.

"అసలు చదువూకొన్నాడికీ షంగం గింగం యెంద్కూ? డబ్బూ దస్కం పూరాగావుంటే షంగం అనొచ్చు. షికార్ అనొచ్చు. మనబోటీ బీదాళ్కి షంగం పన్కిరాదూ... రామిరెడ్డి సుబ్బరంగా యేదన్నా వుద్యేగం చేస్కోరాదూ?"

ఆ విషయం అంతా వొప్పుకొన్నారు.

నిజమేమరి! చదువుకొన్నవాడికి సంగాలూ చట్టు బండలూ యెందుకు ? కమ్యూనిస్టు పార్టీ యెందుకు, గోంగూర యెందుకు? ఆ? అందులోనూ, తానేమైనా ధనికుడా? స్వతంత్రమన్నా, స్వరాజ్యమన్నా, యేదన్నా యెటన్నా డబ్బుంటే చలామణీ అవుతుంది. బీదాళ్లకి యీ సంగాలూ స్వతంత్రాలూ యెందుకూ? కూటికిలేనాడు కమ్యూనిష్టా!? మంగలి రాయప్ప కమ్యూనిష్టా!? మాల రామాయి కమ్యూనిష్టా!? ఆ? సర్లేండి, యెవరిపిచ్చి వాళ్లదీ! మనకెందుకు?

ఆ వాదనతో వొక్క కొండారెడ్డిమాత్రం భేదించేడు: రామిరెడ్డి చదువుకొన్నమాట నిజమే; సంగాలంటున్నమాట నిజమే; వుద్యోగం యేదో చేసుకొని బతకాల్సినమాట గూడా నిజమే. అయితే సంగంలో యేతప్పున్నది? కమ్యూనిస్టులు చెప్పేదాంటో తప్పేమిటి? సంగం మంచిది; ప్రజలకోసం పని చేస్తున్నది; అందులో తప్పేమీలేదు.

కాని....

సంగం చెప్పేదంతా అమలు జరుగుతుందా? తప్పరదియ్య - వొక్క కుటుంబంలో నలుగురుంటేనే యేటికొకడూ కోటికొకడూ లాగుతారే - అట్లాంటిది; 'యీ మూరఖపు జనం' 'అంతా యేకమవుతారా? యేకమై యీ జాగీర్దార్లకీ, నవాబులకీ వ్యతిరేకంగా పోరాడతరా?ఆ?

"యేం తమ్ముడూ-యీ మూరఖపుజనమంతా కలిసి యీ నవాబుని దించుతారా?'' అని మమ్మూని కొండారెడ్డి అడిగేడు.

నవాబు పేరెత్తగానే మమ్మూ నొచ్చుకొన్నాడు. తాను - మమూ - వొక మహమ్మదీయుడు. అలాగే నైజాం నవాబు గూడా వొక మహమ్మదీయుడు. తన తోటి మహమ్మ దీయ కులస్థుడు రాజ్యం యేలుతున్నాడు. చూడండీ తన తోటి మహమ్మదీయుడు రాజ్యం యేలుతున్నాడంటే యెంత గొప్ప!? అంతేగాక. యీ బీదరికంతోనూ, బాధలతోనూ నైజాం నవాబుకి యేం సంబంధం? నైజాం నవాబు యీ బీదరికం తెచ్చిపెట్టాడా? యిదంతా ఎవరి ఖర్మ వారిది; అంతే. సరే, జాగీర్దారులూ దేశముఖాలూ, పటేళ్ళూ, పట్వారీలూ, ప్రజల్ని బాధలు పెట్టి దోచుకొంటున్న మాట నిజమే, అయితే యిదంతా నవాబుకి తెలుసా? వీళ్ళని యిలా చేయమని నవాబు చెప్పాడా యేమన్నానూ? ఆ? నవాబు కింది వాళ్ళంతా యిలాంటి క్రూరులైతే పాపం దానికి నవాబు యేం చేయగలడూ? ఆ యింకో మాట. సంగం చెప్పేది మంచిదే; దానికి యెవరూ కాదనరు. అయితే, సంగం చెప్పేది మంచిదే గాబట్టి నవాబును దించాలని యెక్కడన్నావుందా? మధ్యలో యీ భటాచోరులంతా యిలా చేస్తుంటే ఆ పాపం నవాబుదా? భాగా వున్నది, భాగా వున్నదంట?

ఆ మాటలూ, ఆ ధోరణీ కొండారెడ్డికి నచ్చలేదు. చూడండీ పులుల్ని పుట్టించేది యెవరు? పులులు గాదా? మేకలా? గోవు కడుపున పులి పుడుతుందా? యిదంతా నవాబుకి తెలవకపోట మేమిటి? బాగా తెలుసు. అయితే దొంగల్లో తాను నాయకుడు గాబట్టి, తమ విధానం దోచుకోటం గాబట్టి అలా వూరుకొంటున్నాడు. అందువల్ల యీ దొంగలంతా పోతేగాని దోపిడీపోదు. అందులో తప్పేంటి?

"అదీ తమ్ముడూ, సరే అదంతా యివాళే జరగబోయిందా సచ్చిందా? నడాన మనిద్దరికీ తగువెందుకు?'' అని కొండారెడ్డి సర్దుబాటుగా అన్నాడు.

'యిండ్లో తగాదాయేముందీ కొండయ్యన్నా? మాటవస్తే మాటా అనుకొన్నాం. అంతే..' అని మమ్ముగూడా సర్దుబాటు ధోరణీలోనె పలికేడు.

"సూడు శినమామ. మీరు సంగాలు గింగాలు అని మాట్టాడుకొని, నేనడిగిన సంగతే మరచిపోయినవు!'' అన్నది. కోటమ్మ.

"ఆ. మరశీపోలేదమ్మాయ్. రామిరెడ్డికేం? సక్కనీ పిల్లాడు. అయినా షంగం గింగం అంటావుంటే, పెళ్లీ అయితే అంతా పోతదీ,'' అన్నాడుమమ్ము.



# రామిరెడ్డి

మన మిలా వున్నామంటే
మన రాత గాదు, గీత గాదు;
తప్పంతా మనలోనే వుంది, కళ్ళు
విప్పి చూసుకొన్నామంటే!

- జూలియస్ సీజరు నాటకంలో కేషియస్ (షేక్స్‌పియర్)



రామిరెడ్డిని యింటా బయటా గూడా రామిరెడ్డి అని పిలవటం అరుదు; రామూ అనిగానీ, రాం అని గానీ పిలుస్తారు; మరికొందరు రామయ్యా అని గూడా అంటారు.

రాము పెళ్ళికాని యువకుడు; బీదరైతు సుబ్బారెడ్డి కొడుకు. తాడు విప్పివేసిన ఆవుదూడలాగా వుత్సాహంతో, ఆవేశంతో, ఆనందంతో విద్యార్థి జీవితం నుంచి, రాజకీయ రంగంలోకి దుమికినవాడు. చదువుకొని, యేదో వుద్యోగం చేసుకొని తనంతట తానన్నా బతుకుతాడని తలిదండ్రులు ఆశించారు; కాని యీ కాలంలో చాలా తల్లిదండ్రులకి మల్లే వారుగూడా నిరాశ చెందాల్సి వచ్చింది. వుద్యోగం చేయకపోగా, సంగమంటూ అతను తిరగటం ప్రారంభించేడు!

కాని ఆ "సంగం పిచ్చి" కాలక్రమేణా అదే తగ్గిపోతుందిలే అని తలిదండ్రులు అనుకొన్నారు; కాని కాలమే దాన్ని మరొక రకంగా నిర్ణయించింది; వారి ఆశలు అడియాసలయ్యాయి. గ్రామంలో ప్రచారం చేయడమే గాక పైగా "మాలపల్లి" గూడా పోసాగాడు! అదీగాకుండా ప్రక్క వూళ్ళకి గూడాను!!

కల్లు గీతవాళ్లని - అంటే కలాలీల్ని - సంగాల్లో జేరమని చెబుతాడు; రైతుల్తో వాదిస్తాడు; వెట్టికి యెదురు తిరగండని అందరికీ బోధచేస్తాడు!

యిదంతా వింటూవుంటే ధనిక రైతులకి అర్థంగాకుండా వుంది ! జాగీర్దారుకి పచ్చి వెలక్కాయ గొంతుకుపడ్డట్లుంది; పటేలు, పట్వారీలకి గంగ వెర్రులెత్తుతున్నాయి; మామూలు కూలీ రైతులకి యిదంతా యేమిటో గందరగోళంగా, అగమ్య గోచరంగా వుంది.

సుబ్బారెడ్డి తనకి కనపడినప్పుడల్లా, పటేలు కళ్ళల్లో నిప్పులు పోసుకొంటూ, "జాగర్త! కొడుకు సంగతి కొంచెం ఆలోచించు. తర్వాత అనుభవిస్తావు . వూళ్లో లేకుండా పోదల్చు కొంటేనే చెప్పింది వినమాక... "అని, యింకా, బెదరించసాగేడు.

యీ బెదరింపులో సుబ్బారెడ్డి అయోమయంలో పడిపోయేడు; భయంతో వణికిపోయేడు. కొడుకుని ఎన్నోచీవాట్లు వేసేడు, బెదరించాడు; అదిరించేడు. కాని యేంలాభం? తన మాట యేమన్నా వింటేగా! అందువల్ల, భూస్వామ్య నాగరికతలో వుండేవారు సహజంగా అనుకొన్నట్లు, రామిరెడ్డికి యెవరో మందుపెట్టి వుంటారని అనుకొన్నాడు. వొకవేపున అలా అనుకొంటూనే, అసలు చదువులే తన కొడుకుని చెడగొట్టాయనీ, చదివించటం బుద్ధితక్కువ అయిందనీ, అయినా యెద్దుముడ్డి పొడుచుకొనేవాళ్లకి చదువులు యెందుకనీ - మొదటి నుంచీ పొలంపనిలో వంగగొట్టితే బాగుండేదనీ అన్నిటికీమించి అసలు తన కొడుకు యిలా చెడిపోటానికి ప్రధాన కారణం గుంటూరు జిల్లా నుంచి వచ్చిన శ్యామసుందరరావు అనీ, ఇంకా అదీ యిదీ యనీ సుబ్బారెడ్డి అనుకొన్నాడు.

రామిరెడ్డికి వొక అన్నా, యిద్దరు తమ్ముళ్లూ, వొక అక్క, వొక చెల్లెలూ వున్నారు.

అన్నకి పెళ్లయింది; వేరే వుంటున్నాడు. అలాగే అక్కకీ పెళ్లయింది; ఆమె కాపురానికి ఆమె వెళ్లింది. పోతే యిక తమ్ముళ్లూ, తానూ, చెల్లెలూ వున్నారు.

అంతమందిలోనూ వొక్క చెల్లెలు మంగమ్మ తప్పితే యింట్లో అతన్ని సమర్థించేవారు యెవరూలేరు. మంగమ్మ మాత్రం ప్రతిదానికి అన్నని వెనకేసుకొచ్చేది!

మంగమ్మ యెత్తుగా, పుష్టిగా, అందంగా, చలాకీగా వుంటుంది. అన్నని అన్ని విధాల బలపరచటమేగాక, తాను గూడా సంగాన్ని గురించి "తెలిసి తెలియని" మాటలు అమ్మలక్కలికి చెప్పేది.

## 2

అది సాయంత్రం. గాలేమిలేదు. వుక్కబోస్తోంది. చెమటొడ్చుకొంటూ రామిరెడ్డి వూరిమధ్యనవున్న ముత్యాలమ్మ గుడిదగ్గర కూచున్నాడు. వుక్కపోతతో అతనికి చిరాకుగా వుంది. అటుగావచ్చే పొయ్యే మనుషులు చిరునవ్వుతో అతన్ని పలకరిస్తూ, యేదో మామూలుగా రెండుమాటలు మాట్లాడి పోతున్నారు.

అకస్మాత్తుగా, భూమిని బద్దలుకొట్టుకొని వెలిశారా అన్నట్లు, వీరన్నా పాపన్నలు అక్కడ తయారయ్యేరు. నీరసంగా నవ్వుతూ, రామిరెడ్డి వారివంక పరాకుగా తేరిచూసేడు. చేతులు కట్టుకొని వారిద్దరూ అతనిముందు నుంచున్నారు. వీరన్న ముఖాన యేదో బానిస తరహా చిరునవ్వుంది. కాని పాపన్న మాత్రం తలకొంచెం వంచుకొని, కోర్టుబోనులో కొత్తఖైదీలాగా ముఖంపెట్టి నుంచున్నాడు.

భుజాన వున్న తుండుగుడ్డతో ముఖంమీది చెమట తుడుచుకుంటూ, రామిరెడ్డి వాళ్ళని కూర్చోమని చెప్పాడు. కాని చాల పట్టుబట్టిన తర్వాత గాని వాళ్ళు కూచ్చోలేదు; అదైనా కొంచెం దూరంగానే కూచ్చున్నారు.

అయినా వాళ్లకింకా భయంగానే వుంది. తాము తక్కువ కులాల వాళ్లు; అందులోనూ నిప్పచ్చి బీదాళ్లు. అటుగా గొప్పకులాల వాళ్లూ, ధనికులూ వస్తూవుంటారు. అంతేగాదు. 'పటేలు ముండా కొడుకు' గూడా రావచ్చు! తాము యీ విధంగా కూచుని కబుర్లు చెప్పుకుంటూంటే పై వారిలో యెవరన్నా చూస్తే యేమనుకుంటారు? అంతేగాక, పటేలు చూస్తే యింకేమన్నా వుందా? అయినా గొప్పకులంవాడైన రామిరెడ్డి ప్రక్కన కూచున్నంత మాత్రాన తాము రామిరెడ్డి అంతటి వాళ్లు అవబోతారా?

యే రైతో యెవరో వచ్చినపుడు క్లాసులోకి మాష్టరు రాగానే లేచినుంచునే బడి పిల్లల్లాగా - ఆ యిద్దరూ నుంచోటం సాగించారు, ఫరావాలేదులెమ్మని చెప్పీచెప్పీ రామిరెడ్డికి విసుగు బుట్టింది.

"ఆరు గొప్పోండ్లు, దొరా. మేము తమురి బానిచలం.." అంటూ ఆ యిద్దరూ అతనికి నచ్చచెప్ప ప్రయత్నించారు.

'అది సరేగాని, యేంటి పనిమీదొచ్చారు?' అని రామిరెడ్డి అడిగాడు.

'అవున్దొరా...' అంటూ వీరన్న ఆరంభించాడు.

'నన్ను దొరా గిరా అని పిలవమాకమని యిదివరకు చెప్పలేదూ?'

'అవున్దొరా...'

'అదుగో మళ్ళీ! నన్ను దొరా అనకపోతే నేనేమీ అనుకోను. నేనూ మీలో వొకణ్ణి. తెలిసిందా?'

"అవున్దొరా.., "అదుగో మళ్లీ! ఛీ ఛీ ....

ఇక లాభంలేదు, రామిరెడ్డి ముఖం ముడుచుకొని వూరుకొన్నాడు. అది కనిపెట్టి వీరన్న ఇలా అన్నాడు.

"శెప్పేదినండి, దొరా, పటేలయ్యని దొరదొరా అని తల్లో యెంటికలన్ని తడవలు పిలువకపోతే పసరానికిమల్లె పైన బడతాడు. యేమీ అనుకోమాకండి. నేను మూరఖవుముండా కొడుకుని. శేలోబడ్డ దున్నపోతిని యెన్నితడవలు అదిలిచ్చాలో అన్ని తడవలు ఆయన్ని దొరాదొరా అని పిలవాలి. తమురెరగందేముండది? తమురు సదువుకొన్నారు, గొప్పోరు తమురెట్టా బిలిసినా శెలామణి అవుద్ది. మాబోటి సదువురాని సన్నాసులు, యేమి తెలవని మూరఖపు ముండాకొడుకులు, ఆయన్ని అట్టాగే..."

"యెందుకీ గొడవంతా? వచ్చిన పనేంటో చెప్పు."

"ఆ అట్టా అడగండి శెపుతా." అని వీరన్న గొంతు సవిరించి, చుట్టూ బెదురుచూపులు చూసి, పాపన్నవంక అదోలాగ వొకచూపు విసరి, ప్రారంభించేడు.

"యీ పెద్దమడిశిని పాపన్నని తమురెరుగుదురుగందా? సరే, యిక చెప్పేదినండి. ఆ మట్టున యేమయ్యిందంటే మేమిద్దరం శిన్నతనం నుంచీ సావాసం. యీడు నాదగ్గిరే యెప్పుడూ కల్లుదాగుతావుంటడే..."

"నన్ను ఆడూయీడూ అనమాక. నీసొమ్ము నాకేమీ బెట్టలా." అని పాపన్న అభ్యంతరం చెప్పేడు.

"ఆ !!! మాలాణ్ణి ఆడూయీడంటె తప్పొచ్చింది? ఆ?" అని వీరన్న యింకేమేమో అనబోయాడు.

"అట్లా యెందుకులే! తప్పు. పేరునేపిలువు" అని రామిరెడ్డి సర్ది చెప్పాడు.

"సరే. యిక శెప్పేదినండి దొరా. నావల్ల నేరముంటే నన్నే శిచ్చించండి.. ఆమట్టున ఏమయ్యిదంటే పది పదిహేను దినాలకిందట మా ముసల్ది యేమన్నదంటే 'వోరే ముసలాడా ముసలాడా. సూత్తేనేమో కరువుగాలమొచ్చె. మరిగల్తే పిల్లగాడుంటేనా వొక అవిటి సన్నాసయ్యె. మరి నువ్వు కల్లమ్మటమేగాని రాగికానీ డబ్బు వొచ్చింది లేదయ్యె. కనక రొండు కోడి పెట్టల్ని తీసకరా. ఆటి గుడ్లమ్మి బతుకుదం' అని మా ముసల్ది అన్నదండి. యిక సూడండి దొరా తమురు నమ్ముతరో నమ్మరోగాని నాకు వొళ్ళంతా బేరీమంటలు పుట్టినియ్యండీ. అసలే యాడా కానీ దొరక్క గిజగిజ కొట్టుకు సత్తాంటే దానికి కోళ్లు గావాలా? ఆమట్టున యేం జరిగిందంటే నాకు వోగ్రమొచ్చి ముసల్దాన్ని పడేసి బాదినానండీ. ఆమట్టున యిక జూడండి దొరా శెపితే తమురు నమ్ముతరో నమ్మరోగాని, ముసల్ది మూడు రేతిళ్లూ మూడు పొగుళ్లూ నన్ను పలకరిచ్చలేదండీ, ఆమట్టున నాకు పేణం గుబగుబ మన్నదండీ. కాని ఎట్టాగో కిందా మీదాపడి రొండు పెట్టల్ని యెట్టాంటి బంగారు పెట్టలని! పట్టుకొచ్చినానండీ. దాంతో ముసల్ది శేటంత జేసుకుని పలకరిచ్చిందండీ. ఆమట్టున నావల్ల నేరముంటే నన్నే శిచ్చించండి దొరా, తమురి బానిచని.... ఆమట్టున మొన్న నాల్రోజులనాడు, రేత్తిరి మేమంతా బాగా నిద్దర్ల మీదుంటే యీ మాల తొత్తుకొడుకు దొంగసాటుగా వొచ్చి పెట్టల్ని సంకనెట్టుకొని, ఆ మట్టున దొబ్బుకెల్లిండండీ. ఆమట్టున్నేను లెగిశి, యెంటబడితే పారిపోయిండండీ. మర్నాడు యీడి యింటికెల్లి అడిగితే మీదబడి కొట్టిండండీ. మరి తమురేమొ యీ నాలు మూడు రోజులమట్టీ యాడా కనపడలేదండి, యిప్పుడే యీ పెద్దమడిసి బజార్లో అగపడితే మిమ్ముల్ని సూసి యీడకీడ్సు కొచ్చానండి. దొరా, నావల్ల నేరముంటే నన్నేశిచ్చించండి...?

వీరన్న చెప్పటం ఆపి, తన వాదన అయిపోయినాక వొకరకం ప్లీడరుకి మల్లే, సంతృప్తి తో ముక్కు చీది, పాపన్న వంక వోరగంట చూసేడు.

"దాని కేం చెపుతావు, పాపన్నా?" అని, పళ్ళ తో వొక గడ్డిపరకను కొరుకుతూ, రామిరెడ్డి అడిగేడు.

పాపన్నా నిట్టూర్చి యిలాఅన్నాడు:

"నిజమే. దొరా, అసలిదంతా ఆ పటేలు ముండా కొడుకు మూలానా వొచ్చింది. గుర్రాల పాక కట్టేనాడు పెద్ద దొరోరింటికి యెవుళ్లొ వత్తారని మమ్మల్ని కోడిగుడ్లు అదీయిదీ తెమ్మన్నాడు. అప్పుణ్ణాయగ్గిర యర్రటి యాగానీ లేదు, అసలే బువ్వకి గతిలేక మాసత్తాంటిమి. ఇంగ అయ్యా యియ్యా యెక్కడ తెచ్చేమి? ఆ యాల సాయింతరం యీరయ్య యింటి కాడ పెట్టల్ని సూసి, రేత్తిరి యెత్తకపోయినా......"

అయితె సూడూ నీ యగ్గిర డబ్బులేదని నా కోడి పెట్టల్ని దొబ్బుకు పోతావన్నమాట?' 'వీరన్న అరిచేడు.

"నువ్వుండు, వీరన్నా, నన్ను అడగనియ్యి , యేం పాపన్నా, అట్లా చెయ్యడం తప్పుగాదూ? అని రామిరెడ్డి అన్నాడు;

"మరెట్టాగండయ్యా బతికేది?"

"అందుకని నా పెట్టల్ని యెత్తక పోతావన్నమాట!?"

"నువ్వుండు, వీరన్న"

"ఆ. సరె సరె తమరే అడగండి"

"యేం, పాపన్నా, తప్పుగాదూ?"

"అవున్దొరా, నేను కాదంటనా? మరెట్టా బతకాలండయ్యా?"

" అందుకని నాపెట్టలు యెత్తక......."

"ఆ, సరెసరె తమరే అడగండి."

"చేప్పేది విను, పాపన్నా, మీ యిద్దరూ బీదవాళ్ళు, మనమంతా బీదాళ్ళం, యెందుకో తెలుసా?"

"అదంతా మన కరమండి; దేముడట్టారాసిపెట్టాడు" పాపన్న తన నుదుర్ని కొట్టుకొన్నాడు.

"కాదు. నువ్వన్నట్లు అది మన ఖర్మగాదు. మన మెందుకని బీదాళ్ళంగా వున్నామంటే - మనం దేనిమీదనైతే హాయిగా బతగ్గలమో ఆ భూమీ అదంతా మన జాగీర్దారువంటి భూస్వాముల చేతుల్లో వున్నది. యీ జాగీర్దార్లూ యీ నవాబులూ మన్ని దోచుకొని తింటున్నారు. అందుకనే మనం యెంత చాకిరీజేసినా పొట్టన్నా సరిగా నిండదు. తెలిసిందా?"

"శిత్తం, శిత్తం" యిద్దరూ అన్నారు.

"అయితే జాగీర్దారు మనకు మల్లే యేమన్నా కష్టం జేస్తన్నాడా?"

"ఆయనికి కట్టంజేసే రాతేంపట్టింది. ఆయిగా కాలుమీద కాలేసుకొని కూకుని తింటాడు" అన్నాడు వీరన్న.

"అంతేనండి, దొరా." అని పాపన్న గూడా అన్నాడు.

"కనక ఆ భూతాలు మనచేత చాకిరీ చేయించుకొని మన రక్తం పీల్చుతుంటయ్యి.

అందువల్ల, యే పొద్దూ కష్టం జేసే మనము యిట్లా వుండాము. కాబట్టి మన బీదరికానికి కారణం ఈ భూస్వాములూ, నవాబులూ మొదలైనవాళ్ళు..'

"మరి పటేలు, పట్టవారీలో?" అన్నాడు పాపన్న.

"వాళ్ళు వీళ్ళ తొత్తులు. అంతే, సరే, వినండి. కనక, భూమి కష్టించే వాడి చేతుల్లో లేకపోయినంతకాలమూ యింతే. ఆ భూమంతా కూలీలకీ, రైతులకీ వచ్చేవరకూ యింతే..."

"బూమి మనదెట్టా అవుద్దండి?" పాపన్న అన్నాడు.

"యెట్టాగా? వాళ్ళంతట వాళ్ళు తీసుకొచ్చి మనకివ్వరు. మనమే అందరమూ ఏకమయ్యి తీసుకోవాలి. భూమికోసం పోరాడాలి. అంతవరకూ యింతే."

తర్వాత రామిరెడ్డి సోవియట్ యూనియన్ యెలా ఏర్పడిందో, అదివరకు భూస్వాములూ, జమిందార్లూ మొదలగువాళ్ళక్రింద ప్రజలు యే విధంగా నరకం అనుభవించారో, కొంతకాలానికి బీదలంతా ఏకమై యేవిధంగా దోపిడీని అంతం చేశారో, అందువల్ల యీనాడు యెలా స్వర్గసౌఖ్యం అనుభవిస్తున్నారో - మొదలైన విషయాలు వారికి చెప్పాడు.

ఆ మాటలు వింటూ వీరన్న పాపన్నలు - టాజ్ మహల్‌ని కొత్తవాడు యెలా చూస్తాడో - అలా అతని వంక విప్పారిన కన్నుల్తో, ఆనందంతో తేరిచూశారు.

అంతా చెప్పినాక రామిరెడ్డి యిలా అన్నాడు :

"తెలిసిందా? అదీసంగతి. మనమంతా యేకమై భూమి కోసం, స్వతంత్రం కోసం పోరాడాలి. తెలి...? అందువల్ల బీదరికం పోవాలంటే దొంగతనం చేస్తేనో, మనలో మనం తన్నులాడుకుంటేనో పోదు. తెలిసికోండి. మనలో తగాదాలు పనికిరావు... పాపన్నా నేను చెప్పింది చెయ్యి; యిక నెప్పుడూ యీపని చెయ్యమాక. నీ చేతికి డబ్బొచ్చినపుడు, ఆ కోడిపెట్టల ఖరీదు వీరన్నకియివ్వు.."

"సర్లే, దొరా" అని, కొంచెం ముఖం చిట్లిస్తూనే, అన్నాడు పాపన్న.



# దిగుడు బావి

అంధకార ప్రపంచం
యెంతటి అంధకారంలో, అంధకారపు అధోలోకంలో
అంతా భయంతో పిరికితనంతో
కిందూ మీ దౌతు
కుందుచూ బ్రతుకుతోంది

- "డఛెస్ ఆఫ్ మల్ఫీ" లో బొసోలా (వెబ్‌స్టర్)



ఆ సంవత్సరం వానలు ఋతువు కంటే ముందుగానే వచ్చినాయి. సంతోషిస్తూ, సందేహిస్తూ రైతులు చేలు దున్ని విత్తులు చల్లేరు.

గాలిలో అల్లల్లాడుతూ, మర్మరధ్వనులుచేస్తూ, మధుర భావాలొలికిస్తూవుండే మనోహరమైన పచ్చని పట్టుచీర భూదేవి ధరించిందా అన్నట్లుందాయేడు. పురాణ గాధలలోని గంధర్వకన్యలలాగా పక్షులు భూమాత భుజాలపై, తలపై చుట్టూ, యెగురుతూ, గెంతుతూ, తీయగా, హాయిగా పాడసాగేయి.

ఆనాటి వుదయం కాంతిమంతంగా, వెచ్చగా, నిశ్శబ్దంగా వుంది. కుండలూ, కడవలూ భుజాన్నో, రొండినో పట్టుకొని స్త్రీలు నీళ్లకోసం దిగుడుబావి వద్దకి వెళ్తున్నారు. ఆ బావి వూరిబయటవుంది. దానివద్దకి పోయేబాట పాడుగూతా సందడి సందడిగా వుంది.

భుజాన వొక కావడి వేసుకొని రామిరెడ్డి బావి వద్దకి పోతున్నాడు. సోమిరెడ్డిగూడా అతని ప్రక్కన నడుస్తున్నాడు. సోమిరెడ్డి వొక మామూలు రైతు; నడివయస్సు మనిషి; పొట్టిగా వుంటాడు; చాలామందికి మల్లే అతనికి పిలక వుంది; ముఖంలో ప్రత్యేకత యేమీ లేదు, మామూలుగా వుంటుంది. అతను కుంటివాడు. నడుస్తూ నడుస్తూ మార్గమధ్యంలో అతనిలా అన్నాడు.

"నీది సాల మంచికంటం, రామయ్య! యేదీ, వొక్క పాట ... సూడు..."

పాటబాగా పాడనేర్చినవాళ్లని యెవరేనా పాడమన్నప్పుడు వారెలా సిగ్గుపడతారో రామిరెడ్డి గూడా అలాగే సిగ్గుపడి,

"నేనంతబాగ పాడలేను..." అని చెంప గోకుకొంటూ నత్తులు కొట్టేడు.

"అదుగదేరబ్బాయ్! మీ పాడనేర్చినోండ్లకి ఆడనేర్చినోండ్లకీ అదే దొబ్బిడాయి. పాడమనంగానే మీరు పాడరు సూడూ!" అని కుంటి సోమిరెడ్డి బతిమాలగా, రామిరెడ్డి తన మధురమైన కంఠం విప్పేడు :

ఓ ... పేద ... రైతా !
పొద్దుగూకులు పాటుపడుతూ । పొట్టమాడ్చుకు పొలము దున్నీ
మెట్టపైరులు మనము వేశామదిరా
ఓ పేద రైతా,
పొట్టకూటికి పాటుపడినాం గదరా ॥ఓ॥
వానకోసముచూసి గింజలు । విసిగి విసిగీ వూరుకొన్నయ్
కాని యొకనాడొచ్చెనోయ్ వాన
వో రైతురాజా,
నల్లమబ్బులు నవ్వి కురిసేయీ ॥ఓ॥
అంతటా మన విత్తనాలు । ఆనందముతో పొంగిపోయీ
గంతులేస్తూ మోసులెత్తాయీ
వో తెలుగు రైతా
యింతింతా వృద్ధి కాసాగాయ్ ॥ఓ॥
బుల్లియాకులు తొడిగి మొగ్గలు ! పెద్దవయ్యెను అల్లదెచూడూ
పిల్లగాలితో బంతులాడే యీ
వో రైతాబావా
సిగ్గుతోడా శిరములొంచే యీ ॥ఓ॥
కాని.......
పుట్టే బిడ్డలకోసం నక్కలు । పొంచియుండె రైతా !
యెట్టుల నీ నీ బిడ్డల గాతునొ । యెంచి చూడు రైతా !
కూలివాని కడు రెక్కల కష్టం
పాలెకాపు పడు శ్రమలు నిష్ఫలం
రెక్కలు ముక్కలు జేసుకూన్నది
నక్కలు బొక్కలు నింపటానికా ?
పులుల నోటి కందించటానికా ?
ఖలుల ఖజానా పెంచటానికా
కాదు కాదు వడి నడుం గట్టరా
బీదా బిక్కిని
పేదా సాదను
తల్లిని తండ్రిని
చెల్లిని తమ్ముని
పిల్లా పాపా

యెల్లర గూడీ
పోరుసల్పు నీ భూమికోసమై
పారద్రోలు మీ ప్రజా పీడకుల ॥ఓ॥

రామిరెడ్డి హృదయ అంతర్భాగంలో నుంచి వెలువడిన ఆ పాటని మహానందంతో ఆ కుంటి రైతు విన్నాడు. అతనొక్కడేగాదు : ప్రజల మనోభావాల్ని స్పష్టంగా, చక్కగా, చురుకుతనం రేపుతూ ప్రతిబింబించుతూన్న ఆ పాటని ఆ దోవన వచ్చేపోయే స్త్రీ పురుషులు ఆగి విన్నారు. గంభీరమైన ఆ ఉదయకాలం యొక్క ప్రశాంతత యీ పాటతో మార్మోగింది; రామిరెడ్డి మధుర కంఠస్వరానికి ముగ్ధులైనట్టు నిశ్చలంగా నిలబడివున్న విశాలమైన పచ్చని పైరుచేల గుండా ఆపాట ప్రతిధ్వనించింది.

పోతూ పోతూ, తన కేదో మంచి ఆలోచన తట్టినట్టు, ఆ కుంటివాడు బాట మధ్యలో అకస్మాత్తుగా ఆగి, ఆగమన్నట్టు రామిరెడ్డి చేయి లాగుతూ, గభాలున యిలా అనేశాడు :

"యేమీ అనుకోకుండా వుంటే వొక్కమాట శెపుతా!"

"హో. చెప్పు, నా ముందు భయపడక్కర్లేదు బాబాయ్" అన్నాడు రామిరెడ్డి, తాను గూడా నుంచొని.

ఆ రైతు పిరికిగా చిరునవ్వు నవ్వుతూ, నేలవంకచూస్తూ, కొత్తస్నేహితుడి లోపాల్ని విమర్శించపూనుకొన్న మంచి యువకుడిలాగా తటపటాయిస్తూ, యిలా చెప్పేడు :

"యేందో అన్నానని అనుకోమాక, నువ్వు తెలివిగలాడివి.. సదువుకున్నావు... ఆ? ... సూడూ - యేదన్నా వుద్దేగం సూసుకోరాదు? యెందుకు చెప్పు యిట్టా సంగమని సింగినాదమనీ తెలివంతా పాడుచేసుకోటం? ... ఆ? మా యంటి యెద్దు మొద్దులికి సంగంగాని నీయంటి సదువుకొన్నాళ్లకి అది పనికిరాదు.. ఆ?.."

ఆ మాటలకి రామిరెడ్డి ఆశ్చర్యపడలేదు! కోపము చెందనూలేదు. ఎందుకంటే, అతనంతకుముందే అలాంటి మాటలు విన్నాడు; అలవాటుపడిపోయి వున్నాడు.

అయినప్పటికీ, ఆ కుంటివాని పక్కనే నడుస్తూ రామిరెడ్డి అందుకేదో జవాబిచ్చేడు; కాని అలాంటి జవాబు యిదివరకే వొక లక్షసార్లు విన్నట్టుగా-కొత్తగా మద్రాసు పోయివచ్చినవాడు వర్ణనమొదలుపెడుతూంటే, అదివరకే మద్రాసుని తొంభైసార్లు చూసినవాడు అతన్ని అదోతరాగా చూసినట్లు చూస్తూ - అంతగా పట్టించుకోనట్లు ఆఁ వూఁ అని వూరుకొన్నాడా కుంటి రైతు.

ఆ యిద్దరూ బావివద్దకు చేరేరు. అక్కడ మగాళ్ళకంటే ఆడవాళ్ళే యెక్కువగా వున్నారు. అందులో చాలామంది తలలు జీబిరిగా వున్నాయి; నిద్రమత్తు యింకా వారి ముఖాల్ని వదిలినట్టులేదు - ముఖాలు మందకొడిగా వున్నాయి. సామాన్యంగా మెట్ట ప్రాంతాల్లో యెక్కువగా కనిపించే నీలి రంగు చీరో, యఱ్ఱచీరో, నల్లచీరో - వారు కట్టుకొని వున్నారు. అవి దుమ్ముధూళీ కొట్టుకొని, మురికిగా, చిరుగులు చిరుగులుగా, అతుకులు అతుకులుగా వున్నాయి.

వారి మధ్యవున్న సీతని రామిరెడ్డి చూసేడు; వొక ఖాళీకుండ భుజానపెట్టి "సులాబీ" లాగా వున్న ఆ బావి వొడ్డుమీద ఆమె నిల్చుని యెవరితోనో యేమిటో మాటాడుతోంది. ఆమె పక్కన సుబ్బమ్మ గూడా వుంది; ఆమె నోరు వెడల్పుగా విప్పి, కుడిచేయి కిందకీ మీదకీ ఆడిస్తో, మధ్య మధ్య బుగ్గలు నొక్కుకుంటూ యేమిటో చెబుతోంది.

ఆ యిద్దరు మగవాళ్లా అక్కడికి రాగానే అక్కడున్న ఆడవాళ్లు గప్‌చిప్‌గా వూరుకొని ముఖాలు బిగించేరు. దొంగచాటుగా కనపడీ కనపడనట్లుగా, రామిరెడ్డి సీతవంక చూసి చిరునవ్వు నవ్వేడు; సీతగూడా అలాగే చూసింది.

రామిరెడ్డి, సోమిరెడ్డి బావి మెట్టుదిగి నీళ్ళకోసం వెళ్లేరు. సుబ్బమ్మ వొకసారి రామిరెడ్డివంక చూసి, తర్వాత సీతవంక చూసి నిట్టూర్చింది; సీత కలవరపడి, సిగ్గుతో తలొంచుకుంది. కొంతమంది స్త్రీలు గొంతులోదీ గొంతులోనే - వినపడకుండా - ముసిముసి నవ్వులు నవ్వుకొన్నారు. బూరె బుగ్గలూ, చింపిరితల గల వొకామె ఆగలేకనా అన్నట్లు పకపక నవ్వింది. రామిరెడ్డి కోపపు మంటతో గాలి భారంగా పీల్చుతూ, యిటువైపు తలతిప్పి ఆ "చింపిరమ్మ" వంక చూసేడు. సీత ఆ చింపిరమ్మవంక మూతివిరిచి, యిలా అన్నది :

"అంతగా పగలబడితే యెట్టా!? కొంత మీ ఆయనకోసం దాసుకో!!"

ఆ మాట ఆ చింపిరమ్మకి చుర్రుమని అంటుకొన్నది; కాని తనది తప్పు అనే భావంవల్ల ఆమె యిక యేమీ అనలేక ముఖం ముడుచుకొంటూ, పళ్ళబిగువుతో పెదిమలు సాగదీసుకొంది.

ఆఖరి మెట్టుమీద నుంచుని, సోమిరెడ్డివంక తిరిగి, "విన్నావా?" అన్నాడు రామిరెడ్డి.

"వో, మా సక్కగా! దాన్ని నేను మాబాగా యెరుగుదు నబ్బాయ్. నువ్వు పిల్లగాడివి; నీకింకా లోకం సంగతి సక్కగా తెలవదు! అదొక శింపిరి శీనారి ముండ? యెప్పుడూ అంతే...' ' అని సోమిరెడ్డి బదులుచెప్పి, బుడుంగున తన కడవని నీటిలోముంచి, చలాకిగా దాన్ని పైకి యెత్తేడు. ఆ నీటిమీద వున్న పచ్చని శిల్కులాంటి పసరు తెట్టెలు ఆ వూపుకి నీటిపైన అటూ యిటూ వూది వొకదాన్నొకటి తోసుకొన్నాయి. సన్నని ఆ పసరు తెట్టెలమీద రకరకాల పురుగులూ ఎగురుతూ, పాకుతూ, గెంతుతూ వున్నాయి.

ఆ యిద్దరూ వెళ్ళిపోయినాక, మెట్టుదిగి నీళ్ళు తీసికొని వొకామెతో కలిసి సీత గూడా వెళ్ళినాక, ఆడవాళ్ళు గుసగుసలు ప్రారంభించేరు.

"ఆ కుంటి సోమప్పకి గూడా సంగం పిచ్చి పట్టుకుందల్లే వుంది, శిన్నమ్మా" అని వొక బక్కపల్చని, పల్లికళ్ళ మనిషి అన్నది.

"అబ్బో! ఆ కాలు కుంటిదైందిగాని, ఆ కాలేగనక కుంటిది గాకుంటె యింగ భూమ్మీన ఆగుతాడా!?" వొక పొడుగాంటావిడ వంత బలికింది.

"మరేగాని పిల్లా, కాలమెట్టా వుండది? పితపకాలం, పితపకాలం! అసలు, పెద్దోండ్లకీ - బుద్ధి చచ్చిందా? సూడు పిల్లా - పెద్దోండ్లకి బుద్దేవుంటే, ఆ పిల్లగాడట్టా మాలగూడెం వెంట తిరుగాతాడా? ఆ? పితపకాలం, పితపకాలం!!..." అని వొక ముసలమ్మ అంటూండగనే -

"అదేందిలే. యీ కాలపు బుడతలు పెద్దోండ్లమాట లింటరా యేంది?'' అని సుబ్బమ్మ అంది.

"నిజమే, నిజమే'' అని మొదటి ముసలమ్మ అంగీకరించి యిలా అంది - '' అయినా సూద్రపోల్లు మాలోండ్లనెట్టా తాకుతారోయేందో నాకు తెలవకుండుందమ్మా! యేమోనమ్మ నాశిన్నతనంలో నేనిట్టాంటి శిత్రవలుసూడలేదమ్మ!! యేందదీ సొత్తా...యేందది?''

"సొతంతరం!'' అని వొక పిల్ల సరిదిద్దింది.

"ఆఁ యేదోఒకటిలే దాన్ని బొట్టికాయలు తీసకొస్తారా? తీసకొచ్చి మనకిస్తారా?... నా శిన్నతనం మట్టి యీ యెట్టిశాకిరీ సూస్తాన్నా. అది బగవంతుడే అట్టాగ పెట్టాడు! దాన్ని యీండ్లు పొగొడతారా?... సరే... మన కెందుకొచ్చిన యిబ్బండం? యెవురి వూసో మనకెందుకమ్మ? ... పిల్లా, యీ కుండ బుజంమీదకెత్తవే...పట్టు...''

వారంతా గ్రామమువైపు బైలుదేరారు. అదీయిదీ మాటాడుకొంటూ; వారిలో చాలామందికి యీ "లొడ లొడల'' అర్ధమేంటో బోధపడలేదు; వారుగూడా ఆ మాటలు వింటూ, మధ్యమధ్య తాముగూడా వొకమాటనో అరమాటనో అంటూ, "నలుగురితోపాటు నారాయణా'' అనిపించేరు.

## 2

రామిరెడ్డి మళ్ళీ తిరిగి నీళ్ళకొచ్చేటప్పటికి బాగా పొద్దెక్కింది. నీళ్ళకు వచ్చేవారు పల్చబడ్డారు. అక్కడొక మనిషీ, యిక్కడొక మనిషీ తప్పితే అగుపించటంలేదు.

ఆ సమయంలో రామిరెడ్డి మనసు వొకే విషయాన్ని గురించి ఆలోచిస్తోంది. అది తన పెళ్ళి సమస్య.

తల్లిదండ్రులు అతన్ని చాలా వొత్తిడి పెడుతున్నారు. పెళ్ళిచేసుకోమని; కనీసం పెళ్ళన్నా అయితే వారికి సంతృప్తిగా వుంటుంది. అంతేగాదు పెళ్ళయితే యీ సంగం పిచ్చగూడా కుదురుతుందని వారి నమ్మకం! అందువల్ల ప్రతిరోజు ఆ సమస్యని తండ్రిగానీ, తల్లిగానీ కదిలిస్తూనే వున్నారు. వారు వొకటో రెండో సంబంధాలు మాటాడుకొచ్చారు గూడాను. అయినా రామిరెడ్డి వింటేగా? యిదుగో అదుగో అంటూ జరుపుకొస్తున్నాడు; కారణమేమిటో వారికి అంతుపట్టలేదు. పైగా, వారికి రాను రాను కోపం గూడా పెరుగుతోంది తాము కని, పెంచి, చదువుచెప్పిస్తే, యేదన్నా వుద్యోగం చేసేదిపోయి, యేమిటో సంగమంటూ వూరేగుతూ, అది చాలక పెళ్ళి విషయంలో గూడా తమకి యెదురు చెబుతాడా?

రామిరెడ్డికి గూడా అసహనం, కోపం పెరుగుతునే ఉన్నాయి. తనని కన్నారు, పెంచారు, చదువు చెప్పించారు - కాదన్న దెవరు? కని పెంచారు గాబట్టి తల్లిదండ్రులు చెప్పే ప్రతి మాటా - అదెంత చెడ్డదయినా - విని తీరాల్సిందేనా? తనేమన్నా చిన్నాడా చితకాడా? ఆ మాత్రం తనకు మాత్రం తెలవదు? అయితే పెళ్ళిచేసుకొనేది తానా, తన తల్లిదండ్రులా? తానేగందా?

అయినప్పుడు తల్లిదండ్రుల సంతృప్తి కోసమని తాను, యిష్టమున్నా లేకపోయినా, యెవర్నో పిల్లను కట్టుకొని, రేపు మతులూ సుతులూ కుదరక, కీసర బాసరమని కీచులాడుకొంటుంటే, అది బాగుంటుందా? తన యిష్టమొచ్చినపుడు, తనకునచ్చిన పిల్లని, పెళ్ళిచేసికొంటాడు; అంతే!

ఈ విషయంలో తల్లిదండ్రుల కోపానికి యింకొక కారణంగూడావుంది. కొడుకులకి పిల్లని తీసుకొచ్చి చేయటం తల్లితండ్రుల బాధ్యతగాని, కొడుకులదిగాదే! రేపు తమ కొడుకు యే "మాలదాన్నో" కట్టుకొచ్చి యింట్లో పెడతానంటే తాము వొప్పుకోవాలన్నమాట? అందుకేనన్నమాటా తాము కొడుకుల్ని కన్నది!? భాగా వున్నది, భాగావున్నదంట!

ఆ విషయం యెత్తినప్పుడల్లా రామిరెడ్డికి మరీ మండుకొస్తోంది. "మాలది" మనిషిగాదా? దానికి మాత్రం తమకి మల్లే చీము, నెత్తుర్లు లేవా? .... అసలింతకీ పెళ్ళి అనేదెందుకు? తల్లిదండ్రుల సంతృప్తికా, భార్యాభర్తల సుఖానికా? తనకు సుఖంయిచ్చే పిల్లని యెవర్ని చేసుకొంటే మాత్రం తల్లి దండ్రులకెందుకూ? వుహూ, తన యిష్టం వచ్చిన పిల్లనే తాను చేసుకుంటాడు - అంతే; యిక రెండో మాటలేదు!!!

రామిరెడ్డికి సీతమీద ప్రేమ వున్నది. కాని ఆ విషయం తల్లిదండ్రుల్తో యింతవరకూ చెప్పకుండా, డొంక తిరుగుడుగా తాను మాటాడటానికి రెండు కారణాలున్నాయి. సుబ్బారెడ్డికి, రంగారెడ్డికీ చాలా కాలం కిందట చేనుకాడో, చెట్టుకాడో, గట్టుకాడో పుట్టకాడో తగాదా వచ్చింది. అప్పట్నుంచీ ఆ రెండు కుటుంబాలకి పొత్తూ పొంతనా లేదు, యెడ మొఖం పెడముఖంగా వుంది. అందువల్ల తాను సీతను పెళ్ళిచేసుకొంటానంటే యింకేమన్నా వుందా ? రెండో కారణమేమంటే - తమ కంటే రంగారెడ్డి కుటుంబం కొంచెం బీదది; తన తండ్రికి నచ్చేంత కట్నం యివ్వలేడు. రంగారెడ్డి. అదీగాక, సీతమ్మ చదువుకోలేదు. చదువుకోని పిల్లని చదువుకొన్న తన కొడుక్కి చేసుకోటానికి వాళ్ళు వొప్పుకుంటారా; ఇక మూడో కారణం గూడా వుందిగాని, అదంత లెక్కలోదికాదు. కాగా, ప్రేమలోవున్న ప్రతి యువకుడికీ అది వుండేదే - సిగ్గు!!

పై అన్ని కారణాలవల్లా రామిరెడ్డికి పెళ్లి సమస్య ఒక పెద్ద గొడవగా తయారైంది.

ఆ ఆలోచనల్తో రామిరెడ్డి సతమతమౌతూ బాటనే నడుస్తూన్నాడు. తోవప్రక్కని అక్కడక్కడా వొక పైరు తగుల్తుంది. అతనలా ఆలోచించుకొంటూ కొంతదూరం వచ్చేసరికి వొకచోట కొంచెందూరంలో వొక కడవ చేతితో పట్టుకొని సీతకనపడింది. ఆమె యెవరితోనో మాట్టాడుతున్నట్టుంది. అవతలి మనిషి పైరు చాటున వుండటంవల్ల కనిపించటంలేదు. సీత మాటాడుతూనే కొద్దిక్షణాలకి యిటు తిరిగి, వస్తూన్న రామిరెడ్డిని చూసి నవ్వింది. అప్పుడు అవతలిమనిషి యిటుతలవంచి చూసేడు. అతనెవరోగాదు - కోటిరెడ్డి !!

రామిరెడ్డి గుండెలో మునుపెన్నడులేని ముల్లుయేదో దడాలున గుచ్చుకొన్నది !!!



# ప్రేయసీ ప్రియులు

ప్రేమ రాజ్యంలోన నెప్పుడు అసూయవుంటుంది,
ప్రేమ రాజ్యపు కాపలాకై భటుడతా నంటుంది;
యెప్పుడో హఠాత్తుగా
తప్పుడూ తలంపుతో
అదుగో అచ్చట తిరుగుబాటని
యిదుగో యిచ్చట విప్లవమ్మని
సిగ్గులిచ్చియు ప్రేమరాజ్యం
భగ్నమును చేయ జూస్తుంది !

- వీనస్ అండ్ అదోనిస్ (షేక్స్‌పియర్)



అది వుదయం; సూర్యరశ్మి ప్రకాశవంతంగా వుంది. ఇంకా పది గంటలు కాలేదు. యేదో జానపద గీతం పాడుకొంటూ, తమ కందిచేలో సీత గేదె మేతకోసం ఆ మొక్కలూ యీ మొక్కలూ యేరుతూ, పచ్చిగడ్డి కోస్తోంది. ఆ కందిచేనంతా పూవుపూసి కన్నుల పండువుగా వుంది. వీస్తోన్న పిల్ల గాలికి ఆ కంది మొక్కలు మెల్లగా అటూ యిటూ వూగుతున్నాయి. వొక మేకను మేపుకుంటూ మమ్మూ సాహెబ్ అటుగా వచ్చాడు. ఆ మేక చెవులు టపటప లాడిస్తో, సంతృప్తిలో మధ్య మధ్య తన చిన్న తోకని అటూ యిటూ కదిలిస్తో, గట్లమీదున్న పచ్చిగడ్డినీ,తుమ్మలూ మొదలైన వాటి చిగుళ్లనూ తింటోంది. సీత గడ్డికోస్తున్న కందిచేని వద్దకి రాగానే, చేలోంచి అతనికి గడ్డికోస్తున్న కత్తి యొక్క గరగరశబ్దం వినపడింది. యేమిటోనని అతడు మడమలు మీద గూచుని చేలోకి దృష్టిసారించి చూశాడు. ఎవరో ఒకమ్మాయి అతనికి కనపడింది. ఆ చేను రంగారెడ్డిదని అతనికి తెలుసు. ఆ పిల్ల తప్పకుండా సీత అయివుండాలి! లోపలకెళ్లి సీత నేదో గమ్మత్తుచేసి సంతోషించాలనే కోరికను అతడు అణుచుకోలేకపోయేడు.

అందువల్ల మేకనొక తుమ్మపీకకి కట్టేసి, చల్లగా చేలోకి జారుకొని, నిశ్శబ్దంగా సీత వెనకాలవెళ్లి రెండుచేతుల్తోనూ ఆమెకళ్లు మూసేడు.

"యెవురూ" అని సీతమెల్లగా అరచి, ఆ చేతుల్ని వదిలించుకోజూసింది.

చేతుల్లోంచి "పిట్టని" జారిపోనీకుండా గట్టిగాపట్టుకొని, తనముసలివణుకుడు గొంతుని యువకంఠ స్వరములోకి మార్చి, మమ్మూ యిలా అన్నాడు:

"యెవరో శెప్పుకోసూద్దాం"

"ఆ యెవురూ? వొదులు!"

"శెప్పుకో!"

"గ్యాణంలేదు?"

"శెప్పుకో"

"అబ్బ, వొదలమంటాంటే!"

"నన్ను పెళ్లి చేసుకొంటానంటే వొదుల్తా!"

"పెళ్లా? యెవురునువ్వు? పళ్లూడగొట్టొద్దూ?"

'నన్ను శేసుకుంటే నీకుకిందనుంచి మెడదాకా నగలు తొడుగుతా. నువ్వు రాణీవౌతావు!'

యెలాగైతేనేమి, సీత అతనిచేతుల్లోంచి బయటపడింది.

"ఆరి! నువ్వా! ఆరి నీ తాత పడిసావా!!"

"శేస్కో. నా కంటే మంచి మొగుడు నీకు దొరుకుతాడూ?"

"అహ్హాహ్హాహ్హా! ఆరి నీ తాతపడిసావ! బలే మొగుడివి! హె - హే - హే! కూసుంటే లెగలేవు, కూరాకుతేలేవు - బలే మొగడవి!!"

సీత పగలబడి, విరగబడి నవ్వింది. తను గూడా నవ్వు ఆపుకోలేకపోయేడు మమ్మూ; వణుకుతూ నీరసంగా వుండే తన పొడినవ్వును తానుగూడా నవ్వేడతను; తర్వాత ఆ నవ్వువల్ల కలిగిన ఆయాసంలో దగ్గేడు.

ఆ యిద్దరూ నేలమీదకూచున్నారు. ఆ "దొంగ ముసలాడు" సీత వంక అదోరకంగా చూసేడు.

"నీకు తెలవదుపిల్లా" అంటూ కొంతసేపటికి మమ్మూ ఆరంభించేడు - "ఆడోండ్లెప్పుడూ నేనంటే పడిసచ్చేవోండ్లు! వొట్టు, నేనొట్టిది శెప్పటంలేదు. నేను కుర్రతనంలో వుండప్పుడు సాలా అందంగా వుండేవాణ్ణి! అందుకని వూళ్ళోవుండ ఆడపిల్లలంతా నన్ను శేస్కోమంటే నన్ను శేస్కోమని నాయెంటపడ్డారు!! వూం, నిజం!!! నన్ను శేస్కోమంటే నన్ను శేస్కోమనీ వొకటేగోలా. కానీ, వొక్కామనిసీ అంతమంది పిల్లల్ని యెట్టా శేస్కోనేదీ? సరే, ఆపైనా వొక్కా ఆలోశనా చేశా. 'యిశ్ ఆగండిముండల్లారా ! మీ అందర్నీ నేను శేస్కోలేను. కనకా మీలో మీరూ రాజీపడి ఒక్కాపిల్లానీ నా దగ్గిర్కీపంపండీ, దాన్నీ శేస్కొంటా' అన్నా"

"ఆ మట్టున యేమయ్యింది తాతా?" తాను నముల్తాన్న గడ్డిపరకని నోట్లోంచి తీసేస్తు, సీత ఆదుర్దాగా అడిగింది.

"యేంజరుగూతాదీ? యెరుగవూ? ముగ్గురు ఆ డోండ్లూ వొక్కాసోటా శేర్తేనే ముడీపడదే, అంతామందీ, ఆడోండ్లకీ మధ్య రాజీ కుదుర్తాదా? ఆ మోయినా అంతా గల్సీ వచ్చీ నామీదా పడ్డార్! నేను పారిపోకపోతే కీలుకి కీలూ, కాలుకి కాలూ, వేలుకి వేలూ వుడగొట్టీ వేశావాండ్లే!! ఆ తర్వాత యేమైందో తెల్సా?"

"యేమయ్యింది? వాండ్లలో నువ్వు వొక్కదాన్నీ పెళ్లి చేసుకోలా తాతా?"

నైనై. శేప్పేదినూ. ఆ మోయినా యింటికీ పరుగెత్తీ యింటికాడ నాపెళ్ళాం వుంటే దాన్ని శేస్కున్నా!!!"

''అయితే నీ సొంత పెళ్లాన్నే పెళ్ళి చేసుకున్నావు!! ఆరి నీ తాత పడిసావా!!!''

సీత పొట్టచెక్కలయ్యేట్లు నవ్వింది వొళ్ళంతా వూగిపోతుండగా; ఆ వింత ముసలాడు గూడా నవ్వి నవ్వి దగ్గేడు చివరికి.

"వూ నేనంటే యెవుడనుకున్నావ్!? ఆండోండ్లూ నేనంటే అట్టాపడి సచ్చేవోండ్లూ! మరి, నాకంటే మంచీ మొగుడూ నీకు దొరుకుతాడా?''

"ఆరి నీతాత పడిసావా!!''

వారి నవ్వులతో ఆ చేను ప్రతిధ్వనించింది.

## 2

నారలా నవ్వుకొంటుండే సమయంలోనే రామిరెడ్డి అటు వచ్చాడు. ఆ చేను దరినేవున్న డొంకలో అతను నుంచున్నాడు. ఆ డొంకలో వర్షాకాలంలో మాంచి మేత పడుతుంది; దాన్ని పటేలు తన స్వాధీనంలో వుంచుకొన్నాడు; రైతుల దూడ అన్నమాట అటురావటానికి వీల్లేదు. ఆ డొంక సరాసరి నాంచారమ్మ గుడివద్దకి పోతుంది.

ఏమిచేయటానికీ తోచక రామిరెడ్డి కాసేపు అలాగేనుంచున్నాడు. అక్కడ కట్టివేసిన మేక ఇతన్నిచూసి, తనను విప్పదీయమంటూ తన తలతో అదేపనిగా సైగచేస్తోంది. అప్పుడు అతనికొక మాంచి ఆలోచన తట్టింది. యేవిధాన్నయినా సరే ఆ ముసలాణ్ని అక్కడినుంచి బైటికి పోయేట్లు చేయటం అవసరమూ, వుపయోగమూగూడాను. యీ విషయంలో మేకని వూడదీయటం భలేమంచిపని!

మేకను వూడదీసి అతనిలా కేకబెట్టేడు;

'మమ్మూ తాతా! మేకవూడదీసుకొని పారిపోతోంది.....'

లేడిలాంటి తన బెదురు కళ్లతో తన యజమానికోసం అన్నిదిక్కులూ చూస్తూ, కొంచెం దూరం చేలప్రక్కగా పరుగెత్తి, అక్కడొకచోట ఆగి విచార సూచకంగా అరిచింది.

మేకను తిడుతూ, పడుతూలేస్తూ, మమ్మూ చేనుబైటికి వచ్చి, దడాలున రామిరెడ్డిని చూసి, అదోరకంగా చిరునవ్వు నవ్వి, మేకని పిలిచేడు. అది సంతోషంతో అరుస్తూ, వొక్క గెంతులో మమ్మూవద్దకొచ్చి, అతనివంక వింతగా చూసింది. ముసలాడు తనమేకలాంటి సన్నటి గడ్డాన్ని సవరించుకొని, వస్తానన్నట్లు తలాడించి, మెల్లగా తనమేకతో గుడివైపుకి బయలుదేరేడు.

అనిశ్చితంగా రామిరెడ్డి యింకా అక్కడేనుంచున్నాడు.

రామిరెడ్డీ, సీతా తమ చిన్నతనం నుంచీ వొకర్నొకరు యెరుగుదురు! వారు కలిసి మెలిసి ఆడుకొన్నారు, పాడుకొన్నారు. యిద్దరుగూడా తల్లిదండ్రుల్ని పోగొట్టుకొన్నవాళ్లే, చిన్నతనంలో కలిసి మెలసి పొలంవెళ్లేవారు; యేమిటేమిటో అందని పళ్లని చూసి కలలుగనేవారు. అమాయకమైన నిర్మలమైనవారి హృదయాల్లో వొకరిపట్ల వొకరికి ప్రేమ చిగుర్చింది; పెరిగింది.

కాని, కొంచెం పెద్దవాళ్లయాక రామిరెడ్డి బడిలోచేరినాక, అందులోనూ ముఖ్యంగా అతను "బస్తీచదువుకి'' పోయాక, వారి ఆటపాటలూ కేరింతలూ పేరింతలూ కట్టడిపోయినాయి. ఆరేళ్లు

అతడు బస్తీలోవున్నాడు; మధ్య మధ్య యింటికివచ్చినా అతనికి సీతను కలుసుకొనే అవకాశం పెద్దగా దొరికేదిగాదు. ఆఖరికి స్కూల్‌ఫైనల్ ప్యాసయ్యి యింటికి వచ్చేసినాక వొకనాడు అతడు రంగారెడ్డి యింటికెళ్ళేడు. తన తల్లిదండ్రులు చూడకుండా. యెంతలో యెంతమార్పు! చిలిపిగా, కొంటెగా వుండే సీత యెంత మారిపోయింది? సీత వొడ్డూ పొడుగ్గాగల మనిషిగా, అందంగా పెరిగింది! ముఖాన యేమిటో సిగ్గు తళుక్కుమంటోంది!!

బస్తీలో అతనికి రాజకీయాలు అబ్బినయి. అతనితోపాటు చదువుకొన్న కోటిరెడ్డి, జాగీర్దారు కొడుకు నర్సిరెడ్డి గూడా ఆ రాజకీయాల ప్రాబల్యంలో పడక తప్పలేదు పెద్దవాళ్లు యెంత కాపలాలుగాచినా! ఇంటికి రాగానే రామిరెడ్డి కమ్యూనిస్టుపార్టీ అంటూ గొడవ ప్రారంభించేడని మీకు తెలుసు. అదే అతని పని!

తల్లిదండ్రులు చూడకుండా అప్పుడప్పుడూ సీతని రామిరెడ్డి కలిసికొంటూంటేవాడు. రంగారెడ్డి వాళ్లు గూడా తమ విరోధి కొడుకు అని కేటాగాచూసేవాళ్లుగాదు. అందులోనూ ముసలాడు - కొండారెడ్డి - యెంతో ఆప్యాయంగా పలకరించేవాడు; యెన్నాళ్లనుంచో కలిసి మెలసివుంటున్న కుటుంబాలు పోట్లాడుకొని పలుక్కోకుండా బిగదీసుకొనిపోయినందుకు తన బాధనీ కోపాన్నీ వెలిబుచ్చేవాడు.

"వోరబ్బాయ్! మీ కుర్రోండ్లేరా యేదన్నా యీ పాడులోకానికి ముక్తి జూపిస్తేనూ. మా పని అయిపోయింది. అందులోనూ మా పెద్దోండ్లకి తిట్టుకోటం, తన్నుకోటం తప్పితే యింకోటి తెలవదు." అని ముసలాడు అంటూండేవాడు. అలా అనేప్పుడు అతని కళ్ళల్లో నీళ్లు గిర్రున తిరిగి కళ్ళు యెర్రనయ్యేవి. రామిరెడ్డికి గూడా యిదంతా వింటూంటే హృదయంలో బాధగా వుండేది.

కాని, యీ మధ్య యేదో విషయం - సీతకి సంబంధించిన వొక విషయం - రామిరెడ్డిని కలవర పెట్టసాగింది. సీత అచ్చంగా తనదేనని అతను అనుకొన్నాడు. అయితే, ఆ తరువాత జరిగిన కొన్ని సంగతులు అతని వూహకి ఆధారంలేదని రుజువు చేశాయి; యేదో సందేహరేఖ, యేదో అనుమానం అతని హృదయంలో తలెత్తి చిరుగాలిలోని దీపపు వత్తిలాగా రెపరెప మనసాగింది; కాలక్రమేణా దానికొక స్పష్టమైన ఆకారం యేర్పడింది.

సీతా, కోటిరెడ్డి మాటాడుకోదగిన ఆ రహస్యమేమిటి? అతని హృదయంలో తీవ్రమైన బాధ చెలరేగింది; కాని సీతతో తనకున్న సంబంధం మాత్రం తెంచుకోలేదు. సీతా, కోటిరెడ్డి మాట్లాడుకునేప్పుడు తాను వారినేమీ అనుమానించటం లేదన్నట్లూ, అదేదో మామూలు విషయమేగా అన్నట్లూ అతను నటించేవాడు.

రామిరెడ్డి చాలా తడవలు తనని తాను తీవ్రంగా విమర్శించుకున్నాడు - కోటిరెడ్డి తనకిమల్లే వొక కామ్రేడ్ గందా? సీతతో మాటాడే హక్కు తనకి తప్ప యితరులెవ్వరికీ - అందులోనూ కోటిరెడ్డికి - లేదా? అది తన తప్పు. తానెప్పుడూ అలా ఆలోచించరాదు. వారు మాటాడుకోనేది యింకేదన్నా సంగతై వుండొచ్చు!

ఆ బాధాకరమైన ఆలోచనల నుంచి సంగంలో అతను చేసే పని మరిపించేది; ఆ పనిలో మునిగిపోయి అతను అవన్నీ మరిచిపోయేవాడు.

అయినా, యీ మధ్య సీతని కల్సుకోటం మానేశాడు. యెందుకంటే, నిజంగా ఆ ఇద్దరూ ప్రేమించుకొనే వుండొచ్చు; వారినే సుఖపడనియ్యి; వారి ఆనందాన్ని తానెందుకు పాడుచెయ్యాలీ?

కాని, తానెంతగా ఆమెనుంచి దూరంగా వుందామనుకొంటున్నాడో,అతని హృదయం అంతగా అతన్ని ఆమె వద్దకి లాగుతోంది మనశ్శాంతి యివ్వకుండా! యీ బాధనీ, యీ అటూ యిటూ తేలని పరిస్థితినీ, యీ ప్రాగిసలాటనీ రామిరెడ్డి యేమాత్రమూ భరించలేకపోయాడు. అందువల్ల, రాత్రి చాలా తనలో తాను వేదనపడిన తర్వాత, ఆమెతో మాట్లాడి యేదో ఒకటి తేల్చుకోటం మంచిదని నిశ్చయించుకున్నాడు....

అందువల్లనే రామిరెడ్డి యిటు - యీ-చేనివద్దకి-రావటం జరిగింది.

యెవరన్నా తనని చూస్తున్నా రేమోనని చుట్టూవోసారి పరీక్షించి, రామిరెడ్డి చల్లగా చేలోదూరేడు. అతని మెత్తని అడుగలచప్పుడికి సీత గడ్డికోయటం ఆపి, కూచున్నది. అతను వచ్చాడు. సిగ్గుతో ఆమె ముఖం యెర్రబడింది. అతను చిరునవ్వు నవ్వేడు. ఆ చిరునవ్వులో యేదో అదివరకులేని కొత్త విషయాన్ని ఆమె కనిపెట్టింది;బాధతో, విచారంతో ఆమె ముఖం నల్లబడింది. రామిరెడ్డి యిది గమనించి, చిరునవ్వు ముఖం పెట్టాడు.

"నే....నే...నేను....నీతో.....మాట్లాడాలని.....వచ్చా....." అని అతను నత్తులు కొట్టేడు.

"యేంటది?" అని ఆ నీరసస్థితి నుండి కోలుకొని ఆమె అన్నది.

'ఆ యేమీలేదు.... నేను అడిగిందానికి నువ్వు..... సరిగా సమాధానం చెప్పుతావా?'

'అదేందో శెప్పరాదు? యేందియ్యాల యేందోకొత్తగా వుండవే మడిశివీ! ఆ? దబ్బుని శెప్పు.... మయ్యో యెవురో మనం వొంటరిగా వుంటంసూత్తే....'

'ఆ ఆ. చెపుతా, చెపుతా.....'

కాని, యెంత తన్నుకొన్నా అనుకొన్న విషయం, అడగదల్చుకొన్న సంగతి, బైటపెట్టలేకపోయేడు. మరి సీతకేమో అతని ప్రవర్తన ఆశ్చర్యంగా, వింతగావుంది; కాగా, యెవరన్నా తమని యీ కందిచేలో వొంటరిగా వుంటంచూస్తే యేమనుకొంటారు?

వుండి వుండి వొక్కసారిగా సీత పరాకుగా దేనివంకో చూస్తున్నపుడు - రామిరెడ్డి యిలా అనేశేడు దడాలునః

'నన్ను పెళ్లిచేసికొంటావా?'

చీకట్లో హఠాత్తుగా యేదో దిష్టిబొమ్మని చూసినట్లుగా, ఆమె వులిక్కిపడింది; అతనివంక వెర్రిగా చూసింది. అయితే ఆ వైఖరి చాలా కొద్దిక్షణాలు మాత్రమే వుంది. వెంటనే ఆమె ముఖం సిగ్గుతో మరోసారి యెర్రనైంది; ఆనందంతో ఆమె కనురెప్పల్ని కిందికివంచింది.

ఇదంతాచూసి, ఆమెకి తనని పెళ్ళిచేసుకోవటం యిష్టంలేదని రామిరెడ్డి వూహించుకొన్నాడు.

అయినప్పటికీ అంతటితోనే అతను వూరుకోలేకపోయేడు. అంతా యిప్పుడే యీరోజునే తేలిపోవాలి!

ఆమె నిశ్శబ్దంగా వూరుకోవటం చూసి, రెట్టించిన ధైర్యంతో రామిరెడ్డి మళ్లీ అదే ప్రశ్నని అడిగేడు.

"యే యే? నాకు యిష్టమే. నా మనస్సు నువ్వెరగవా; అయినా మయ్యా మమ్మా యేమంటారోగా మరి!" వణుకుతుండే తన కనుబొమ్మలెత్తి ఆమె నిట్టూర్చింది.

"యెందుకని, యెందుకనీ?"

"సంగమంటే వాండ్ల కిష్టంలేదు. అందుట్లోనూ మా పిన్నబ్బ మరీ యిది! సంగంలో తిరిగేవోండ్లంతా చెడిపోయినాళ్ళేనంట...."

ఆ? నిజమేనా? నేను చెడిపోయినావాణ్ణని నీ నమ్మకమా?"

"అయ్యో, నేనన్నానా ఆమాట!? మా పిన్నబ్బ అంటడు...."

"అయితే నిన్ను పెళ్లిచేసుకోవాలంటే నేను సంగం విడిచిపెట్టి రావాలన్నమాట!?

ఆమె ముఖం వికసించింది.

"మరి సంగం వదులుకోరాదు? వదులుకుంటే తప్పేంటి?" అని అన్నది.

రామిరెడ్డి ముఖం కోపంతో యెఱ్ఱబడింది; అది చూచి సీత డీలాపడింది.

సరే, సరే. నీకూ నీ పెళ్లికీ వొక సలాం!" అని రామిరెడ్డి మంటతో పుసపుసా అనేసి, విస విసా బైటికి నడిచి వెళ్ళేడు.

చేని గట్టు మీదకి వచ్చేసరికి, నాంచారమ్మ గుడి వేపు నుంచి వస్తూ వూరివేపు పోతూన్న పటేలూ సత్తిరెడ్డి అతనికి యెదురయ్యేరు. యెందుకో వారి ముక్కు పగలగొట్టాలన్నంత కోపమొచ్చింది. కాని తమాయించుకొని పడమటి దిక్కుగా బైలుదేరాడు.

పటేలు, సత్తిరెడ్డీ వొకరి ముఖాన్నొకరు చూసుకొని, యేదో చూపులు మార్చుకొన్నారు.....

రామిరెడ్డి నడుస్తున్నాడన్న మాటేగాని, యెక్కడి కెళ్తున్నాడో, యెందుకెళ్తున్నాడో అతనికే తెలియదు. అతను నడుస్తున్నాడు అంతె; యేమీ వినపడటం లేదు; ఏమీ చూడటం లేదు అతని దృష్టి సరిగాలేదన్నట్లుంది. ఆవిరిపొగలు చుట్టేసిన యేమిటేమిటో ఆకారాలు తప్ప అతనికేమీ అగపడినట్లులేదు.

పడమటి దిక్కునుంచి వస్తూన్న కోటిరెడ్డిని ఢీ కొనేదాకా అతని మతి సరిగాలేదు. కోటిరెడ్డి యేదో ప్రక్కవూరు నించి వస్తున్నాడు.

విచారంగా మకమకలాడుతూన్న రామిరెడ్డి ముఖం చూసేసరికి కోటిరెడ్డికి చాలా ఆశ్చర్యం గలిగింది; అంతేగాదు అతని వింత ప్రవర్తన కోటిరెడ్డికి మరింత ఆశ్చర్యం గలిగించింది.

"యేంటి రామూ అట్లావున్నావ్?"

"యేమీలేదు. నాకు వొంట్లో బాగోలేదు...."

"వొంట్లో బాగాలేదా? రాత్రి మనం కలిసికొన్నప్పుడీ సంగతి చెప్పనేలేదే! చెపితే...."

"వొద్దొద్దు. అదే పోతుంది"

"సరే, వెళ్ళే దెక్కడికి?"

"యెక్కడికీ లేదు. యేదో పొలం చూద్దామని....".

"ఆరి నీ దుంపతెగ, మనిషివి అట్లా జబ్బుగావుండి పొలం వచ్చిన దెందుకు; పద, యింకా యెందుకు? పొద్దెక్కింది. పోదాంపద యింటికి...."

"ఆ. యేమీ ఫర్వాలేదులే?"

"అయితే రావా?"

"రాన్లే"

'సర్లే నేవెళ్తన్నా అట్లయితే. అయినా నావుద్దేశ మేంటంటే నువ్వు యింటికివచ్చి కొంచెం విశ్రాంతి తీసుకోటం మంచిదని...."

'అక్కర్లేదన్నాగా! నువ్వుపో నేను యిప్పుడే అటుబోయొస్తా..."

రామిరెడ్డి చెప్పేమాటల్ని కోటిరెడ్డి తాను నమ్ముతూన్నట్లు అగపడినప్పటికీ, రామిరెడ్డిముఖం పక్కకిపెట్టి, కళ్ళు కిందికిదించి ఆదోరకంగా మాట్లాడిన ధోరణిచూస్తే, అతని విషయం అంతా బాగుందని కోటిరెడ్డి విశ్వసించలేకపోయేడు. అయినా చేసేదేముంది? యేదో ఆలోచించుకొంటూ కోటిరెడ్డి వెళ్లిపోయేడు.

తలవని తలంపుగా తామిద్దరూ అలా, ఆ సమయంలో, కలిసి కొన్నందువల్ల రామిరెడ్డి మరింత బాధాకరమైన ఆలోచనలు రేకెత్తినాయి.

కోటిరెడ్డి ధనికుడు; తాను బీదవాడు... అందువల్లనే సీత తనని తిరస్కరించటం జరిగింది.... జీవితమంతా వొత్తిదగా, మోసం!!..... ఘోరం! ..... తానొక వెర్రివెంగళొప్ప...... అసలు తాను ఆమె నెందుకు లెక్కచెయ్యాలి? ....... సిగ్గు సిగ్గు!...... వొక్క స్త్రీకోసమా? ....నీచం.... తాను కమ్యూనిష్టుగాదా? తానలా ప్రవర్తించటం, అలా ఆలోచించటం మంచిదేనా? తగునా? వొక బాధ్యతగల కమ్యూనిష్టే, నలుగురికీ ఆదర్శప్రాయంగా వుండాల్సిన తానే, ఆరకంగా ప్రవర్తించటమంటే ప్రజలు నవ్వరా?.... సిగ్గు సిగ్గు!.... తనలాగే కోటిరెడ్డిగూడా వొక కామ్రేడ్. తాను అతన్ని గురించి అలానీచంగా అనుకోరాదు! వెధవది, వొక్క స్త్రీ కోసం యిలా.... కాని, కాని.... అది తప్పు.................

అరణ్యంలో ప్రయాణంచేసే బాటసారి బాట తప్పితే యెలా దిక్కూ మొక్కూ తెలవకుండా తిరుగుతాడో, రామిరెడ్డి ఆలోచనలు ఆవిధంగా గాడితప్పి తిరిగినాయి. బాగా పొద్దు యెక్కిన తర్వాత - తిరిగీ తిరిగీ - అతను యింటి కెళ్ళేడు.



# గుంట నక్క

కల్లోలిత సముద్ర కెరటాల్లాగ పీడిత ప్రజ
లెల్లరూ ఘోషిస్తూ
ఉవ్వెత్తుగ లేస్తారు
మువ్వన్నె మెకాలను ముట్టడించి తీరుతారు

- "ఫిలాష్టర్" లో డియోన్ (ఫ్లెచర్ అండ్ బ్యూమాంట్)



**ప**టేలు వొక కుర్చీలో కూచుని విశ్రాంతి తీసుకొంటున్నాడు. సత్తిరెడ్డి వొక మురికి చాప మీద కూర్చున్నాడు. ఆ చాప సత్తిరెడ్డిలాంటి "అతిధు"లకీ, "మర్యాదస్తు"లకీ ప్రత్యేకించబడింది.

ఆచారం ప్రకారం పటేలు నాంచారమ్మ గుడివద్ద కెళ్లి తిరిగి వచ్చివున్నాడు. (యెంత ముఖ్యమైన పనివున్నాసరే, రోజా వుదయంపూట నాంచారమ్మ గుడివద్దకెళ్లి, గుడి మండిగంమీద అటు పక్కా యిటు పక్కా నాలుగు పూలుపెట్టి ఆమెకి నమస్కారంచేసి రావటం పటేలు కొక ఆచారం).

పటేలు పొట్టిగా గూటంలాగా వుంటాడు; యెరుపు రంగు; పొడుగాంటి ముక్కు, చిన్న, యెర్రటి కండ్లు. అతను నైజాం నరకంయొక్క ప్రత్యేకమైన పుట్టుక. నిజం చెప్పాలంటే అతనా గ్రామానికొక చిన్న డిక్టేటర్. అతను యెంత చెబితే అంత అయితీరాలి.

అతని మాట వొక 'రాజముద్ర' అతని కర్రయే 'జడ్జీ'! అతడు డబ్బును - యెల్లప్పుడూ డబ్బును - జరిమానాలనీ, మామూళ్లనీ, అదనీ, యిదనీ గుంజుతూంటాడు. డబ్బు యివ్వలేకపోతే యేదో వొకవస్తువు యిచ్చితీరాల్సిందే. ఆవిధంగా గుంజిన కందులు. మిరపకాయలు మొదలైన వాటినెన్నింటినో అతను మారు బేరగాళ్లకి అమ్ముకుంటూ వుంటాడు.

అతని కొక పెద్ద పెంకుటిల్లు గ్రామమధ్యంలో వుంది. దానికి విశాలమైన ఆవరణవుంది. గ్రామస్తుల చెమటతో ఆ ఆవరణ చుట్టూ కంచెవేయబడింది.

రైతు, కూలీ, కంసాలీ, చాకలీ - ప్రతివాళ్లూ అతనేది చెబితే అది చెయ్యాలి; చేస్తున్నారుగూడాను. యెవడికన్నా 'మదం' యెక్కి తనవిధి నిర్వర్తించకపోతే పటేలు చేతిలోని పొన్నుకర్రగానీ, కొరడాగానీ, వాడికి బుద్ధినేర్పుతాయి.....

'యెందుకనోయ్, వాళ్లింకారాలేదూ కబురంపి చాలాసేపైనా?' నీరసంగా ముఖం చిట్లిస్తూ సత్తిరెడ్డిని పటేలు అడిగేడు.

'యింటికాడ వున్నరో లేరోమరి.'

'ఆఁ. రానియ్ లంజాకొడుకుల్ని - చెబుతాను. అసలీ పోయిన దున్నపోతు యెక్కడ చచ్చాడో.' అని పటేలు పళ్లునూరి, యేదో మరిచిపోయి గ్యాపకం చేసికొన్నట్లుగా యిలా అన్నాడు.

'యేమిటోయ్, నీవుద్దేశం?''

'నిజమేగదండీ మరీ! వెళ్లినవాడు ఎక్కడ జచ్చాడో మరి!''

'ఆ సంగతి యెవరిడిగారు నిన్ను? అదిగాదు. యిందాక మనం నీ అన్నకూతుర్నీ, రామిరెడ్డిగాడ్ని చూస్తిమే ఆ సంగతి నేను అడిగేది!

'హొహో, అదా? ఆ. అవునవును.' తలనాడిస్తూ, పళ్లు తెరచి చిరునవ్వు నవ్వుతూ సత్తిరెడ్డి అన్నాడు.

'చూడూ - వాడు గనక నీ అన్నకూతుర్ని పెళ్లిచేసికొంటే యింట్లో నీకింకా యేమన్నా నీ పెత్తనం వెలుగుతుందా?'

'నిజమండయ్యా'

'యేమిటి నీవుద్దేశం?'

'నిజమండయ్యా'

'యేం నిజమయ్యా గోంగూరా? యేం చెయ్యాలో చెప్పుమరి'

'నిజమేనండయ్యా'

'నిజమూ శింగినాదమా?'

'నిజమేనండయ్యా'

'అదుగోమళ్లీ!'

'మీరు చెప్పింది నిజమండయ్యా.'

'అదుగో అట్లా దోవకిరా.'

'మనం ఆ పెళ్లి చెడగొట్టాల్సినమాట నిజమే!'

'అదుగో అదీ! నువ్వుపోయి నీ అన్నకీ, బాబుకీ ఆ రామిరెడ్డీ గాడొక పక్కా మాదర్చోదనీ, వ్యభిచారనీ, తాగుబోతనీ.... చెప్పాలి! చెప్పటమేగాదూ - చెప్పి చెడగొట్టాలి !! తెల్సిందా?'

వారు రామిరెడ్డికీ, సీతకీ పెళ్లి జరిగితీరుతుందని వూహించారు అయితే, యే ఆధారమూలేకుండా మాత్రంగాదు. కాని సామెత జెప్పినట్లు- మనిషికొక ఆలోచనా, పుర్రెకొకబుద్దీనూ! రామిరెడ్డి నాయకత్వాన ప్రజలు మేల్కొనటం పటేలు చూస్తూనేవున్నాడు. అందువల్ల తన అధికారానికీ, సంపాదనకీ రామిరెడ్డి పరమశత్రువు. పెద్ద ఆటంకమూనని పటేలు పసిగట్టేడు; కనక యెంత జరిగినాసరే, అన్నివిధాలా తన స్థానాన్ని నిలబెట్టుకోవాలనా పటేలు నిశ్చయించుకొని వున్నాడు.

పోతే యిక సత్తిరెడ్డి తన తండ్రిపట్లా అన్నపట్లా 'శ్రేయోభిలాషి'గానూ 'సలహాదారు'గానూ నటించి, తండ్రి పేరవున్న యకరం పొలాన్నీ యేవిధంగానైనాసరే కొట్టేయ్యాలనే తలంపులో

వున్నాడు. అంతేగాదు. తాను పటేలుకి అనుకూలుడుగానూ, మిత్రుడుగానూ నటించటంలో యింకొక బలమైనకారణంగూడా వుంది. తానొకమారు బేరగాడు. బేరంలో తానుజేసే మోసాన్ని గురించి రామిరెడ్డి ప్రజలకి అదేపనిగా చెబుతూవున్నాడు! అందుచేత రామిరెడ్డిని యేలాగైనా కిందకు తొక్కేసెయ్యడం తనకూ లాభమే!!

అయితే యిక్కడొక సందేహం రావొచ్చు. గ్రామంలో ఐదారుగురు పార్టీ సభ్యులుండగా వొక్క రామిరెడ్డిమీదే యీ యిద్దరూ పగబట్టడం యేమిటని! రామిరెడ్డివాళ్లకి నాయకత్వం వహిస్తున్నాడు. వాళ్లకేం తెలుసు పర్రబూడిద!? అతను యెలాఅంటే వాళ్లూ అలాగే అంటున్నారు; కనక రామిరెడ్డిని తొక్కేస్తే వాళ్లు గొర్రెల్లాగా గమ్మున నోరుమూసుకొని వూరుకొంటారు!

'నిజమేనండయ్యా!' అని సత్తిరెడ్డి సాలోచనగా అన్నాడు, 'అదుగో అదీ!' అని పటేలు కుర్చీ చేతులమీద తన చేతుల్తో దడాలున కొట్టి అన్నాడు. 'మరీ మనూళ్లో అడుక్కుతినే వెధవకి గూడా మదమెక్కిందోయ్!'

తర్వాతయిద్దరూ యెవరిఆలోచనల్లో వారు మునిగిపోయేరు.

వారు కూచున్నది ఆయింటి వరండాలో, అప్పటికి పదకొండుగంటలయ్యింది. వారిద్దరూ మాటాడుకొనేప్పుడు యింట్లో పనిమనిషి - పొట్టిగా వికారంగా కనబడే వొక చాకలిమనిషి - వరండాలోకొచ్చి 'అమ్మగారు' అన్నానికి లేవమంటున్నారని 'అయ్యగారు' కి చెప్పింది. అతను పోదలచలేదు. యెందుకంటే వొకముఖ్యమైన విషయాన్ని వారు చర్చిస్తున్నారు. అసలు పటేలు చాలా వోపికగల మనిషి. చేతిలో పనివుంటే అతడు ఆకలిని లెక్కచెయ్యడు.

కాని యింట్లోంచి గుబాళించి కొడుతోన్న తిరుగమోత వాసనకి అతని నోరూరింది? ఐనా లోనికి వెళ్లదలచలేదు.

కొంతసేపైనాక వస్తానంటూ లేచి సత్తిరెడ్డి వెళ్లిపోయేడు.

## 2

వీరన్నా, పాపన్నలు బెదురు చూపుల్తో వొదిగి వొదిగి అక్కడికి వచ్చినపుడు, పటేలు యింకా వరండాలోనే వున్నాడు. నిద్రపోయే తోడేలుని కర్రతో పొడిచినప్పటికిమల్లే, వారిని చూడంగానే పటే[illegible]యిన ఆ కుర్చీలోంచి యెగిరి నుంచున్నాడు. తర్వాత కుర్చీకి ఆనిం[illegible]చిన [illegible]టాలున అందుకొని, ఆ యిద్దర్నీ నుంచున్న వాళ్లని నుంచున్న పాళాన మా[illegible] - చడీచప్పుడీచావబాదేడు. యే మాత్రమూ యెదురు చెప్పకుండా, యెదు[illegible]కుండా ఆ యిద్దరూ దెబ్బల్ని - కొయ్యబొమ్మల్లాగా - యీ శరీరాలు తమవి కానన్నట్లుగా - భరించి వూరుకొన్నారు. విపరీతమైన నెప్పితో, బాధతో మంటలుపుట్టే నెప్పితో - ఆ యిద్దరూ దెబ్బలు తగిలిన చోట చేతితో అణచి పట్టుకొన్నారు; అంతే.

"నే....నే....నేనా.... యిక్కడపటేల్ని..... లేక ...... వాడా?" పటేలు యెగరొప్పుతూ దిగరొప్పుతూ అరిచేడు.

"తమురు....తమురు....తమరే, దొరా...." అని ఆ యిద్దరూ తడబడ్డారు, వచ్చే వచ్చే యేడ్పుని దిగమింగుతూ.

"మరి? మరి?....మరెందుకనిరా.... లంజాకొడకల్లాలా, ఆ తొత్తుకొడుకు..... దగ్గరికిపోయి.... మీరు రాజీపడింది? వాడా గ్రామ పటేలు, నేనా? చెప్పండీ.... నాదగ్గిర కెందుకు రాలేదు?

పాపన్ననోరు మెదపలేదు? యెందుకంటే యీ వెధవతో మాట్టాడేదేమిటనే ద్వేషం అతనిలోపెరిగింది.

"మాదితప్పే, దొరా...." అని వీరన్న అన్నాడు. యెంత ఆపుకున్నా యేడ్పుఆగక, అతను వొక్కసారిగా బావురుమన్నాడు, దూరదేశంలో తల్లిదండ్రులనుంచి తప్పిపోయిన పిల్ల వాడిలాగా.

"లంజా...... లంజాకొడకల్లారా....... మిమ్మల్ని కట్టేసి ముక్కలు ముక్కలుగా నరకాల్రా! తుంపులు తుంపులుగా నరికి కాకులకీ గద్దలికీ పారెయ్యాల్రా?! హప్పుడుగాని నా కసితీరదు! గ్రామంలో పటేలుని - నేను-వుంటే మీకంతమదమంట్రా? హంతమదమా!? పోండి. పోయి, మీకు ఐదేసి రూపాయలు జులమానావేశాను - తీసుకురండి. హూ... అర్జెంటు! పొండి.... లంజాకొడకల్లాలా" అని వేసంగిలో పరుగెత్తిన కుక్కలాగా తెగరొప్పేడు పటేలు!

వారు కొంతదూరం పోయినాక, పటేలువారిని వెనక్కు పిలిచి, యిలా అడిగేడు.

"యేరా, వీరా, నీ యిల్లుని వాడికి యెందుకు అద్దె కిచ్చావ్! ఆ?"

"యెట్టా బతకాలి, దొరా? బీదోణ్ణి........"

"నోర్ముయ్!" అని పటేలు బిగ్గరగా అరవగానే, పాపన్న అమితవుద్రేకంతో 'నువ్‌నోర్ముయ్!" అని రంకెవేసేడు.

మాలిమిగా, కుక్కలాగాపడివుండే పాపన్న యిలా బొబ్బరించటంచూసి పటేలు దిమ్మరగొనిపోయేడు. కొద్దిసేపటికి తిప్పుకొని, "యేంట్రా నువ్ అన్నదీ?" అని పటేలు పాపన్న మీదమీదకి వస్తున్నాడు.

"గాడిదగుడ్డు!" అని పాపన్న గర్జించేడు. "దూరంగా వుండు. దగ్గిరకొచ్చావా నీ పుర్రెయెగిరిపోతది!"

"ఆ !!!" అని పటేలు గజగజవణికేడు.

"సంపు! సంపు!! నువ్వురాచ్చసుడివి. నీ రఖితం తాగుతా! మమ్ముల్ని యేడిపిచ్చుకోని తింటన్నావు.... నీ ప్రేణాలు తోడేస్తా...." అని వీరన్న గాండ్రిచేడు.

యేమిటిది?! పటేలు నిర్ఘాంతపోయేడు. తనజీవితంలో యెన్నడూ యిలాంటిది చూడలేదే?! యేమిటిది!!!?

"నువ్ శేసుకొనేదేందో శేసుకోపో......." అని వీరన్న అన్నాడు. అంతట ఆ యిద్దరూ విసురుగా వెళ్లిపోయేరు.



# అపనింద

కరవాలపు పదునుకన్న
క్రూరము అపనింద పదును
వేల వేలు విష జంతువులూ
చాలవు అపనింద కింద

- సింబులైన్ లో పిసానియో (షేక్స్‌పియర్)



**అ**ది సాయంత్రం. ఎడమ కాలు యీడ్చుకొంటూ, తన చేతికర్ర మీద పూనికగా వంగుతూ, కొండారెడ్డి గడపదాటి వచ్చి చూరుకింద వున్న చిన్న అరుగుమీద కూచుని, ముసలివానికి సహజమైన నిట్టూర్పుని - భారంగావుండి తన మీద తనకే జాలినీ, అసంతృప్తినీ సూచించే నిట్టూర్పుని - విడిచేడు. అతనికి ముందున్న నేలమీదవొక కోడీ దాని పిల్లలూ పురుగుల కోసమో, గింజలకోసమో కాళ్ళతో గీరుతున్నాయి. వాటికి కొంచెం దూరంలో తన తలని హుందాగా వొక పక్కకి కొంచెం వంచి - సగర్వంగా - అదో తరహా మిలిటరీ ఆఫీసరుమల్లే - వొక కోడిపుంజు నుంచొనివుంది. మధ్య మధ్య, యే గద్దనో దేన్నో చూసినపుడు, ఆ కోడిపుంజు 'గర్!' అంటూ కోడిపిల్లల్ని హెచ్చరిస్తోంది.

లోన, కోటమ్మ అన్నం వండుతోంది. అన్నపు కుండ పొయ్యిమీద వుండటంవల్ల, అన్నం వుడికేలోగా యేదన్నా పనిచేస్తూవుంటే మంచిదనుకొని, నిండా చిల్లులుపడిపోయిన వొక చీరని తీసుకొచ్చి, వెలుతురు కోసం తలుపు పక్కన కూచుని, ప్రశాంతంగా ఆ చీరని బాగుచేయ సాగిందామె. కొండారెడ్డి వొక చుట్ట ముట్టించి, మధ్య మధ్య కాండ్రించి గందరగోళంగా వూస్తూ, చుట్ట తాగసాగేడు.

కోటమ్మ అంతా బాగున్నట్లు పైకి అగపడినప్పటికీ ఆమె మనసు చికాకుగానే వుంది, అందుకు చాలా కారణాలున్నాయి కూడాను. ఇంట్లో వుప్పుంటే చింతపండు వుండదు; చింతపండు వుంటే మిరపగాయలుండవు! వొకటుంటే యింకొకటుండదు అదీ పరిస్థితి. అంతేగాక, సీత పెళ్ళి విషయం యింట్లో యెవరూ పట్టించుకొన్నట్లేలేదు. దానికి తోడు, రోజు రోజూ ధరలు పెరిగిపోతూవున్నాయి. అమ్మబోతే అడివి, కొనబోతే కొరివి, తినబోతే దుమ్ము!! యెక్కడ చూసినా, యెప్పుడు చూసినా, జీవితం - దానికి అంతంరాను! జీవితమంతా మురికి వాసనగా, నీచంగా, బాధాకరంగా వుంది. అసలన్నింటికీమించి, యీ ముసలి పీనుగ - కొండారెడ్డి - యే పొద్దూ దమ్మిడీ పనిలేక వృధాగా తింటూ,మూలుగుతూ ముక్కుతూ మంచంలో బడి గొణుగుతూండే యీ ముసలిపీడ - యింకా వదల్లేదు!!!

"దాని పేరేంది?" అని తన ఆలోచనలనుంచి వొక్క సారిగా మేల్కొంటూ కోటమ్మ అడిగింది.

"యేందది? దేని పేరు?" ముసలాడు అడిగేడు

"అదే. బ్లాకా - వాండ్ల బూడిదా?"

"బ్లాకు మారుకొట్టా?"

"ఆ అదే, అదే - వాండ్ల శిరుసు బగల! అదే. కార్లకీ, గెడియారాలకీ - ఆటికీ యీటికీ - ధరలు పెంచితే పెంచిగ్రనుగాని, తినే గింజలకీ, కట్టే బట్లలకి గూడ వాండ్ల దీపమే ఆర్పుకోవాలి?'
'

"యిశ్! పగోండ్లు యింటరు...."

"ఆ?"

"మెల్లిగా మాట్టాడమంటా. పగోండ్లు యింటరు!"

"యిని యేం చేస్తారూ? యిననియ్యి......"

"ఆ యెందుకొచ్చిన పీడంట? పులినోట్లు తల దూర్చట మెందుకు?"

"యేందయ్యా అదీ? వట వట వణుకుతవేంది? తల గొట్టి మొలవేస్తరా యేంది?

"నాకేంది భయం? అదిగాదు. యివాళ రేపో సచ్చే వోడికి నాకేంది భయం?

"వో యబ్బ, అంతగా అయితే వుండటానికి వుళ్లుండవేమోగాని, యెత్తక తినటానికి వుళ్లుండవా? యేమంట? బతకలేమంటవా ఆ మాత్తరం?"

"యాడకిబోయినా, ప్రెతిసోటా, యిదే తిండిలేక యేడుపు! అట్లాంటిది యాడకిబోయి బతుకుతవు? ముద్దేశే వోండ్లుండొద్దు!"

"నేను, మాటకన్నా. అసలొక సోటికిబోయేపనేంది? యీడనే పట్టినం; యీడనే పెరిగినం. సచ్చినా యీడనే సావాల; బతికినా యీడనే బతకాల! అసలొక సోటికిపోయి యెత్తక తినే పనేంది! నా వుసురుగొట్టి యీ దొంగముండ కొడుకులంతా సావరూ!?"

"అది పిచ్చిమాట, పిచ్చిమాట! మనం శాకిరిజేసి వాండ్ల కప్పగిచ్చి తిడతావుంటే వాండ్ల కయ్యి తగులుతయ్యా? వాండ్లకేం?వాండ్లు మనలిన దోసుకొని ఆయిగా కూచుని తింటన్నరు!'
'

"అయితే యేం శెయ్యాలి, మామా? కాలమెప్పుడూ యిట్టాగె వుంటదంటావా?"

ముసలాడు నోట్లోంచి చుట్టతీసి కాండ్రించి వూసి, ముఖం బిగిస్తూ ఆమె నిలా ప్రశ్నించేడు.

"అసలిదంతా యెందుకొచ్చిందంటవు?"

"యినాశనానికి!"

"ఆ అదుగట్టా శెప్పు!" అని ముసలాడు శత్రువు నెవర్నో బెదరించుతున్నట్లుగా తన చూపుడు వ్రేలిని గాలిలో వూగించేడు" లోకంలో పాపం కుప్ప తెప్పలుగా పెరిగింది ! యీ

పాపమంతా మొయ్యలేక భూదేయి మూలుగుతాంది.... అందుశాతే యీ కరువులూ, యీ రోగాలూవచ్చి మన్ని సంపేస్తుండయి''

"అట్టాగాదు. అదే నిజమైతే వున్నోండ్లూ లేనోండ్లూ అందరూ ఆటిలో బాదలుపడాలి. మరి అచ్చంగా లేనోండ్లే సస్తున్నరేంది? యేం, మామా?''

"ఆ. అదుగట్టా శెప్పు?'' ముసలాడు మరోసారి తన చూపుడు వ్రేలిని ఆడించి, ఆమెవంక - ముగ్గు ముందర కూచున్న భూత వైద్యుడిలాగా - భయంకరంగా చూసేడు. "యెందుకో తెలుసా? కలిగినోండ్లు చేసే పాపాల్ని లేనోండ్లు వూరికె సూత్తాకూచుంటే భగవంతుడికి లేనోండ్ల మీద కసి బుట్టింది. అందుశాతే అచ్చంగా లేనోండ్లే బాదలుపడేది!''

"అయితే మరి యేం శెయ్యాలంటవు?''

"నా కెట్టా తెలుసు? నాకు తెలవదు.... మరి.... నాకు తెలవదు ..... వీర వసంతరాయుడు పుడతాడనీ, పుట్టి మడుసులందర్నీ సంపేస్తాడనీ....''

'మరి యీర వసంతరాయుడు పటేండ్లనీ, పట్టవారీలనీ, నవాబుల్ని గూడా సంపుతాడా?'

ఆమె కంఠస్వరంలో యేదో క్రూరమైన ఆనందం ధ్వనిస్తోంది.

"ఆ అందర్నీ! అందర్నీ!!''

కాని ఆమె కొక సందేహం వచ్చింది.

"మరి యీర వసంతరాయుడు లేనోండ్లనిగూడా చంపుతడా?'' అని ముఖం ముడుచుకుని పోతుండగా, ఆమె అడిగింది.

వెంటనే ముసలాడు జవాబు యివ్వలేకపోయేడు; అతనికి గూడా అదే సందేహం లోనవుంది.

కొంతసేపు ఆలోచించాక అతను పెదవులు చప్పరిస్తూ, ధైర్యంగా యిలా అన్నాడు.

"వుహూ భగవంతుడు లేనోండ్లకి యే కీడూ శెయ్యడు!''

తలమీది నుంచి యేదో పెద్ద బరువు తొలగిపోయి నట్లుగా, కోటమ్మ నిట్టూర్పు విడిచింది.

## 2

వారలా వ్యవహారాలు మాటాడుకొంటుండగా సత్తిరెడ్డి వచ్చి తండ్రి మంచం మీద కూచున్నాడు.

సత్తిరెడ్డి పొట్టిగా, బొద్దుగా వుంటాడు; పిల్లికండ్లు, కోలముఖం, దానిలో మొన పైకి తిరిగిన చిన్న ముక్కు, రైతులందరికి మల్లేనే అతనికి అదివరకి పిలక వుండేది. కాని, తాను మారుబేరం మొదలెట్టినాక - ఆవూరూ యీ వూరూ, ఆ బస్తీ యీ బస్తీ తిరగటం అలవాటైనాక, ఆ పాడు పిలక(!) తీసివేయించి చక్కటి క్రాపింగు పెట్టేడు. పొడుగ్గా, పొదలాగా వుండే మీసాలు గూడా కత్తిరించబడినాయి.

"యెట్లా వున్నవు, నాన్నా? అని సత్తిరెడ్డి తండ్రిని ప్రశ్నించేడు.

ఆమాట వినగానే, లోకమంటే ముసలాడి హృదయంలో దాగివున్న ద్వేషం వొక్కసారిగా పొంగింది పైకి, డాక్టర్లనీ, పటేళ్లనీ, పట్వారీలనీ, జాగీర్దారులనీ, నవాబునీ, తర్వాత మొత్తం లోకాన్నీ, ఆపైని దేముడ్నీ - పాడు దేముడు ! చెడా మడా తిట్టేడు. పాడు దేముడు తనని యీ భగ్గంపాడు లోకాన్నుంచి యింకా విముక్తి చెయ్యలేదు !!!

భగవంతుడ్ని తిట్టినందుకు సత్తిరెడ్డి యేమీ అనుకోలేదు; కాని, పటేలు మొదలైనవార్ని తిట్టినందుకు సత్తిరెడ్డికి చాలా యిదిగావుంది, తండ్రి మాటలుఅతనికి మింగుడుపడ లేదు. ఐనా, తండ్రిని యే విషయంలోనైనా కాదని యెదురు చెప్పటమంటే తన ప్లానులన్నీ భగ్నంచేసుకోటం తప్ప యేమీకాదు. అందువల్ల, చాలా మెలకువతో తండ్రి దృష్టిని తాను వచ్చిన పనిమీదకి మరలించి, రామిరెడ్డి మీద బొక్కెడు అబద్ధాలు కక్కేడు.

తలవని తలంపుగా తాను విన్న యీ నమ్మశక్యంగాని బాధాకరమైన మాటలకి కొండారెడ్డి నివ్వెరగొనిపోయేడు, కొయ్యబొమ్మలాగా తన కెదురుగా కనబడుతూన్న యింటివంక తేరిచూసేడు. కోటమ్మ గూడా ఆశ్చర్యపడినప్పటికీ, చిక్కుల్తో గూడిన యీ పెళ్లి యిక జరగబోదని తన మనసులో తాను వుబ్బిపోయినప్పటికీ, తనకి కలిగిన వొక సందేహాన్ని ఆమె వెలిబుచ్చకుండా వుండలేకపోయింది.

"ఆ పిల్లగాడు అట్టాంటాడు గాదే!?" అని ఆమె తనలో తానా అన్నట్లు మెల్లగా సణిగింది, చీర అక్కడపడేసి, పొయ్యి వద్దకెళ్లి నిప్పు యెగదోస్తూ.

"అవునవును" అని ముసలాడు గూడా అన్నాడు. సత్తిరెడ్డికి యీ సంగతి అంటే యిలాంటి సందేహాలు రావచ్చుననే సంగతి ముందుగానే తెలుసు, అలాంటి సందేహాలకి యెలా జవాబు చెప్పాలో గూడా అతను ముందుగానే ఆలోచించుకొన్నాడు గూడాను, అందువల్ల తన లోపలి భావాలేమిటో బైటికి కనపడనీయకుండా, తను చెప్పినదాన్ని సమర్ధించుకొనసాగేడు తెలివి తేటలుగా.

"నిజమే. లోకులు అట్టాగానే అనుకొంటారు. నేను గూడా యిదివరకి అట్టాగనే అనుకున్నా. కాని చేసేదేంటి? అదంతా నేను కళ్లారా చూశాను. యిక నమ్మకుండా వుండేదెట్టాగు? గంగిని మీరు యెరగరా?"

యీ ఆఖరు ప్రశ్నకి యే సమాధానమూ రాలేదు. తమనిగురించే ఆమాటలు అతను చెబుతూన్నట్లుగా, కొండారెడ్డి, కోటమ్మ సిగ్గుపడి తలలు వంచుకొని మెదలకుండా వూరుకొన్నారు.

"మీరెరగరా?" అంటూ సత్తిరెడ్డి మళ్లీ అందుకొన్నాడు. యే సమాధానం రాకపోవటంచూసి, "గంగిఅంటే వీరన్న కోడలు. యిప్పుడు తెల్సిందా? వాండ్ల యింటోనే యీ కమ్యూనిష్టులు ఆఫీసు పెట్టారు. గంగీ, రామిరెడ్డీ ఆఫీసులో..... పండుకొని వుండగా.... నాకళ్లారా నేను చూశాను!"

యేదో రాయిపెట్టి తన తలని యెవరో ఠాక్కున కొట్టినట్లుగా కోటమ్మ తటాలున తలెత్తి, మరిదివంక దిమ్మరగొనిపోయి చూసింది. మళ్లీ మరుక్షణంలోనే తలవంచుకొన్నది.

సత్తిరెడ్డి చెబుతూనే వున్నాడు.

"అబద్ధమాడేంత అవుసరమేంటి నాకు? నాకేమన్నా వొరుగుతుందా? ఆ? సీత నీ కూతురు. నీ యిష్టంవచ్చినాడికి నువ్వు సీతని యిచ్చుకొంటావు. యిందులో నా పెత్తనమేముంది బోడిపెత్తనం!? ఆ. సీత నా అన్న కూతురు గాకపోయినట్లయితే, అసలు నేను యీ సంగతి చెప్పి వుండేవాణ్ణేగాదు! నాకేమవుసరమంట? ఆ? సరే, బాగా ఆలోచించుకో...."

వస్తానంటూ చెప్పి సత్తిరెడ్డి వెళ్లిపోయేడు.

కోటమ్మ ముసలాడివంక తిరిగింది, కాని, ఆమెవంక చూడటానికి తనకి సిగ్గువేస్తున్నదా అన్నట్లు అతను తన తలని పక్కకి తిప్పుకొన్నాడు, గరుకుపారిన తన చేతుల్ని నలుపుకొంటూ, కడుపులో యేదో తీవ్రమైన నెప్పి పుడుతున్నదా అన్నట్లు తలవంచి కడుపు పట్టుకొని మూలిగేడు బిగ్గరగా.

# 3

చీకటి పడినాక తలమీదనేదో వొకచిన్న కొయ్యతుంగ పెట్టుకొని, సీత యింటికొచ్చింది.

"యాడదది అమ్మాయ్?" అని, యింకా అరుగుమీదే కూచుని వున్న ముసలాడు అడిగేడు.

"నాగయ్య శేనుకాడిది, తాతా. ఆడ యెవరూలేరు. యెత్తుకొచ్చినా...." అని తానేదో ఘనకార్యం చేసినట్లుగా సీత చెప్పింది.

"ఛీ! ఆడిమొకం సూస్తేనే శని సుట్టుకొంటది! వాడు ధనికుడైనా నేను చిల్లిగవ్వంతయినా వాడ్ని లెక్కశెయ్యను. యెందులకా శని యీడకి తెచ్చినవు? దూరంగా పారెయ్యి దాన్ని...."

"అందులో యేముండది, మామా? కోటమ్మ తన కూతురికి వత్తాసుగా వచ్చింది, పొయిలోకి వాడుకోవచ్చు దాన్ని. సూడూ, అసలు అందులో తప్పేంది? మనమేమన్నా ఆ నాగయ్య నగలు దొంగిలించుకొచ్చినమా యేంది? ఆ? మనశేలో ఆ నాగయ్య గొడ్డుబడి మెయ్యనిరోజుండదు! అట్టాంటప్పుడు, దుంగతేవాలా, యింకాతేవాలా?"

"వొద్దులే, అమ్మా. తాత శెప్పిందే మంచిది. ఆ నాగయ్యకిమల్లే మనమెందుకు నీశకానికి వొడిగట్టాలీ?" దుంగని కిందపడేస్తూ, సీత అనింది.

"కోటమ్మ ఆ దుంగని తీసికెళ్లి, తన పెరటిదొడ్లో (అది చాలా చిన్నది) దాచింది.

తల్లి పక్కన, పొయ్యిదగ్గర, సీత కూచున్నపుడు సత్తిరెడ్డి చెప్పినమాటలు కూతురికి చెప్పాలా అక్కర్లేదా అనే సందిగ్ధావస్థలో పడింది తల్లి.

రామిరెడ్డిమీద కోటమ్మకీ యే ద్వేషమూలేదు. అతను తన విరోధి కుటుంబంలోవాడు అయినప్పటికి, కాని చుట్టూవున్న వాళ్లమాటలు ఆమెని కలవర పెట్టినాయి, రామిరెడ్డి సీతా యిద్దరూ వొకరంటేవొకరు ప్రేమతో వున్నారని ఆమె యెరిగినప్పటికీ తన సీతకు అంతకంటే మంచి సంబంధం రాదని తెలిసినప్పటికీ ఆమె మనసు వూగిసలాటగానే వుంది. పైగా యిందాక మరిది ఆమాటలు చెప్పే! తాను వొట్టి పిచ్చిముండ. లోకం సంగతి తనకేమీ తెలవదు. యేమోమరి, రామిరెడ్డి అలాంటి అలవసులవ మనిషేమో? మంచి సంబంధంగదా అని నమ్మి చూస్తాచూస్తా పదిహేనేళ్లు పదహారేళ్లు పెంచిన కన్న కూతురు గొంతు కోస్తామా? ఆ!

తల్లి అలా మధనలో వుంటే, కూతురు యింకొక రకంగావుంది.

రామిరెడ్డి తనని ప్రేమించాడు? తానూ అతన్ని ప్రేమించింది. అతను తనని పెళ్లిచేసికొనమని నోరుతెరచి అడిగాడు గూడాను. తానే పిచ్చిది! ఆ కలిగిన ఆనందంలో వొళ్లుమరచి పోయి అదనీ యిదనీ అంటే, అతనికి కష్టంగలిగి సర్రున వెళ్లిపోయేడు! రామిరెడ్డిని విడిచి తానుండలేదు, అతన్నిగాక మరొకర్ని తాను పెళ్లిచేసుకోలేదు!!

ఇదివరకల్లా సీత ఆ సంగతితల్లితో అనలేక సిగ్గుపడుతూ వచ్చింది. యిక లాభంలేదు. తీరాయింత పొర పొచ్చలువచ్చినాక యింకా సిగ్గుపడితే యెంత ప్రమాదం!?

అందువల్ల తల్లితో యివాళ ఆ సంగతి గట్టిగా చెప్పాలనుకొంది సీత.

"రావే, పిల్లా" అంటూ, కొంతసేపైనాక, కోటమ్మ తన కూతుర్ని పెరటిదొడ్లోకి తీసుకొని పోయింది.

"యేమ్మా, యెవర్ని చేసుకోవాలనుండది నీకు?" అని కోటమ్మ, ఆప్రశ్న అడుగుతున్నందుకు తనకుతానే సిగ్గుతో ఆశ్చర్యపడుతూ, కూతురు చేతుల్ని చేతుల్తో పట్టుకొంటూ, అదోరకమైన హీనస్వరంతో కూతుర్ని అడిగింది.

తల్లియొక్క వింత కంఠస్వరం తనని కలవర పెట్టినప్పటికీ, సీతలో లోన చాలా ఆనందించిందా ప్రశ్నకి, కాని స్త్రీకి సహజమైన సిగ్గువల్లా లోన కలిగిన ఆనందంవల్లా, ఆమె తన మనసులోవున్న భావాల్ని మాటలద్వారా వెలిబుచ్చలేక పోయింది.

బ్రహ్మానందం కలిగించే ఆ ప్రశ్నని తల్లి మళ్ళీ అడిగి నప్పుడు సీత సిగ్గుతో తలొంచుకుంటూ తాను రామిరెడ్డిని పెళ్లిచేసుకొంటానని మెల్లిగా అనింది. కూతురు మనస్సెలావుందో కోటమ్మ యెరుగును గనక ఆమె యే మాత్రమూ ఆ సమాధానానికి ఆందోళనపడలేదు, కాని, వొట్టి కుర్రతనపు వుద్రేకంతో తొందరపడే తన కూతుర్ని, యెవరేది చెప్పినా తేలికగా నమ్మి మోసపోయే స్వభావంగల తన కూతుర్ని, ప్రమాదకరమైన ఆ మార్గంనుంచి నయానా భయానా తప్పకుండా తప్పించాలి!

అందువల్ల

తియ్యగా,

మెత్తగా,

మృదువుగా,

సత్తిరెడ్డి తనకు చెప్పిన మాటల్ని, కూతురు చెవిలో వూదిందామె!

దవడమీద యెవరో లాగిపట్టి కొట్టినట్లుగా సీత దిమ్మర గొనిపోయింది!

తర్వాత ఆమె హృదయం, కొత్తగా వలలో చిక్కిన పక్షిలాగా రెపరెప కొట్టుకులాడింది.

కొంతసేపటికి ఆమె రాతి విగ్రహంలాగా బిగదీసుకొని పోయింది.

అదిగూడా యెక్కువ క్షణాలుండలేదు.

తనకు గల్గిన వొకేవొక బిడ్డ మరణించిందన్న వార్త విన్న తల్లిలాగా ఆమెగుండె పగిలినంత పనైంది.

కూతురు ముఖంలోని రేఖలు ముకుళించటం, వణకటం, విప్పారటం, చీకటి అయినప్పటికీ కోటమ్మ గమనిస్తోనే వుంది, ముళ్లకంపవేసి లాగినట్లుగా ఆమె హృదయం బాధపడింది! కాని యే భయంకరమైన భూతంయొక్క కరకు కోరల నుంచి తన కూతుర్ని రక్షిస్తున్నాన భావం ఆమెకి వూరట గల్గించింది కొంతవరకు. కూతురు ముఖాన్ని చూసి, తన యెత్తుగడ పారిందని ఆమె వూహించుకొన్నది. అందువల్ల వొక మాంచి ఆలోచన తట్టిందామెకి, కూతురు మనసు యింకా మార్చటానికి సత్తిరెడ్డిని మరింత వుపయోగిస్తే మరింత మంచిది. ఆ విధంగా ఆలోచిస్తూ ఆమె సీత ముఖంలోకి చూసింది.

సీతకళ్లు నీళ్లతో నిండి, కళ్లపైన యేదో గాజుపొర కమ్మినట్లున్నది.

## 4

ఆ మర్నాటి సాయంత్రం సత్తిరెడ్డి మళ్లీ వచ్చేడు.

నిన్న తన మాటల్ని నమ్మినట్లు అగపడని తన వదినె యివాళ తన అభిప్రాయంతో యేకీభవిస్తున్నట్లు తెలిసికొనగానే అతనికి ఆశ్చర్యం గలిగింది; కాని వలలో పక్షిని బంధించిన కిరాతకుని వలే అతడు లోలోన సంతోషించేడు. తన విజయానికి వుప్పొంగిపోతూ, కోటమ్మయొక్క వెర్రితనానికి వుత్సాహం చెందుతూ, సత్తిరెడ్డి - పోలీసు బందోబస్తు చుట్టూవున్న కాంగ్రెసు మంత్రిలాగా యిష్టమొచ్చినట్లు వుపన్యాసం ఆరంభించేడు.

"నిన్న నేను చెప్పదల్చుకొన్నదంతా చెప్పలేదు వొదినా. నేను వొట్టిమాటలు చెప్పానని అనుకొంటారని బయపడ్డాను చెప్పొద్దూ! అబ్బ వాడొట్టి వెధవ అసలు! నిజం.... మన సీతమ్మని నాడెట్టాంటి మాటలన్నాడో విన్నావా? యెట్టాంటి మాటలన్నాడని! తనకంటే అందగాడు లేడంట.... సీతకి తనవంటి మొగుడే దొరకడంట.... అసలు సీత వొట్టి గుడిశేటి మణిశంట... సీతని తానేగినిచేసుకొనకపోతే మీసం గొరిగించుకొని యీ వుళ్లొంచి వెళ్లిపోతాడంట.... అబ్బబ్బ చెప్పలేను! యెంతెంత మాటలన్నాడని!!"

సత్తిరెడ్డి చెప్పే వొక్కొక్కమాటా వొకబాణంలాగా ఆమెగుండెలో గుచ్చుకొంది? ఆమె అవమానంతో ఆపాదమస్తకం మండిపోసాగింది. భూకంపం వచ్చిందా అన్నట్లు, ప్రళయం పుట్టిందా అన్నట్లు, ఆమెతల గిర్రున తిరుగసాగింది.

"యింకా యెట్లాంటి మాటలన్నాడో తెలుసా, వదినా?" అని సత్తిరెడ్డి అడిగేడు.

"దేముడే నాకాపాటి తెలివియిచ్చి వుంటే, యీడొచ్చిన కూతుర్ని యింతకాలం యింటో బెట్టుకొని, యిట్టా అడ్డమైన లంజాకొడుకులసేతా అడ్డమైన కూతలూ కూయించుకొనేదాన్నేనా?' 'ని కోటమ్మ తీవ్రమైన అవమానభారంతో, ఆవేదనతో వొక్కసారి బావురుమని యేడుస్తూ పక్కింటివాళ్ళకి వినిపించకుండా వుండేందుకు నోట్లో చీరచెంగు కుక్కుకొన్నది.

ఆమె యేడ్పుచూసి సత్తిరెడ్డికి నిజంగా జాలి కలిగింది. తాను వొట్టి అబద్ధాలు చెబుతున్నాననీ, తన అబద్ధాలవల్లనే ఆమెకి అంత శోకం తెప్పించాననీ అతనికి తెలుసు. అందువల్ల బంగారు నగకోసం వొక పసిబిడ్డ గొంతు నులిమి చంపిన నేరస్తుడు ఆ పసిపాప అమాయకపు ముఖాన్ని చూడగానే యెలా బాధపడతాడో సత్తిరెడ్డి ఆవిధంగా ఆవేదన చెందేడు.

కాని అది పైకి పొక్కనీయటం ప్రమాదకరం.

అందువల్ల, యింకా అబద్ధాలు ఆడలేక, "యేమని చెప్పను, వదినా!?" అని పలికి, యిక అక్కడవుండలేక బైటకి వెళ్ళిపోయేడు.

# 5

చీకటిపడినాక, యెప్పటి మాదిరిగానే, సీత యింటి కొచ్చింది. నిన్న తనకి తగిలివ దెబ్బనుంచి ఆమె పూర్తిగా కోలుకొన్నది. రామిరెడ్డి వ్యభిచారి అనీ, అదనీ యిదనీ నమ్మే స్థితిలో ఆమె యిప్పుడులేదు.

తాను అతన్ని ప్రేమించింది.

అతనూ తనని ప్రేమించేడు.

తనని చేసుకొనమని నోరుదెరచి అడిగేడు.

చిన్నప్పటినుంచీ తాము కలిసి మెలిసి తిరిగేరు.

రామిరెడ్డి లేందే తాను బతకలేదు.

తాను యింకొకర్ని పెళ్ళియాడలేదు.

రామిరెడ్డి యెటువంటి మనిషన్నాగానీ, తాను అతన్నే పెండ్లిచేసికొంటుంది.

అంతే!!!

అసలీ విషయాలన్నీ అటుంచి, తన బాబాయి వొట్టి తెలివి తక్కువ మనిషి. యెవరేది చెప్పినా యిట్టే నమ్ముతాడు. రామిరెడ్డి అంటే సరిపడని శత్రువులెవరో, తన బాబాయికి

అదీయిదీ అని నూరిపోసి వుండొచ్చు. తన బాబాయి, తమ కుటుంబ క్షేమంకోసం ఆ మాటలు తన తల్లితో అని వుండొచ్చు. పాపం, తన పిచ్చితల్లి అవన్నీ బాబాయి లాగానే నమ్మి, తనతో చెప్పింది!అంతే!!

ఇంట్లో సీత కనపడగానే, వచ్చే వచ్చే యేడ్పుని ఆపుకొంటూ, ఆమెని పెరటి దొడ్లోకి తీసికెళ్లి, సత్తిరెడ్డి యిందాక చెప్పిన మాటలన్నీ ఆమెకి చెప్పింది కోటమ్మ.

"నామాట యినమ్మా, తల్లీ. నువ్వు శిన్నదానివి లోకంసంగతి నీకు బాగా తెలవదు. మేకవన్నె పులులుగూడా వుంటయ్యి లోకంలో...... నేను నీ తల్లిని..... యేతల్లిగూడా తన బిడ్డల మేలునే కోరతంది...... నేను నీమేలు గోరేదాన్ని...... నీతల్లిని...... నిన్ను కనిపెంచాను.... వొద్దు..... మనకాసంబంధం వొద్దు....." కోటమ్మ కన్నీళ్లు పెట్టుకొంటూ అన్నది.

సీత హృదయం అవమానంతో అగ్నిలాగా రగిలిపోతున్నాది! తనను ఎంతమాటలన్నాడు! యెంతమాటలన్నాడు!? ఛీ! యింక బతికేమి సార్ధకం?

"వొద్దులే అమ్మా.... ఆణ్ని నేను పెండ్లిచేసుకోను. అసలు నాకు పెండ్లేవొద్దు.... వొద్దు......' ' అని విపరీతమైన ద్వేషంతోనూ, అవమానంతోనూ, ఆవేదనతోనూ, పెదిమలు వణుకుతుండగా. తల దిమ్మున తిరుగుతుండగా, కన్నుల్లో క్రోధాగ్ని కన్నీళ్లు నిండుతూండగా, మంటలలో తన పసిపాప కాలిపోతుండగా చూడాల్సివచ్చిన తల్లిలాగా హృదయం ముక్కలు ముక్కలుగా తరుక్కొని పోతుండగా సీత తల్లితో అనింది.

లోన మంచంమీద కూచున్న ముసలాడు తనగుండెలో యేదో పోటు పుట్టినట్లుగా దీర్ఘంగా మూలిగి, దగ్గేడు.



# తటపటాయింపు

చలికాలం వచ్చింది, దానిమూలాన, చుఱ్ఱుచుఱ్ఱున యెండలుకాసే పగళ్లూ, వుక్కబోసి చంపుకుతినే రాత్రిళ్లూ, వాటితోపాటు మురికీ, బురదా పోయినాయి, ప్రకృతి బొద్దుగా, ప్రశాంతంగా, చురుకుగా తయారైంది. నిశ్శబ్దంగా, గంభీరంగా వుండే దీర్ఘ రాత్రులలోనూ, ప్రశాంతంగా, ప్రకాశవంతంగా, వెచ్చగావుండే పగళ్లతోనూ, "ప్రకృతిమాత" - బొద్దుగా, మృదువుగా, గంభీరంగా, సుందరంగా వుండే గర్భిణీ యువతిలాగా అగుపిస్తోంది.

కాని, ప్రజలకుమాత్రం చలికాలంవలన ప్రత్యేకంగా వొరిగిందేమీ లేదు. యెందుకంటే.

సంవత్సరం పొడుగూతా దోమలు బుజ్‌మంటూనే వున్నాయి.

అంటురోగాలు మృత్యునాట్యం తొక్కుతూనే వున్నాయి.

అర్ధాకలితో అలమటిస్తూ, వొళ్లు జలదరించే వికృతపు చూపుల్తో, డీలాపడిన దృష్టుల్తో, ప్రజలు పొద్దస్తమానం రెక్కలు ముక్కలు చేసుకొంటూనే వున్నారు.

అది వుదయం. చలిచలిగా వుంది. మసక మసకగా వుంది. నిశ్చలంగా వుంది.

ఆ సమయంలో వొగ మెగఫోను గొట్టం మనోహరంగా పాడుకోంది.

## లే !

లే లెమ్మురా తెలుగు బిడ్డా
లేచి
యేలుకో నీ తెలుగు గడ్డా ॥లే॥
తలమునుగు నప్పుల్లో
తొలినుండి పన్నుల్లో
బలముడిగి కళముడిగి
బక్క చిక్కేవా!?
కరువు రాక్షసి కోర
కెరయయ్యినావా!?
భరియింపజాలనీ
బాధనింకాయంటు ॥లే॥
వెట్టిచాకిరితోడ
తిట్టు తన్నులతోడ
మట్టిపాలాయె నీ

దెట్టి సంసారంబు !
తిరిపెమెత్తుకు నీవు
తిరిగె దెన్నాళ్లూ!?
నీరసించుచునుంటి
నరకానబడియుంటు ॥లే॥
కష్టించు నీ భూమి
దుష్టులా పాల్పడియె
తిష్టవేసిరె నీదు
కష్టార్జితముపైన!
చూడబోనింక నీ
పాడులోకమునంటు ॥లే॥
అక్కడను లక్షలూ
యిక్కడో భిక్షలూ!
అచ్చోట భోగాలు
యిచ్చోటో రోగాలు!
అటువైపు పన్నీరు
యిటువైపు కన్నీరు !
ఆ తట్టు పకపకలు
ఈ తట్టు మకమకలు !
సోమరికి మేడలూ
శ్రమికునికి గూడులూ!
మనిషిగా పుట్టావె
మనిషిగా మెట్టేవె !
లోకులకు యేహక్కొ
నీకు అదేహక్కు !
ప్రజలదీ భూమిరా
నిజమురా మనదెరా ! ॥లే॥

రివ్వున పయనించుతూ ఆ మేగఫోను మేల్కొల్పులు పాడుతోంది.

గూళ్లలోని పక్షులులేచి యేమిటేమిటో సంభాషించుకొంటున్నాయి. మధ్య మధ్య వొకకాకి తన రెక్కల్ని టపటప లాడిస్తూ కాకాయంటూ విషపు అరుపు అరుస్తూ, పైగా దూసుకుపోతూంది.

ప్రజలుగూడా మేల్కొన్నారు; కాని, మత్తుగా, నీరసంగా వుండటంవల్ల లేవటానికి తటపటాయిస్తూ, తమ పడకలమీదే పడుకునో కూచునో పాటను విన్నారు.

ముసలివాళ్ళ దగ్గులూ కాండ్రింపులూ, పిల్లల కేరు కేరులూ భంగం కలిగిస్తున్నప్పటికి ఆ పాట గాలిలో తేలియాడుతూ అన్ని యిళ్లల్లోనూ నిరాఘాటంగా ప్రవేశించింది.

అక్కడొక మనిషీ, యిక్కడొక మనిషీ అయిష్టంగానే తన పనికి తాను పోతున్నాడు.

సీత నిద్ర లేచింది; కళ్లు నులుముకొంది. ఆమె లేచేప్పటికి మెగఫోను యింకా పాడుతూనే వుంది. ఆ కంఠస్వరాన్ని - ఆ గొంతుని - తనని మోసగించిన ఆ గొంతుని - తియ్యని పెదిమలచేత దాచబడిన విషహృదయంగల ఆ గొంతుని - ఆమె యెరుగు ! ఆమె ముఖం చిట్లించింది ద్వేషంతో; అయినప్పటికీ, మధురంగా వున్న ఆ కంఠస్వరం ఆమె హృదయ తంత్రుల్ని మీటకుండా వదిలిపెట్టలేదు. ఓహ్! యెంత తియ్యనిపాట !

పాట ఆగిపోయినాక, రామిరెడ్డి వెళ్లిపోయి వుంటాడనుకొని, పొలం పోవటం కోసం సీత బైలుదేరింది.

కాని, రామిరెడ్డి యింకా అక్కడే వున్నాడు!

ఛీ, నీచుడు !

అతని పక్కన యింకా సైదులు, కోటిరెడ్డి మొదలగు యువకులు వున్నారు.

"సోదరీ సోదరులారా" మెగఫోను కేక బెట్టింది.

"అందరూ యేకమవ్వండి.. లెవీ ధాన్యం యివ్వటానికి నిరాకరించండి... నవాబు ప్రభుత్వం - మనల్ని అనేక పన్నుల్తో, వెట్టిచాకిరీతో రక్తం తాగే యీ భూస్వాముల ప్రభుత్వం మన మీద అక్రమంగా, అన్యాయంగా, రాక్షసంగా యీ లెవీ పద్ధతి రుద్దింది. బీద రైతులమైన మనం - రెయ్యింబగలు చెమటగార్చినా కలో గంజో గూడా దొరకని మనం - బీద రైతులం - యే విధంగా యీ లెవీ ధాన్య యివ్వగలం?"

"సత్తెం ! యెట్టా యిచ్చేది? వీధి మూల నుంచుని సీత అనుకొంది.

"మనకు పండిందా పండలేదా, మనం తింటున్నామా తినటం లేదా అని యీ నవాబు ప్రభుత్వం చూడదు. లెవీ ధాన్యం మాత్రం యివ్వాలట! ..."

"ఆ పిల్లగాడు శెప్పేదంతా సత్తెమేనే, పిల్లా." అని సుబ్బమ్మ తన పక్కనున్న కోటమ్మతో అంది కోటమ్మ మూతి ముడుచుకొంది.

"యీ విధానాన్ని మనం సహించగూడదు. మనం గట్టిగా నిలబడాలి! యేమి జరిగినాసరే, మన హక్కులకోసం మనం పోరాడాలి!..."

"వోరి నీ యేటుగూల! యెట్టాంట పోట్టాడేది? లెయీదాన్నెం యియ్యమంటే, వాండ్లు

సావబాదుతారయ్యా! వాండ్ల శేతుల్లో తుపాకి కట్టెలు అయ్యి యియ్యి వుండయ్యి. మన శేతుల్లో యేముండది పఱ్రబూడిద?... ప్రక్కనే పొలం పోతూన్న వొక రైతు కొంచెం బిగ్గరగానే తనలో తాను అనుకొన్నాడు.

"మరొక్క విషయం..." బొంగురుగొంతుతో మెగఫోను అరిచింది. "మన బస్తీల్లో రజాకార్లనే చెలరేగుతున్నట్లు, ప్రజానాయకుల్ని చుట్టుతున్నట్టూ, వారి యిళ్ళల్లో బడి దోచుకొంటున్నట్టూ, తెలుస్తున్నది. వాళ్ళు అంతటితోనే ఆగరు. ప్రజలందరి మీదా పడి వాళ్ళు దోచుకుంటారు.. స్త్రీలని చెరుస్తున్నారని గూడా తెలుస్తున్నది ... ప్రజల్ని అణచటం కోసమే వాళ్ళట్లా బయలుదేరారు... మనమంతా యేకమై యీ ద్రోహుల్ని యెదిరించి పోరాడాలి..."

సీత భయంకరంగా వణికిపోయింది.

"సంగం కుఱ్రోండ్లు" యింకా అక్కడే వున్నారు; వారిమధ్య రామిరెడ్డి వున్నాడు.

ముఖం చింపుకుంటూ, తలవంచుకొని, అక్కడ మనుషులనే వారు లేరన్నట్లు నిర్లక్ష్యంగా, సీత వారి పక్కగా దూసుకొని పోయింది.

రామిరెడ్డి హృదయం కళుక్కుమన్నది.

అసలిదంతా తన తప్పుగాదా? ఆమె అలాంటి వైఖరి తీసుకొనటానికి తాను కారకుడుగాదా? సీత పట్ల తాను చూపిన ప్రవర్తన, పార్టీ సిద్ధాంతాలకి ద్రోహం చేయడం వంటిది గాదా? అవును, అవునవును...కాని.....

అతనలా ఆలోచించుకొంటూండగానే, వీరన్న కల్లు గీయటం కోసం పోటూ అటుగా వచ్చేడు.

వీరన్న గూడా రామిరెడ్డిని లెక్కజేయకుండా, తానతన్ని చూడలేదన్నట్లో, అక్కడెవరూ లేదన్నట్లో, గబగబా పెద్ద అంగల్తో నడిచిపోతున్నాడు.

యేమిటిదంతా?

యేమి జరిగింది?

లోకమంతా తనకి వ్యతిరేకింగా సమ్మె గట్టిందా?

సీతపట్ల తాను అన్యాయంగా ప్రవర్తించిన మాట నిజమే. అందుకు తగిన కారణం గూడా వుంది.

కాని, తానేమీ ఆమెను తిట్టలేదే!?

యెత్తి పొడుపు మాటలు అనలేదే!?

మరెందుకు సీత అంత కరుకు వైఖరిని అవలంబించాలి? ఆమె సంగతలా వుంచి, యీ వీరన్నకి తానేమి అన్యాయం చేసేడు?

రామిరెడ్డి హృదయం దిగిపోయింది? వుబ్బసపు రోగి లాగా అతిభారంగా అతను గాలి బిల్చేడు. పక్కనే వున్న అతని మిత్రులు అతనివంక వింతగా చూసేరు.

"పార్టీ ఆఫీసు కెళ్లండి, నేనిప్పుడేవస్తా." అని చెప్పి, వీరన్న పోయిన వేపు రామిరెడ్డి నడిచి వెళ్ళుతూ ; వీరన్నని ఆగమంటూ అరుపులు బెట్టేడు. కాని, వీరన్న వొక్కసారిగూడా వెనక్కితిరిగి చూడలేదు. కొంతసేపటి తర్వాత - యేదో తోడేలు తనని చంపడానికి పరుగెత్తుకొస్తూన్నదన్నట్లుగా - వీరన్న, ముసలాడే అయినప్పటికీ, పరుగు లంకించుకున్నాడు; మరి కొంతసేపట్లో పక్కగొందిలోకి మాయమయ్యేడు.

దొంగని పట్టుకోటానికా అన్నట్లు, రామిరెడ్డి అతని వెనకాలే పరుగెత్తేడు. అటూయిటూ పోయేవారు యిది చూసి ఆశ్చర్యపడ్డారు.

రామిరెడ్డి యెలాగైతేనేం వీరన్నని పట్టుకొచ్చాడు. వీరన్న ముసలాడు ; మరి ముసలాడెంతదూరం పరిగెత్తగలడు?

'సంగతేంటి.. వీరన్నా?..' అని రామిరెడ్డి అడిగేడు. వీరన్న వెంటనే మాటాడలేకపోయేడు; ముసలివాడవడం వల్ల తెగరొప్పుతున్నాడు. యెందుకోమరి బెదురుచూపుల్తో దిక్కులన్నీ చూడసాగేడు.

అసలింతకీ జరిగిన సంగతిదీ :

మొన్న వుదయం కడుపుమంట పట్టలేక వీరన్నా, పాపన్నలు పటేల్ని ఆ మాటా యీమాటా అని వెళ్లిపోయినాక, పటేలు జాగీర్దారు వద్దకిపోయి కొంపమునిగిందంటూ గోడు బెట్టుకొన్నాడు. ఆ మీద జాగీర్దారు ఆ యిద్దర్నీ పిలిపించి, ఖాసించేత కొరడాతో చావబాదించి, వీపుమీద బండనెత్తి తన మేడముందు గంటసేపు నుంచోబెట్టించి మరీ వదిలేడు. ఆ పని నిన్న రాత్రి జరిగింది. అందువల్ల రామిరెడ్డి వాళ్లకి తెలియలేదు.

వీరన్న దొంగలాగా అన్ని వేపులకీ చూస్తూ, ఆ సంగతంతా చెప్పి, యిలా అన్నాడు.

"అందు గందుకే, దొరా, తమరుతో మాట్టాడాలంటే నాకు మా బయమేసింది... అసలు రాత్తిరే తము దగ్గిరకి వద్దామనుకొన్నం....కాని యింటికాడ ఆడోండ్లు వొంటిమీద దెబ్బలు సూసి కదలనిచ్చిర్రు గాదు... యిదుగో సూడండి వాతలు!" అని తన వంటిమీద నల్లగా కమిలివున్న కొరడా దెబ్బల్ని చూపి, తిరిగీ అందుకున్నాడు, "నాకూ తమర్ని కలుసుకోవాలనుండది... మరి బజార్లో యే సరిపడని ముండాకొడుకో సూసి మల్లీబోయి వాండ్లకి శెబితే యింకేమన్న వుండదా? అంతేదొరా...ఆఁ. మొన్న తమురికి శెపటానికే మరిశిపోయినా ... అందుట్లోనూ తము రాయాలగానీ, నిన్న గానీ నాకు యాడా అగుపిచ్చలా ... సంగం ఆఫీసు నా యింటోంచి యెల్లగొట్టమని ఆ యిద్దరు ముండా కొడుకులూ తెగ కొట్టిర్రు.... యేమి అనుకోబాకండి... సంగమంటే నాకూ పేమేవుండది...అయితే శేసేదేంది?...నేను బానిసనిదొరా... అట్ట నాల్రోజులు

వొదిగివుండాల ....తము రేమీ అనుకోబాకండి.....జనమంతా సంగమన్నప్పుడు.....వూ...యాలి గం(డ గొడ్డలి భుజానెట్టుకొస్తా! అందాక కాత్తి వొదిగుండాలి.... దొరా...మాటకంటనూ...అట్లాంటి సమియం యెప్పుడొసద్దంటరు? ఆ?''

"మనమంతా యేకమైనపుడు!.....చూడూ....యేమీ భయపడమాక...ఆ ఇల్లు అద్దెకి యిచ్చేశాననీ, తిరిగి తీసుకోటానికి వీల్లేదని చెప్పవాళ్ళతో. మేముగూడా యీ దుర్మార్గాన్ని గురించి ప్రజలందరికీ చెప్పుతాం.....'' ప్రజల వొత్తిడికి వాళ్ళే లొంగుతారు.

"అమ్మమ్మా! అట్టావొద్దండిదొరా, నామాటినండి. మరేమీ అనుకొబాకండి....సంగం యెవరిది? సంగం మాది; బీదోండ్లది! అయినా వాండ్లప్రభ అట్టా యెలుగుతాంది. యెలగనియ్యండి యెన్నా లెలుగుద్దొ! నామీద దయసూపండి ....ఆఫీసు యింకోసోట.....''

అందుకు వొప్పుకొనటం తప్పితే..... పౌరుషం అడ్డం వచ్చినప్పటికీ...యింకో మార్గం లేదు రామిరెడ్డికి. రోజులలావుంటే అతను మాత్రం యేం చేయగలడు? యేం చెయ్యాలి?

"సరే, అట్లాగే చేస్తాం. కాని, చెప్పేది విను. మనం యెంతకాలమైతే యిట్టా వాడు చెప్పినట్లు లొంగుతామో, యెంతకాలం వాడు ఆడింది ఆటగా, పాడింది పాటగా చెలామణీ అవుతుందో.... అంతకాలమూ మనకీ వెట్టి చాకిరే గతని గుర్తు పెట్టుకో!'' అని చెప్పి రామిరెడ్డి వూళ్లోకి బైలుదేరేడు.

వీధిలో అతనికి మమ్మూ యెదురయ్యేడు."అట్టా వుండావేమిటీ, బాబూ?'' అని మమ్మూ అడిగేడు, కొంచెం ముందుపోయిన మేకను వెనక్కి పిలుస్తూ.

"ఆ ఏమీ లేదు తాతా'' అన్నాడు రామిరెడ్డి మాట దాటేస్తూ.

"సరే. సూడు....యిందాకా దాంతో నువ్వు శెప్పే దేమ్టి? అదేది....దానిపేరేంటి?''

"మెగఫోను.''

"ఆ. దాంటో శెప్పేదేమిటి;''

"లెవీ ధాన్యం వసూలుని గురించి చెప్పాను''

'సత్తెం, బాబూ. మనం ధానీ మూలానా సస్తావుండాం. కానీ, దాని వల్ల లాభం యేమిటీ?'ముసలాడు తన నుదురు కొట్టుకొని నిట్టూర్చి యింకా యిలా అన్నాడు: "అంతా శెప్పేవాండ్లే; శేసేదెవుళ్లూ? బీదొండ్లా గోడుసూసే వాడూలేడు!''

"అది నిజమే, తాతా కాని, అంతా వొక్క రోజు లోనే, వొక్క నిమిషం లోనే జరగదు. ప్రజలంతా యేకంగావాలి. అంతవరకూ.....''

"యేకం? యింకా యేదన్నా శెప్పూగానీ, అమాటామాత్తరం చెప్పమాకా! యీ మూరఖపు ఝునం...''

"కాదు తాతా. నువ్వు అట్లా అనుకోగూడదు, ఐక్యత కోసం ప్రజలు తహతహలాడుతున్నారు. మరి మీబోటి పెద్దవాళ్లంతా ముందుకు రావాలి...."

"యేమిటీ మా మూసలీ సన్నాసుల్ వచ్చీ చేసేది? ఆ మా హయాం గడిశీ పోయింది. యివాళో రేపో సస్తాం.... మాకీ యెందుక్కా...."

"అదిగాదు, తాతా, నువ్వు అట్లా నిరుత్సాహ పడగూడదు. ప్రతి మనిషీ యేదో కొంత చేయగలడు. యెందుకంటే, ప్రతిమనిషీ..అంటే ధనికులు గూడానని గాదు...ప్రతి మనిషీ యీ నరకంలో బాధలు పడుతున్నాడు, కాని దీక్షతో పనిచేయందే యేమిజరగదు...."

"ఆ పని, పని! నేనూ యింత వయస్సు నుండి పని శేస్తానే వున్నా; వుంటే, వచ్చి సచ్చిందీ? ఆ, శింగినాదం! నామాట నమ్మ్...యీ మూరఖపు ఝునం కలిసి సావరు! అసలూ అంతా ఝూటా! నరమానవులా శేతాయేమీ గాదు... అంతా ఆ అల్లా యే సూడాలీ...అంతా అల్లాదయా.. ...అచ్చా అచ్చా....వస్తా...." అని మమ్మూ కొన్ని అడుగులు వేసి, మళ్లీ వెనక్కు తిరిగి, యేదో రహస్యం చెప్పటానికన్నట్లు, రామిరెడ్డిని పిలిచి యిలా అన్నాడుః

"యిష్! ననాబుని అదీ యిదీ, అట్టా యిట్టా అనమాకా! తప్పూ, తప్పూ! అసలే రోజుల్ బాగాలేవూ.. అయినా అసలూ నవాబూ యేంశేశాడూ? కిందావుండే యీ జాగీర్దార్లు, దేశముఖులూ, వాండ్లూ వీండ్లూ అంతా శేస్తావుంటే నవాబూ తప్పూ యేమీ వుందీ? ఆ? నవాబూ సాలా మంచీ రాజూ! అచ్చా అచ్చా......... వస్తా........" అని ముసలాడు వెళ్లిపోయేడు.

పరాకుగా కిందవంక చూస్తో, రామిరెడ్డి గూడా వెళ్లిపోయేడు.

## 2

ఆనాటి మధ్యాహ్నం పక్కయింట్లోంచి వినవస్తున్న సుబ్బమ్మ రోదనని కోటమ్మ విన్నది. అయితే, లెవీ మనుషులు వచ్చారన్న మాట!

అది విన్నాక కోటమ్మ తత్తరపడి, భయంతో గత్తరపడి పోయింది. శ్వాస సరిగా ఆడలేదు. ఆ గత్తర బిత్తరతో యింట్లో తనచుట్టూ పిచ్చిదానికి లాగా పిచ్చి చూపులు చూసి యింట్లో వున్నవారిని హడలుగొట్టేసింది.

వొక్క రంగారెడ్డి తప్ప, ఆ యింట్లోని వారంతా తమ తమ పనుల నుంచి యింతకు ముందే భోజనాలకి వచ్చేరు.

ఇంటిల్లపాదికీ మళ్లా పంట వచ్చే వరకూ యింట్లో నాలుగు బస్తాలు మాత్రమే జొన్నలు మొదలైనవి వున్నాయి లెవీ వాళ్లు చూశారంటే వాటిని యెత్తుకు పోతారు; వాటి నెక్కడన్నా కనబడకుండా దాయాలి. కాని, తానూ సీతా ఆడవాళ్లు ; తాము వాటిని వొక చక్కని చోటుకు తీసికెళ్లి దాయలేరు. మరి తన మామ...కొండారెడ్డి...తాను బతికినంత కాలమూ వుండే ఆ

ముసలి శనిపీడ!..వొర్తి ముసలాడు; కూచుంటే లెగలేడు, లేస్తే కూచోలేడు. యిక పిల్లలుంటే....వాళ్ల బొందా. ......వాళ్లేం చెయ్య గలరు? ఆందోళనతో చేతులు కొట్టుకొంటూ, మెల్లగా మూలుగుతూ, శాపనార్థాలు బెడుతూ , ఆమె యీ మూల నుంచి ఆ మూలకి పరుగెత్తింది.

ఆమె ఆఖరి కెలాగైతేనేం తన గందరగోళాన్ని, గడబిడనీ అణుచుకొంది; యేడ్పు గొంతు పెట్టి బస్తాల్ని దాయటంలో తనకి సహాయపడమని కూతుర్ని దీనంగా అడిగింది.

అంతట ఆ యిద్దరు వొక గోతాన్ని లాగటం మొదలెట్టి, గడప వరకూ దాన్ని లాగగలిగేరు, కానీ, పెంటపోగు వరకు దాన్ని తామిద్దరూ యెలా లాగగలరు? యిప్పటికే చాలా ఆలస్యమైంది; ఆ ముండాకొడుకులు యే క్షణంలోనైనా రావచ్చు. నీటిలో మునిగిపోయే మనిషి ఆశతో గడ్డిపరకను పట్టుకొన్నట్లుగా, కోటమ్మ గతిలేక సాయంకోసం ముసలాడివంక చూసింది; అందుకు జవాబుగా ముసలాడు మూలిగేడు బాధతో. తర్వాత, అన్నం తింటూన్న తన యిద్దరు కొడుకుల్ని....వాళ్లు పదేళ్ల లోపు వాళ్లు .....పిలిచింది. ఆ యిద్దరు పిల్లలూ యెంగిలి చేతులతోనే ఆమె వద్దకి పరుగెత్తేరు; అందరూ గలిసి ఆ గోతాన్ని లాగసాగేరు.

దాన్ని గడప మీదగా దొర్లిస్తుండగా, లెవీ వాళ్లు భూతాల్లాగా రానేవచ్చారు; వాళ్ల ముందు పొన్నుకర్రతో పటేలు వున్నాడు.

" హేయ్ ! యేంటి మీ రాగోతాన్ని యెందుకు లాగుతున్నారు?హాయ్?" అని పటేలు బోక్కురుమన్నాడు.

"మేము....అయ్యా...యిదుగో..యిల్లు అలకాలండీ..." అని కోటమ్మ నత్తులు కొట్టింది.

తనలో తానేదో గొణుక్కొంటూ, కొండారెడ్డి మర్యాద సూచకంగా మంచం దిగి కింద కూచున్నాడు.

బొద్దుగా, కూబి రకంగా కనపడే లెవీ ఆఫీసరు యింట్లో వున్న గోతాలన్నీ బయట వేయండని తన మనుషులకి చెప్పేడు.

"మీకు యెంతో మంచిచేస్తావున్నా, మీరు సర్కార్ని మోసంజెయ్యాలని యెత్తులేస్తన్నారు! ఆ? సరే, చూద్దాం ...." అని ఆఫీసరు కోటమ్మవంక తిరిగి అన్నాడు. "అయ్యా... దొరా.... మేము బానిచలమి... మీపాదాలకి మొక్కతా..." అని కోటమ్మ దేబిరించింది.

"నోర్ముయ్!" పటేలూ, లేవీ ఆఫీసరూ యిద్దరూ వొకేసారి అరిచేరు.

భయంతో సీత వొకమూల నక్కింది. పిల్లలు నోరు తెరిచిచూస్తూ నుంచున్నారు; యెండిపోతూన్న వారి యెంగిలి చేతులమీద ఈగలు బుయ్మని ముసురుతున్నాయి.

"యేమిటా దవురుజన్యం?" అని కొండారెడ్డి కొంచెం మర్యాదగానే అడిగేడు.

అతని మాటలకి కోటమ్మకి మండుకొచ్చింది. యెందుకంటే ముసలాడు తొందరపాటు మనిషి. ఆ మాటకి ఆఫీసరు యేదన్నా ప్రతిమాట అంటే - అంటాడుగూడాను ముసలాడు శివం

యెక్కిపోయి అదీ యిదీవాగితే పనంతా చెడిపోతుంది. తాను బతిమాలుతున్నదిగా, యీ ముసలాడు నోరు మూసుకొని వూరుకోరాదూ? ఆఫీసరు యీ ముసలాడిమాట లెక్కజేస్తాడూ బతిమాలి మనం అలాంటివాళ్లచేత పని చేయించు కోవాలి గాని, గొంతువుందని అరిస్తే వాళ్లకేం రోగం? పోయేదేదో తమదే పోతుంది!

"నీ దేందిమామా?" అని కోటమ్మ బతిమాలుకొంటున్నట్లు వినయంగా ఆఫీసరువంక, విషపూరితంగా తన మామ వంకా చూస్తూ అన్నది. "గమ్మున వూరకోలేవు? దొరగార్ని నేను అడగతండగా? మద్దెలో నీ దేంది?"

దాంతో ముసలాడు నోటికి తాళం వేసుకొని వూరు కున్నాడు.

"దయసూడండి, బాబూ, ఆయన ముసలాడు. పెద్దతనంతో మతిబోయి అట్టా" పటేల్ని ఆమె బతిమాలింది.

"యీ రోజుల్లో యే లంజాకొడుక్కీ సర్కారంటే లక్ష్యంలేదు." అని వాపోయాడు ఆఫీసరు.

లెవీవాళ్ళు యింట్లో దూరి గోతాల్ని బయటికి లాగ సాగేరు.

తన ప్రయత్నాలన్నీ వృధా అయిపోయాయని గ్రహించి, యిక లాభంలేక తెగించి, వాళ్ల గోతాల్ని లాక్కుపోటానికి వీల్లేకుండా, కోటమ్మ గడప మీద అడ్డంగా పడుకొని, " ముందు నన్ను సంపి ఆ మోయిన గోతాలెత్తుక పోండి!" అని మొరకాయించి అరిచింది.

"మన మనుషులు చాలరు, కూలోండ్లకు కబురంపవయ్యా" అని ఆఫీసరు అన్నాడు.

"వాళ్లు మన మాట వింటారండీ? వాళ్ల కెంత మదమెక్కింది లంజాకొడుకులకి!' అని పటేలు మొత్తుకొన్నాడు.

ఇంతలో రామిరెడ్డి వచ్చేడు. అతని వెంట కోటిరెడ్డి మొదలైన వారున్నారు.

"యేమిటీ నిరంకుశత్వం?" కోపం అణుచుకొంటూ, ఆఫీసర్ని రామిరెడ్డి అడిగేడు.

ఆఫీసరు పటేలు వంక చూసేడు.

"నీకేం పని యిక్కడ? అసలు నువెవ్వరవు యిక్కడికి రాటానికి!" అని పటేలు అరిచేడు.

**"యేందోయి మాలావు కుయి కయి అంటుండవూ!?" అంటూ సైదులు పటేలు మీదకి వెళ్లబోతుంటే, రామిరెడ్డి అతన్ని వెనక్కి లాగేడు.**

**" యేంది వీండ్లకి వట వట వణికేది? పోతే నాలుగు నెల్లు జేలుకి పోయివస్తం: అంతేగా?" అని రామిరెడ్డితో అన్నాడు సైదులు మండిపడుతూ.**

ఇక వూరుకొంటే వ్యవహారం ముదిరి పోయి, వొక్క గోతమన్నా తమకి మిగలకుండా

యీ లెవీ వాళ్లు యెత్తుక పోతారనే భయంతో, కోటమ్మ దడాలున లేచి యేడ్పు గొంతుతో రామిరెడ్డితో ఇలా అంది:

"యేందిది రామిరెడ్డి? మిమ్ముల్నేమన్నా మేము రమ్మని పిలిసినామా యేంది?"

ములుకుల్లాంటి ఆమె మాటలకు రామిరెడ్డి తీవ్రంగా నొచ్చుకున్నాడు. ఛీ! అసలు యిలాంటి చోటికి తామెందుకు రావాలి?

"పదండ్రా పోదాం!" అని రామిరెడ్డి తన మిత్రుల్తో చెప్పి పటేలు వంకా ఆఫీసరు వంకా మింగేట్లు చూచి, విసా విసా వెళ్లిపోయేడు తన మిత్రుల్తో గలిసి.

పటేలూ, ఆఫీసరు అతని వెనకాల యేండ్రింపుగా నవ్వేరు:

"వోహోహో! ప్రజాసేవకులు!" అని లెవీ మనుష్యుల్లో వొక రన్నారు.

"మంచి సమాధానం చెప్పావ్ పో! బలే, భేష్!" అని పటేలు కోటమ్మతో అన్నాడు.

"యీ వెధవలకి సర్కారంటే లెక్కలేదు!" అని ఆఫీసరు వాపోయాడు.

రామిరెడ్డి మొదలైనవాళ్లు వెళ్లి పోగానే, నెత్తి మీద వొక గడ్డి మోపుతో పొలంనించి.... రంగారెడ్డి భోజనం కోసం గామాలు... వచ్చేడు. సంగతంతా కనిపెట్టి, ధాన్యానికి బదులు మేకని యిస్తాననీ, ధాన్యం వదలి పెట్టాల్సిందనీ బతిమాలాడేడు; ధాన్యం మంతా పట్టుకుపోతే తిండికి గింజలుండవు సరిగదా, తీసుకొని పోయిన ధాన్యానికి డబ్బు యివ్వరు; యిమ్మని అడిగితే దెబ్బలు; జుల్మానా

"యేంది, నా మేకనిస్తవా?" అని యింతవరకూ నోరు మెదపని సీత తనుకూచున్న మూలనుంచి కీచుమనింది.

పిల్లదాని మేకనిస్తవంటరా? శిగ్గూ శెరం లేదు?" ముసలాడు తన మౌనవ్రతం మానేసి కేకబెట్టాడు.

"నన్నేం సావమంటరా మరి? ఆ?" అని రంగారెడ్డి యేడ్పు గొంతుతో అన్నాడు.

"యేమిటీ వెధవ ఫార్సు?" అని ఆఫీసరు రంగారెడ్డిని వొక పక్కకి తోసేడు.

ఆ సమయంలో ఖాసిం వచ్చేడు తన కొరడాతోనూ, కుక్కపిల్లతోనూ.

అతన్ని చూడగానే, అరణ్య మధ్యంలో పెద్దపులి హఠాత్తుగా యెదురైన మనిషిలాగా, విపరీతమైన భయంతో సీత మూలలో యింకా వొదిగి వొదిగి కూచుని వూపిరి బిగబట్టటానికి ప్రయత్నించింది.

సంగతి సందర్భమంతా ఖాసిం వెంటనే గ్రహించి వేసేడు. అయితే వెధవ హిందూ కుక్కలకి నవాబు సర్కార్ని యెదిరించేంత అహంకారం వొచ్చిందన్నమాట ! !?

ఖాసిం గడపమీదున్న కోటమ్మని వొక్కతన్నుతో దూరంగాపడేసి యిలాఘుయ్యిమన్నాడు:

"సువ్వర్!''

ఇదంతా చూడగా కొండారెడ్డికి వుద్రేకమాగలేదు; యేమాత్రమూ యిక వూరుకోలేకపోయేడు; అతని దేహమంతా ద్వేషంతో కంపించింది. జంతువుకి సహజమైన భయానకమైన క్రోధాగ్ని నిలువెల్లా మండిపడుతూ, ముసలాడు యిలా బొబ్బరించేడు.

"వోరే లుచ్చా! ఆడమనిషిని కాలితో తంతావా? నీ కళ్లు పోతయ్యి... నాకు కాళ్ళేగనక వుంటే నిన్ను కట్టెపుల్లని యిరిశినట్టు యిరిశేవాడ్ని. నువ్వు నా గుప్పెట్లోకి గూడారావు....''

అని ముసలాడు బూతులు గూడా తిట్టేవాడే; కాని ఖాసిం తండ్రి మమ్మూ తన ముఖ్య స్నేహితుడు. అందువల్ల అతని వల్ల ఖాసింని తిట్టకుండా వూరుకొన్నాడు.

ఆ మాటలు విన్నాక ఖాసిం తన కొరడాతో రివ్వున లోనికి పరుగెత్తి, కొండారెడ్డిని బాదసాగేడు.

కొండారెడ్డి లేవలేకపోయినాడు యెంత ప్రయత్నించినా; అందువల్ల ఖాసిం కాలు దొరుకుతుందేమోనని ప్రయత్నించేడు. అది నిష్ఫలమైంది: తన కాలు ముసలాడికి చిక్కకుండా జాగ్రత్తపడ్డాడు. లేకపోతే ముసలాడి చేతికి చిక్కితే తుంపులు తుంపులు అయ్యేవాడే ఆ రోజున!

"బద్మాష్! .... లుచ్చా.... సువ్వర్....'' యెవరిదో కంఠస్వరం గడప మీద గర్జించింది.

ఖాసిం గిర్రున తల యిటుతిప్పి చూసేడు. గడప మీద తన తండ్రి ... మమ్మూ .... నిల్చునివున్నాడు!!!

మృత్యువులాగా అతిభయంకరంగా తనవంక చూస్తున్నాడు!

ఇంటికిపోతూ, యీ అరుపులన్నీ విని, మమ్మూ పడుతూ లేస్తూ అక్కడికి పరుగెత్తుకొచ్చేడు

"కళ్లు లేవంటరా మాదర్చోద్!?'' అని మమ్మూ యింట్లోకిపోయి, ఖాసిం చేతిలోని కొరడా లాక్కుని తుంపులు తుంపులుగా విరిచేడు.

"నువ్వా - సువ్వర్ - మహ్మదీయా కులంలో శెడబుట్టావ్‌రా... కళ్లు.... బద్మాష్... లుచ్చా...'' అని మమ్మూ రొప్పుతూ తిట్టేడు.

తప్పుచేస్తుండగా చూడబడిన కుక్కలాగా, ఖాసిం మెల్లగా బయటికి జారుకున్నాడు.

యింట్లోకి వచ్చిన అతని కుక్కపిల్ల మమ్మూని గుర్తించి ఆనందంతో తోకనాడించి బయటికి గెంతి తన యజమాని వెంటపోయింది.

యేమి చెయ్యాలో తోచక సందిగ్ధావస్థలో పడి యింకా ముందుకి పోవటానికి దమ్ములులేక, లెవీవాళ్లతో పటేలు యిలా అన్నాడు:

"పోదాంపదండి. మళ్లీరావచ్చు.''

మమ్మూ వాళ్లవంక ఛురఛురా చూసేడు.

వాళ్లు యింకోయింటికి వెళ్లేరు.

ఇంకా కోపోద్రిక్తతలోవున్న మమ్మూ, తన కోపాన్ని కక్కటానికి యేమీ కనపడక, తాను విరిచేసిన కొరడా తుంపుల్ని యేరి పొయ్యిలోకి విసిరేడు; తర్వాత పిచ్చివాడికి మల్లే తనచుట్టూ కొంతసేపు చూసి, ఆ తర్వాత కొండారెడ్డి మంచంమీద కూచుని రొప్పినాడు.

అతని మేక అరుస్తూ యింట్లోకొచ్చి నిలబడి, మెదలకుండా బొమ్మల్లాగావున్న మనుషుల వంక వింతపడుతూ తేరి చూచింది.

# 3

అన్ని యిళ్లవద్దా పరిస్థితులు అలాలేవు - కమ్యూనిస్టు పార్టీ యిచ్చిన పిలుపు పూరికినే పోలేదు.

లెవీవాళ్లూ, పటేలు సరాసరి కుంటిరైతు - సోమిరెడ్డి - యింటికెళ్ళేరు. సోమిరెడ్డి మొదట్లో తటపటాయించేడు. కాని అతని భార్య లావుగా, భీకరంగా, భళ్ళమ్మలాగా వుండే మనిషి వాకిటి కడ్డంగానుంచుని "నా యింట్లోకి అడుగుపెట్టారా మీ మర్యాద దక్కదు!" అని నిలబడే సరికి అతనికి యెక్కడలేని ధైర్యం వచ్చింది.

కుంటుకుంటూ వచ్చి అతను లెవీవాళ్ల ముఖంలోకి చూస్తూ, "అంతే!" అన్నాడు.

పటేలు అతన్ని పడదోయబోయేసరికి, "నాయాల! నేను కుంటోణ్ణని సూస్తుండవేమో, నా వొంటిమీన దెబ్బబడిందా నీ పుర్రె యెగిరిపోద్ది!" అని కుంటిరైతు కేకబెట్టేడు.

లెవీవాళ్లు తెల్లబోయి చూస్తుండగానే రామిరెడ్డీ వాళ్ళూ వచ్చేరు; వస్తూనే వాళ్లు యీ కుంటిరైతు అన్న మాటలు విన్నారు. రామిరెడ్డికి ఆశ్చర్యమేసింది. సంగం పని మానుకోమని తనకి సలహా యిచ్చిన యీ కుంటిరైతు యెందువల్ల పటేల్ని యెదిరించి నిలవగలిగాడు!? ఆ?

రామిరెడ్డిని చూడంగానే కుంటిరైతుకి యింకా వుషారు హెచ్చింది.

"యేయ్, యిక పదండి. రెయ్యింబగులు తినీ తినకా శాకిరీ జేసేది మేమూనూ, లెయోగియో అని వుండదికాత్తా దొబ్బుకుపోయేది మీర్లూనా? యిక్కడ మీ యబ్బగాడి సొమ్మేమి దాసబెట్టలా! పదండి, పదండి...." అని కుంటి రైతు లెవీవాళ్లమీద రంకెలు వేసేడు.

కొంతసేపు కొయ్యబొమ్మల్లాగా నుంచుని, లెవీవాళ్లు తోకముడిచేరు.



# నాంచారమ్మ తిరుణాల

భూతాలని ప్రేతాలనీ
పాతళ్లనీ పాదులనీ
వెలవటమని కొలవటమని
కలిమాయని కనుమాయని
వింతపడుతూ వణికిపోతూ
యింతకేదో ప్రళయముందని
యెంతోకాలమునుండి బీదలు
యెంతగానూ విశ్వసించిరొ
చూడు, చూడుము!

- వీనస్ అండ్ అడోనిస్‌లో అడోనిస్ (షేక్స్‌పియర్)



అది శుక్రవారం.

ఆనాడే నాంచారమ్మ వీరోచితంగా ప్రాణత్యాగం చేసింది.

నాంచారమ్మ గుడి పెద్దది కాకపోయినప్పటికీ దాని రెండువేపులా వున్న కొండలూ, మూడో వేపున వున్న నదీ యెదురుగా, కొంచెం దూరాన, గంభీరంగా నిలబడివున్న అరణ్యమూ ఆ గుడికి అదొక ఆకర్షణా, అదొక తీయని భయమూ చేకూర్చినాయి.

మంగళవారంనాడే రకరకాల దుకాణాలకీ పందిళ్లు వేయబడినాయి. శుక్రవారం తెల్లారుజామున, తొలికోడి కూసేవేళ కనులపండువుగా పూలతో అలంకరించబడి గంభీరంగా, ఘనంగా కనబడుతూన్న ప్రభలుకట్టిన బండ్లు గుడివద్దకి రాసాగేయి; వచ్చినవి గుడిచుట్టూ ప్రదక్షిణం తిరుగుతున్నాయి.

రకరకాల రంగుల ముతకబట్టలు ధరించిన యాత్రికుల్తో క్రిక్కిరిసిపోయిన ఆ స్థలం - సందడి సందడిగా వుండే పూలతోట వొకటి అక్కడ వెలిసిందా అన్నట్లు అగపడుతోంది.

నదిలో స్నానంచేస్తూనో, స్నానం చేసినాక తడిబట్టల్తో వణికిపోతూ గుడిచుట్టూ తిరిగి "దిబ్బెం"లో కానియో అర్ధణో పడేస్తూ నాంచారమ్మకి మొక్కుబడులు చెల్లిస్తూనో, జనమంతా హడావిడిగా పని తొందరలో మునిగిపోయి వున్నారు. మరికొంతమంది నమస్కారాలుపెడుతూ దేవతకి సాంబ్రాణి వేస్తున్నారు.

బిడ్డల్ని కలిగివుండే భాగ్యంలేని గొడ్రాళ్లు కొందరు సంతానలబ్ధికోసం గుడిచుట్టూ నేలమీద దొర్లుతున్నారు. కొంతమంది రైతులు, కుంకుమా పసుపూ జల్లిన తమ యెద్దుల్ని

కోడెదూడల్నీ గుడిచుట్టూ తిప్పుతూ హరహర అని కేకలు బెట్టుతున్నారు. మరి ఆ యెద్దులూ కోడెలూ, తమ మెడల్లోని గంటలు గణగణమంటూండగా, యీ తిరుణాల గందరగోళ ధ్వనికి తాము అలవాటుపడకపోయినప్పటికీ యెవర్నీ పొడవకుండా, యేదో ప్రాముఖ్యత సూచించే దృష్టుల్తో, గంభీరంగా నడుస్తూవున్నాయి.

ఈ సంవత్సరం ఆడవాళ్ళే యెక్కువమంది వచ్చినట్లున్నారు; యెక్కడజూసినా వాళ్ళే!

ఇంతకుముందు యిక్కడ జరిగిన తిరుణాళ్ల కంటే ఈయేటి తిరుణాలకొక ప్రత్యేకత వుంది. దాదాపు నలభైమంది కమ్యూనిష్టు వలంటీర్లు యెర్రజెండాలు తగిలించిన పొడుగాంటి కర్రలు చేతుల్తో పట్టుకొని, యాత్రికులకి అన్ని విధాలుగానూ సహాయపడుతున్నారు యిక్కడొక ముసలాడు జారుడుగావున్న నదివొడ్డుమీద జారిపడ్డాడు; అక్కడొక స్త్రీ తన బిడ్డ తప్పిపోయిందని బావురుమన్నది; కాని, వలంటీర్లు అక్కడా యిక్కడాగూడా సహాయం యివ్వటంకోసం పక్షుల్లాగా యెగిరి వాలుతున్నట్లగుపిస్తూ తయారౌతున్నారు.

రామిరెడ్డి ఆ వలంటీరు దళాల నాయకుడు. తాలూకా ఆర్గనైజరైన శ్యామసుందరరావు గూడా అక్కడవున్నాడు; వలంటీర్లకి అవుసరమైన సలహాలు యిస్తున్నాడు.

ఆ రోజున రామిరెడ్డికి విశ్రాంతే లేదు, చాలా హడావుడిగా వున్నాడు, నవ్వుముఖమే లేదు, కదిలిస్తే కస్సుమంటున్నాడు. అటూ యిటూ, అక్కడికీ యిక్కడికీ, పరుగెత్తుతూ అతను పెద్ద గొంతుతో అదీ యిదీ అరుస్తున్నాడు. యీ గొడవలో పడి అన్నం తినటమే మరిచిపోయేడు, యే కోటిరెడ్డో యెవరో అన్నానికి పొమ్మని చెప్పినపుడు వూరికినే తలవూపి, వొకటో అరో పండ్లుతిని, కాసిన్నీళ్లు తాగేడు. అంతేగాని, రాత్రి పన్నెండు అయ్యేవరకూ యింటికి పోలేదు.

యెర్రజెండాలు గాలిలో రెపరెపలాడుతూ పెద్ద జపాపుష్పాలా అన్నట్లగుపిస్తున్నాయి. ఆ యెర్రజెండాలవంకచూస్తూ వొక ముసలమ్మ అటూ యిటూ దిక్కులుచూస్తూన్న తన మనుమరాలితో యిలా అంది.

"యిక బయంలేదె పిల్లా. మనజోలికి మూటలు కత్తిరించేవోండ్లెవుళ్ళూరారు! ఆ సంగం పిల్లగాళ్లని నేను యెరుగుదును...?

## 2

పసుపూ, కుంకుమా, చీరా తీసుకొచ్చి ప్రతి యేటా వుత్సవసమయంలో నాంచారమ్మ దేవతకి కట్టబెట్టించడం పటేలు యొక్క ఆచారం. ఆ గుడి ధర్మకర్తగూడా అతనే.

అందువల్ల ఆ రోజు పటేలు యింటిముంగిట వొక సంతలాగా గలిబిలిగా, వుషారుగా వుంది. తాగిన చాకళ్లూ మంగళ్ళూ, సన్నాయిలూ డోళ్ళూ మొదలైనవి గలిబిలిని యింకా యెక్కువ చేస్తున్నాయి, బుర్రమీసాల గ్రామపెద్దలు తెల్లటి లావాంటి తలగుడ్డలు ధరించి, చేతులు ముందో వెనకో కట్టుకొని, అదో తరహా చూపుల్తో ఆ యింటిముందు నుంచున్నారు; తమ చుట్టూవున్న రణగొణధ్వనిని వాళ్లు విననట్టే కనిపిస్తున్నారు.

వొంటినిండా దుమ్ముకొట్టుకొన్న బక్కచిక్కిన బజారు కుక్కలు, యీ యింటి వద్ద వున్న గంద్రగోళాన్ని గమనించి యిదేదో పెళ్ళి గామాలునని, యిన్ని యెంగిలి మెతుకులు దొరక్కపోతాయా అనే ఆశతో వచ్చి అక్కడచేరినాయి; కాని మనుషుల్లాగానే, వాటిల్లో వాటికి మతులు కుదరక దానికాడో దీనికాడో వాదులు వచ్చందాలు ఆడుకొని, పెద్ద పెద్దగా మొరుగుతూ, పళ్లన్నీ తెరచి వొకదానితో వొకటి పోట్లాడుకుంటూ, ఆ రణగొణధ్వనిని యింకా యెక్కువచేస్తూ, మనుషులచేత నానాతిట్లు తింటున్నాయి.

అక్కడకొచ్చిన వారిలో దాదాపు అంతా తాగి వున్నారు; అందులోనూ పాపన్నా, వీరన్నలు మస్తుగా తాగి వున్నారు.

అంతేగాదు,

"వందయితే యేమిరా, రొం
డొందలైతె యేమిరా
యెంకి వంటి శిన్నదీ
యెందునా లేదు పోస్!" అన్నట్లుగా వుంది ఆ యిద్దరి ధోరణీనూ.

"దొరా, రేపొక్కనాటికీ తమురు శెలవియ్యాలి" అని తాను రేపు తాగి తందనాలాడితే యేమీ అనుకోవద్దనే అర్థం వచ్చేట్లుగా, వీరన్న నిన్ననే పటేలుని ప్రార్థించేడు.

"తాగితే తాగావు. నా దగ్గిరికి మాత్రం రామాకు, లంబ్డికీ!" అని పటేలు నవ్వుతూ పర్మిషన్ యిచ్చేడు. అందువల్ల వీరన్న పని యివాళ మహా జోరుమీద వుంది.

మత్తుతో వీరన్న వొక్క క్షణం కూడా వొకచోట స్థిరంగా నుంచోలేకపోతున్నాడు: యెవర్నో వొకర్ని కదిలించి యేదోవొక సంభాషణలోకి దించి, బూతు చెణుకులు విసురుతూ, మత్తుతో అటూ యిటూ వూగుతూ, కాండ్రించి వూస్తూ, మధ్య మధ్య తవ రొమ్ముని బాదుకొని యేదో ప్రమాణంచేస్తూ, యాక్టరులాగా యేడుస్తూ, అప్పుడప్పుడూ తన సన్నని తెల్లని మీసాల్ని గిర్రున మెలిపెట్టి యేదో పందెం వేస్తూ, గబగబా లొడలొడా బిగ్గరగా వాగుతున్నాడు.

అందరూ వుషారుగా, జల్సాగావున్నారు.

ఇత్తడి పళ్లెంలో చీర మొదలయినవి పట్టుకొని, పట్టు ధోవతులు ధరించిన పటేలు యింట్లోంచి వస్తూ వాకిట్లో నిలబడగానే, చెవులు గింగురుమనేట్లుగా, వాళ్లు యేదో తెలియని వుద్రేకంతో గగుర్పొడిచేట్లుగా, మేళతాళాలు భయ్యిమని అందుకొన్నాయి. యీ భాజాభజంత్రీల ధ్వనికి, తాగి మత్తుగా వున్న జనానికి యింకా వొళ్లు మరిచే కైపు యెక్కింది.

జనమంతా సన్నసన్నగా వూరేగింపుగా బయలుదేరి ముందుకు సాగేరు.

మద్దెలవాళ్లూ, వీరన్నా మొదలైనవాళ్లూ వూరేగింపులో ముందున్నారు. ఆ తర్వాత యేదో హుందాతనాన్ని సూచించే దృష్టుల్తోవున్న గ్రామపెద్దలు వున్నారు, వారి వెనకాల సంబ్రాణి

పొగతో పటేలు నడుస్తున్నాడు, తర్వాత మామూలు జనమూ, అందరికీ ఆఖర్న, తమలోతాము యిప్పటికి బాగా రాజీపడిన బజారు కుక్కలు యేదోభయంతో యేదో తమకి తెలియని మహత్తు జరగబోతున్నదనే భావంతో మెల్లగా నడవసాగాయి. తమ పిల్లల్ని యీ గుంపు తమ కాళ్ల కింద తొక్కేస్తున్నట్లుగా, పక్షులు ఆందోళనతో యీ వూరేగింపు మీద గాలిలో యెగురుతూ దడబిడగా అరుస్తున్నాయి.

ఆ వూరేగింపు కొంతదూరం పోయినాక, జాగీర్దారు నౌకర్లు తమ దొరగారు నాంచారమ్మ దేవతకి బలియివ్వటానికి పంపిన మేకతో సహావచ్చి వూరేగింపులో కలిసేరు. అలా వచ్చి కలిసేప్పుడు, అక్కడకొన్ని నిమిషాలుపాటు వూరేగింపు ఆగగా, మేళాలవాళ్లు ధనధనా వాయించగా, కొంతమంది జనం అక్కడ ఆవేశంతో "నట్టవ" తొక్కేరు.

వూరేగింపు గుడికి దగ్గరౌతున్నకొద్దీ వీరన్నా వాళ్లకి వుద్రేకం, ఆవేశం యింకా యెక్కువగా పెరిగి, పెడబొబ్బలు పెడుతూ, మద్దెళ్ల వద్ద తమ చెవులుపెట్టి వూగిపోతూ, నట్టవ తొక్కసాగేరు. తుప్పుబట్టి మొద్దుబారిపోయిన అమ్మవారి ఖడ్గాల్తో వాళ్లు భుజాలమీదా, రొమ్ముమీద బాదుకొంటున్నారు. ఆ మొండికత్తుల దెబ్బలికి వాళ్లరొమ్మూ, భుజాలూ పొంగి వాచిపోయినాయి.

"పిచ్చిపెద్దులు" - చాకలి - పసుపుబూసిన వొక కొరడా తాడుతో, గిరగిరా తిరుగుతూ, తన వొంటిని ఛళ్లుఛళ్లున బాదుకోసాగేడు. అతని వొళ్లు వాయటమేగాక అక్కడక్కడా చర్మం చిట్లి రక్తం కారుతోంది సన్నగా.

వూరేగింపు గుడిని చేరినాక, వీరన్నకి అంతులేని శివం యెక్కింది. దేవత అతనికి పూనినట్లుగా ఆవేశించినట్లుగా అతను గుడిముందర నుంచుని, చేతులు పక్కలకిచాచి, కళ్లు మూసుకొని, వెనక్కీ ముందుకీ వూగుతూ, "హరహరా! శివశివా!" అని పెడబొబ్బలు పెట్ట మొదలెట్టేడు.

చచ్చేంత భయంతో అక్కడున్న జనం కొయ్యబారి పోయేరు. యేమో, తల్లికి యేమి కోపమొచ్చిందో!?

వొక గ్రామస్తుడు తన రొమ్ముమీద నమస్కారరూపంలో చేతులుపెట్టి ముందుకొచ్చి, వీరన్నకి సాంబ్రాణి పొగవేస్తూ వణికే గొంతుతో యిలా ప్రార్థించేడు.

"మా తల్లీ, యేంగావాలి నీకు?"

"హో...... హో...... హో... హరహరా ! వొరే నేను నాంచారమ్మనురో... శివశివా! ...... వొరే పాపుల్లారా..... నాకు పెట్టుపోతలు సరిగా జరగటంలేదురో...." అని వొళ్లు పెరిగిన వీరన్న గాండ్రించేడు.

"పాపులం తల్లీ! శెమించు అమ్మా, యికనుంచి సరిగా సూత్తంలే తల్లీ...." అని ఆ గ్రామపెద్ద ప్రార్థించేడు.

కొంతసేపైనాక సాంబ్రాణిపొగ బాగా నసాళాని కంటినాక వీరన్న, మతి, మతిలోకొచ్చింది.

ఇదంతా చూసి, ఆడవాళ్ళ గుంపులోవున్న సీత నోటిని చేతుల్తో మూసికొని ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ పక్కనే వున్న సుబ్బమ్మని తన చేతితో తట్టింది. వీరన్నకి దేవత పూనటం మొదలైనవి చూస్తూ మంత్రించినట్లయిపోయి, యే కారణంలేకుండానే కన్నీళ్ల పర్యంతం అయ్యి యేడ్వటానికి సిద్ధంగావున్న సుబ్బమ్మ తన ఆనందం పాడుచేసినందుకు కళ్లురిమి చూస్తూ సీతని నమిలిమింగేట్లుచూసి, "యీ కాలపు పిల్లమోళ్లో" బుద్దులూ గిద్ధులూ మొదలైనవాటిపట్ల తన విచారం వెలిబుచ్చింది. "హవ్వ! యేమికాలం, యేమి లోకం!"

ప్రజల గుంపులమధ్య తిరిగి ఫార్టీఫండు వసూలుచేస్తూ అటుగావచ్చిన రామిరెడ్డికి మేకను దేవతకు బలియిచ్చే దృశ్యాన్ని కాలివేళ్ళమీద నుంచుని యెగబడిచూస్తున్న సీత కనపడింది. యేదో తీయనిబాధ అతని హృదయంలో చెలరేగింది, అతని కంఠం యెవరో నొక్కుతున్నట్లనిపించింది.

మన మనస్సు వేగంగా, తీవ్రంగా పనిచేస్తూన్న సమయాల్లో మన విరోధులు యెవరన్నా మనకి కనుపించినపుడు ఆ క్షణంసేపూ మనం ఆ విరోధాన్ని మరిచిపోయి వారిని పలకరించాలనీ, స్నేహితంగా మెలగాలనీ అనుకుంటాం. ఇవాళ రామిరెడ్డి స్థితి ఫక్తు అలాగేవుంది. సీతని పలకరించాలనీ, వెనక తాను చేసిందంతా తప్పనీ అనుకొంటూ, అతనక్కడ కొంచెంసేపు నుంచున్నాడు. అనుకొన్నాడేగాని మొఖమాటం అతనికి అడ్డువచ్చింది. సీత యిటు తిరిగితే మాత్రం పలకరించి తీరేవాడే. కాని ఆమె యిటు తిరగనూలేదు, అతను పలకరించనూ లేదు, కొంతసేపటికి అతను కదిలివెళ్లిపోయేడు.

# 3

కొండల చాటున సూర్యుడు మాయమయ్యేడు, రాత్రి తన నల్లటిరెక్కల్ని భూమిపైన విప్పింది. సన్నని చలిగాలి వీస్తోంది. అది వొక్కరోజు తిరుణాల అవటంవల్ల చాలామంది ప్రజలు యిళ్లకు వెళ్లిపోయేరు.

అంగళ్ళలో దీపాలు వెలుగుతున్నాయి. కొంతమంది ప్రజలు ఆ షాపు నుంచి యీ షాపు వద్దకిపోతూ, ఆ వస్తువు కొరకు బేరమాడుతూనో యీ వస్తువుని కొంటూనోవున్నారు.

యీ రాత్రి తప్పకుండా సీత యేదోవొకటి కొనటానికి వస్తుందని రామిరెడ్డి అనుకొన్నాడు, అందువల్ల, అర్థంలేని తమ బిగదీపులు మానుకోవాలనీ ఆమెతో మాట్లాడి వొక నిర్ణయానికి రావాలనీ అతను నిశ్చయించుకొన్నాడు.

ఆమె కోసం రామిరెడ్డి ఆ దుకాణంవద్దా యీ దుకాణంవద్దా తొంగిచూస్తున్నాడు, చూస్తుంటే.

"దేముడో, వోరి దేముడా!" అనే కేకలు అతనికి అకస్మాత్తుగా వినబడినాయి.

ఆ కేకలు వచ్చిన దిక్కుగా అతను పరుగెత్తేడు.

అంగళ్లకి కొద్ది దూరంలోంచి ఆ ధ్వని వచ్చింది. వొక మనిషి - కాదు, వీరన్నే - అక్కడొకచోట కూచుని రొమ్ము బాదుకొంటూ అరుస్తున్నాడు.

"యేం జరిగింది, వీరన్నా? ఆ? యేంటి? అని రామిరెడ్డి గుక్కతిప్పుకోకుండా అతన్ని అడిగేడు.

"అయ్యా, దొరా... నాకోడలు... నా కోడలు..."

"ఆ ? యేంటి? యేంటి?"

"దొరా... వాండ్లు యెత్తక పొయిన్రు... లంజాకొడుకులు..."

"యెవరు?"

"కాశీం, దొరా... కాశిం ... రచ్చించండి...."

"యెటుబోయారు?"

"అదిగో.... ఆ.... అటూ...." రింగురుమని బిగిలు మోగింది.

కొంతమంది వలంటీర్లని తీసుకొని, వొక్క ఊపున ఆ దిక్కుగా పరుగెత్తేడు రామిరెడ్డి. అలా కొంతదూరం పరుగెత్తినాక కాళ్ళమీద కూచుని, యేమన్నా సవ్వడి వినవస్తుందేమోనని చెవులురిక్కించి విని, చీకట్లోకి తలవంచి చూసేరు. వుహూ,యే ధ్వనీలేదు. తర్వాత యిద్దరు యిద్దరుగా చీలిపోయి, మెల్లగా ముందుకి సాగేరు.

హఠాత్తుగా, యేదో మూలుగుడు శబ్దం కొంచెం దూరంనించి రామిరెడ్డికి వినిపించింది. ఆ శబ్దంవచ్చిన వేపుగా నేలమీద పాకిపోసాగేరు. వొక పెద్ద యెత్తుపాటి పొద ఆకారం ఆ చీకట్లో, వారిముందు కనబడుతోంది. యింతలో యెవరో పరుగెత్తి పారిపోతున్న ధ్వని వినవైంది. అవును, ఆ నీచులు పారిపోతున్నారు! వలంటీర్లు వారి వెనకాల పరుగెత్తేరు. త్వరలోనే ఆ రౌడీల్లో కొందర్ని ఖాసింనీ, వొక ముఖంమచ్చల, వొంటికన్నువాణ్ణీ వారు పట్టుకొని, రామిరెడ్డి వద్దకి తీసుకొచ్చేరు. రామిరెడ్డి ఆ పొద వద్ద వున్నాడు, గంగి నోటికీ, చేతులకీ రౌడీలు కట్టిన కట్లని విప్పదీస్తున్నాడు.

"ఆరి లంజకొడకల్లారా!" అని వొక వలంటీరు తిట్టేడు. "బూతులెందుకు? వీళ్లని సోములు వద్దకి తీసికెళ్దాం పదండి." అన్నాడు రామిరెడ్డి.

ఖాసింని చూడగానే గంగి బిత్తరగొని పోయింది.

"యికనేం భయంలేదు. వాడిక యేమీచెయ్యలేడు" అదిచూసి రామిరెడ్డి ఆమెని వోదార్చేడు.

గంగి చుట్టూ వలంటీర్లు వున్నప్పటికీ యింకా భయం వదల్లేదు, రామిరెడ్డి ఫరవాలేదు అంటున్నప్పటికీ ఆమె యేడుస్తూనేవుంది.

హఠాత్తుగా - దోవ మధ్యలో - అతి ఆశ్చర్యం కలిగించేట్లుగా గంగి యిలా అరిచింది.

"పాడవండి తొత్తుకొడుకుని. యీ తురకకుక్క - నా వొంటిమేన శెయ్యేస్తడా?"

అలా ఆమె ఆవేశంచెందినాక యిక యేడ్వలేదు, దోవ పొడుగూతా "తురక" వాళ్లనీ, పటేలునీ, వాళ్లనీ వీళ్లనీ, ఆమె తిడుతూనే వుంది.

అంత భయపడి యేడ్చిన మనిషి యెలా అంత ధైర్యంతో అలా మాటాడుతున్నదో రామిరెడ్డికి అర్థంగాలేదు.

"నాయంటి ఆనోడ్లు నీకు లేరంటరా? నీకు శెల్లెండ్లు లేరూ? అక్కలు లేరూ?......." అని గంగి తన కడుపుమంటని కక్కుతూనే వుంది.

రామిరెడ్డి ఆమెని వూరుకోమంటే, "నీదేంది, రామిరెడ్డీ? నువ్వూరుకోరాదు? ఆమెకి కడుపుమండి ఆమె అనుకొంటది! మద్దెలో నీదేంది?" అని వలంటీర్లు ఖాసింని పదమని పిడికిళ్లతో పోట్లుపొడుస్తూ అన్నారు.

వారంతా వీరన్న వున్నచోటికి చేరేరు. వీరన్న చుట్టూ చాలమంది మనుషులు వున్నారు. వొకప్పుడు యేడ్పుగొంతుతోనూ, మరొకప్పుడు కోపపు గొంతుతోనూ, మధ్య మధ్య మీసం మెలేస్తూనూ, వీరన్న జరిగిన కథంతా అక్కడివారికి చెబుతున్నాడు. రామిరెడ్డి మొదలైన వాళ్లు గంగిని తీసుకొని అక్కడికిరాగానే, కూచున్న వాడల్లా సులాగ్గా యెగిరినుంచొని, వారివద్దకి పరుగెత్తి, రామిరెడ్డి యొక్క రెండు కాళ్లూ వాటేసుకొని, వీరన్న పిల్లవానిలాగా యేడ్చేడు, "దొరా... బాబుగారు... నేను తముకి బానిచని"

తటాలున వీరన్న ఆ గుంపులో ఖాసింని చూసేడు.

"సంపండా లంజకొడుకుని!" అని అతడు అరిచి ఖాసిం వైపు విసురుగా వెళ్లేడు.

అప్పుడే వచ్చిన శ్యాయసుందరరావు అతన్ని ఆపి వద్దని బతిమాలేడు.

"వొద్దు, దొరా, వాణ్ణి నాకు వదలండి. వాడంతు తేల్చుతా! వాడన్నా నా శేతుల్లో సావాలి, నేనన్నా వాడి శేతుల్లో సావాలి! అంతే! అదిప్పుడే తేలిపోవాలి... వదలండి నన్ను...." అని వీరన్న గర్జన చేసేడు ఆగ్రహంతో అతని వొళ్లు వూగిపోతుండగా.

శ్యామసుందరావు చాలా బతిమాలిన తర్వాతగాని వీరన్నని ఆపలేకపోయేడు. తర్వాత అతను తన కామ్రేడ్సు వైపు తిరిగి యిలా అన్నాడు.

"యీ రౌడీని యేం చేద్దాం?"

"పోలీసులకు అప్పగిద్దాం పట్టండి" అన్నాడు సైదులు.

"అసలు ముందు, వాడా గోరం చేసినందుకు వాడ్ని ముందు మెత్తగా తన్నుదాం

పట్టండి. ఆపైని యేం చెయ్యాలో తర్వాత ఆలోశిద్దాం....'' వొక వలంటీరు అన్నాడు. ఆ మాటలువిన్న ఆ వొంటికన్ను రౌడీ గజగజ వణికిపోతూ బెదురుచూపులు చూసేడా వలంటీరు వంక.

“అదిగదే దొరా.....'' అన్నాడు వీరన్న.

తక్కిన వలంటీర్లంతా మొదటి వలంటీరు చెప్పినదాంతో యేకీభవించేరు.

“వాడ్ని గంగిని క్షమాపణ కోరమనండి వదిలేద్దాం.'' అన్నాడు రామిరెడ్డి.

“అవును. అదే మంచిపని.'' అన్నాడు శ్యామసుందరరావు.

ఆ సలహాకి యెవరూ వ్వూ అనలేదు. ఆ అనలేదు.

శ్యామసుందరరావు, ఖాసింవంక తిరిగి, యిలా అన్నాడు

“యేమిటి మరి? తప్పుచేశావు. ఆమెకు క్షమాపణ చెప్పుకో.''

“వుహూ. ఆదాథానీ నుంచీ నేను శెమాపణ అడగాను అంతకంటే నన్నూ సంపేశెయ్యండీ....అంతే.... మీయిష్టం....'' అని ఖాసిం నెమ్మదిగానూ, నిశ్చయంతోనూ అన్నాడు.

ఆ మాటల్తో వలంటీర్లు మరీ ఆవేశమొందేరు. వీరన్న సంగతి యిక చెప్పనక్కర్లేదు. కాని, శ్యామసుందరరావు వాళ్లందర్నీ శాంతంగా వుండమని బతిమాలి, ఖాసింవంక తిరిగి యిలా అన్నాడు..

“నువ్వు పశువ్వి, నీచుడివి. ఆమెకి నువ్వు చాలా ద్రోహం చేశావు. నీ చెల్లెలికి యిలాంటి పనే యెవరో చేస్తే నీకు యెట్లా వుంటుందో కాస్త ఆలోచించుకో. ఆ? యింకా సిగ్గు లేకుండా, పెద్ద మొగాడికిమల్లే ఆమెకి క్షమాపణ చెప్పుకోనంటున్నావా? ఆమె నీకు మల్లే మనిషికాదని నీ వుద్దేశమా? ఆ? ప్రజలు అలాంటి నీచపు పనుల్ని సహించరు? తెల్సిందా? ప్రజలు తల్చుకుంటే నీ యింటాళ్లని డొక్కపగలదీస్తారు! జాగర్త!! యికపో.... యిదుగో విను... యిది మా మొదటి వార్నింగ్! తెల్సిందా? పద... అని ఖాసింని వొక్కతోపు తోసేడు. ఖాసిం యేదో గొణుగుతూ వెళ్లేడు. ఆ వొంటికన్ను రౌడి తనని యే దెబ్బలూ కొట్టకుండా విడిచిపెట్టినందుకు కృతజ్ఞతగా, శ్యామసుందరావుకి పదిసార్లు దణ్ణంపెట్టి, వెళ్లిపోయేడు.

ఈ సంఘటన గురించి మమ్మూకి తెలియగానే, నోరు కొట్టుకొంటూ అతను తన “ముసలిముండ'ని యిలాంటి “లుచ్ఛా'' ముండాకొడుకుని కనినందుకు తిట్టిపోసేడు.

“నేను యెప్పుడూ యిట్టాంటీ లుచ్ఛాకోరూ పనుల్ సూడలేదు! వాడూ నాపేరూ శెడగొట్టాడు... నాయింటో శెడబుట్టాడు... మన మహ్మదీయా కులంలో శెడబుట్టాడు.... ఆ.... లుచ్ఛా.... లుచ్ఛా.... లుచ్ఛా... సువ్వర్''....



# తిరుగుబాటు

మనం-బీదాళ్లం-వొక లెక్కలో మనుషులంగాదు వీళ్ల దృష్టిలో, ధనికులో, వాళ్లు మంచివాళ్లు... మనం నొకవైపున బీదరికంతో పీల్చి పిప్పిజేయబడుతోంటే, వాళ్లొక పక్కన ధనికులు - యింకా ధనికులు అవుతున్నారు, మన బీదరికమే వాళ్ల భాగ్యానికి కారణం.

యీ అన్యాయాన్ని యెదిరించి పగ సాధించుదాం పట్టండి మనం వెధవలం కాకముందే, అయితే నేనిలా అనేది రక్తదాహంతో గాదు, ఆకలి మంటతో !!

- 'కొరియలానస్' లోఫస్ట్ సిటిజన్ (షేక్స్పియర్)



ప్రజలకి యింకో మార్గంలేదు......

కౌలు రేట్లు యెక్కువ, పండేది తక్కువ, అయినా, యెండినా పండినా చచ్చినట్లు కౌలు యిచ్చుకోవాల్సిందే. లేకపోతే, కొరడా, వేలం, జైలు తయారుగావుంటాయి. ఇచ్చేది చాలక కూలీ బాధతో మూలిగితే, రైతు తన వొట్టి చేతులూ, వీపు మీదున్న దెబ్బలూ చూపించేడు.

అంతేగాక మామూళ్లు, జుల్మానాలు, యింకా యెన్నో!

తెలంగాణాలో, జాగీర్దారీ, దేశముఖ మున్నగు ప్రాంతాల్లో 40 రకాల పన్నులు పైగా వున్నాయి. అన్నిటికంటే విపరీతమైనదీ, అతి క్రూరమైనదీ స్తన్యాలపై వేసే పన్ను!

అంతేకాదు. యే తండ్రీ తన కూతుర్ని "దొర" లకి అయిష్టమైన మనిషికి యివ్వలేడు.

అరణ్యంలోంచి గ్రామంలో జొరబడి యే తోడేలునో, పులినో, అవి పైరులకీ, మనుష్యుల ప్రాణాలకి నష్టంచేసినప్పటికీ, యెవరూ చంపరాదు. అరణ్యం గూడా జాగీర్దారుది, దాంట్లో పుల్లరికట్టందే, యే పశువూ ప్రవేశించటానికివీల్లేదు.

ప్రతిదీ నిజంగా, ప్రతివ్యక్తీ ఆ "దొర"లది? అంతా వారిదయ.

ప్రజలు ఆవేదనతో బాధతో మూలిగారు? శపించేరు. కాని పిల్లి మెడలో గంట కట్టేదెవరు? చలికాలంలో, కొత్తగా కాలవలోస్నానం చేయాల్సివచ్చిన మనిషి నీళ్లలో దిగేముందు యెలావూగిసలాడతాడో, వణుకుతాడో, ప్రజలు అలా వణుకుడుతో వూగిసలాడేరు.

మరి ప్రజల నాయకులైన కమ్యూనిష్టు పార్టీ "పిల్లికిగంట" కట్టినపుడు, ప్రజలు రణఘోషతో గర్జించేరు.

ప్రజలకి యింకోమార్గం లేదు...

ప్రజల ద్వేషాగ్ని యెంత భయంకరంగా ప్రజ్వరిల్లిందంటే, తెలంగాణాలోని భూస్వాములు

మొదలగువారు ప్రజల్ని యెంత క్రూరాతి క్రూరంగా దోచేరకమంటే - వొకతిట్టుకి పదితిట్లతో, వొకదెబ్బకి పదిదెబ్బలతో ప్రజలు సమాధానం చెప్పాల్సి వచ్చింది, పన్ను వేసి పీడించే వ్యక్తిపై పన్ను వేయాల్సివచ్చింది, క్రూరుణ్ణి క్రూరంగా చూడాల్సివచ్చింది. హంతకుణ్ణి హత్య జేయాల్సివచ్చింది!!

ప్రజలు తమ నిద్రమత్తుని ఝూడించి పోద్రోలి భీకరంగా గర్జించేరు, భయానకంగా గాండ్రించేరు...

తెలంగాణాలో నూత్న సూర్యోదయమైంది.

## 2

హు. నీ పిచ్చి భార్య !
శత్రువు గుండెను చీల్చాల్సిన కత్తితో
ఆత్రపడియు తన గుండెనే చీరుకొన్నది !!

- ది రేప్ ఆఫ్ ల్యూక్రెషీ (షేక్స్‌పియర్)

1947లో, దాదాపు నైజాం అంతటా, మతపైత్యంతో, పిచ్చియెక్కిన కుక్కల్లాగా, రజాకార్లు తమ విషపు కోరల్ని తెరచి చెలరేగేరు. మొదట వాళ్లు పట్నాల్లోనూ, అటు తర్వాత ముస్లిం ప్రాబల్యం వున్న గ్రామాల్లోనూ తలయెత్తేరు.

"ఆజాద్ హైదరాబాద్ - జిందాబాద్!"

"నైజాం నవాబ్ - జిందాబాద్!"

"కాశిం రజ్వీ - జిందాబాద్!"

"హిందువులు నశించాలి!"

అవే వారి నాయకులు గొంతులు చించుకొని అరిచిన నినాదాలు.

రజాకార్ వుద్యమం పెచ్చరిల్లినచోట అక్కడి భూస్వామిగానీ, వ్యాపారిగానీ, ఆఫీసరుగానీ హిందువులనీ, పైపెచ్చు ప్రజాకంటకులనీ గ్రహించండి. మరి అలాంటప్పుడు, అక్కడి ముస్లిం రైతుయువకుడో, ముస్లింకూలీయో, ముస్లిం నౌకరో సమయంరాగానే తమ "హిందూ దొరల" వంక గుడ్లెర్రజేసి చూస్తూ, "హిందువులు నశించాలి!" అని అరిస్తే వింత యేముంది? అంతేగాదు, అక్కడి తమ హిందూ దొరలపై గల్గినద్వేషంతో కళ్లు మూసుకొనిపోయి, తమ తోటి కష్టజీవులైన సామాన్య హిందువుల్ని గూడా విరగ్గొట్టారంటేనూ, వారి ఆస్తిపాస్తుల్ని లూటీ చేశారంటేనూ, వారి స్త్రీలని చెరిచారంటేనూ, ఆ సామాన్య హిందువుల్ని గూడా కొంతమందిని చంపారంటేనూ ఆశ్చర్యమేముంది?

"అజాద్ హైదరాబాద్" లాంటి తియ్యని నినాదాల వెనుక, నిరుద్యోగిఐన ముస్లిముకి భవిష్యత్తులో ఒకస్వర్గం కనపడింది, ముస్లింరౌడీలకి డబ్బూ, యువతులూ అగుపించారు. కాని, ఆ వుద్యమంలో పాల్గొన్న ప్రతిముస్లిమూ బీదరికాన్ని, హిందువుల దోపిడీనీ ద్వేషించాడు ఐనా, వర్గ చైతన్యం లేనందువల్ల మతపిచ్చతో మాత్రమే అతను ముందుకు వురికాడు.

ఆ తియ్యని నినాదాలు రజాకార్ల కళ్లు గప్పగా, వాళ్లు తమ నిజమైన శత్రువులెవరో చూడలేక పోయేరు, అందువల్ల, ఆ గుడ్డితనంలో, తమ నిజమైన శత్రువుల వలలో పడిపోయి, తమ చేతుల్తో తమ మిత్రుల గొంతులు కోసేరు, తమ చెల్లెళ్లతో సమానమైన వారిని తామే మానభంగం చేసేరు.

కొన్ని వేలకోట్ల రూపాయల డబ్బూ, పద్దెనిమిది లక్షల యకరాల పొలమూగల్గిన నైజాం నవాబు, పొంగివచ్చే ప్రజా వుద్యమానికి వ్యతిరేకంగా యీ మత్తెక్కిన గుడ్డి రజాకార్లని అలా వుపయోగించుకొని ఇంతకుముందు తన నరకంలో కనీవినీ యెరుగనటువంటి రాక్షసచర్యలు జరిగేట్లు చేసేడు.

తమతోటి హిందువైన ఒక బిచ్చగాడ్ని చూడగానే "పోరా కుక్కా" అని తన్నటానికి సిద్ధమయ్యే హిందూ నాయకులూ, స్టేటుకాంగ్రెసు పెద్దలూ, నక్కజిత్తుల పత్రికలూ యీ రజాకార్ వుద్యమంవల్ల "హిందూమతం"కు "ప్రమాదం" యేర్పడినట్లు నటించినప్పటికీ, లోలోనమాత్రం యిక ప్రజా వుద్యమం అణిగిపోతుందిగదా అని సంతోషించారు.

ప్రధానంగా మద్రాసు పత్రికలన్నీ రజాకార్ గుండాగిరీని గురించిన వార్తల్ని తమ మొదటిపేజీల్లో ప్రముఖంగా ప్రకటించి తాము యెవర్నో రక్షిస్తున్నట్లు నటించేయి. కాని వొక్క ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ పత్రిక "ప్రజాశక్తి" తప్పితే యే పత్రిక గూడా అసలు యీ గూండాగిరీకి మూలకారణం యేమిటో యెవరికీ చెప్పలేదు.

పత్రికల పక్షపాతపుబుద్ధి వల్లా, విషపూరిత ప్రచారం వల్లా, పై వర్గాల సంకుచిత ధోరణి వల్లా, వారికి రాజకీయ చైతన్యం లేమివల్లా, వ్యాపారులూ, ధనికరైతులూ, మేధావులూ మొదలగు వారిలో యెక్కువమంది ఆగ్రహంతో బూతుపదాలు వుపయోగిస్తూ "తురక జాతిని" నమ్మరాదని నిరసించేరు.

ప్రతి రైలుబండీ, ప్రతి మోటారుబస్సూ - వొక్క మాటలో, పై వర్గాలున్న ప్రతిచోటూ ముస్లిములపట్ల ద్వేషంతో ప్రతిధ్వనించింది. యీ విషపు వాతావరణంలో వుక్కిరిబిక్కిరై ఆఖరికి సామాన్య ప్రజానీకంగూడా యీ "తురకజాతి"ని దూషించిందంటే ఆశ్చర్యంగాదు.

ఆనాడు యూనియన్ ఆంధ్రలోనూ తక్కిన కొన్ని చోట్లా పరిస్థితి అలా వున్నది.

మోసపోయి, మత్తెక్కి, మండిపోతూన్న, రజాకార్ల భయంకర దాడిని తట్టుకోలేక, బానకడుపూ, గంగడోలు మెడలూ, గాంధీ టోపీలూ గల్గిన పిసినారి లక్షాధికారులూ, మార్వాడీ సేట్‌లూ, స్టేటు కాంగ్రెస్ పెద్దలూ, తమ ఆస్తిపాస్తుల రక్షణకి అక్కడి ముస్లిములకి బాగా డబ్బిచ్చి కాపలా పెట్టిన తర్వాత గ్రామ ప్రజల్ని గురించి అయితే ఆ తర్వాత తమ వుపన్యాసాల్లోనూ, పత్రికల్లోనూ చెడమాట్లాడేరో ఆ ప్రజల్ని గాలికి వదిలేసి, యూనియన్ ప్రాంతానికి పరుగెత్తుకొచ్చేరు. కాషాయి బట్టలు ధరించిన యీ ఆషాడభూతులు ఆయాపట్నాల్లోని మంచిమంచి యిళ్లన్నీ అద్దెలకి తీసుకొని మకాం పెట్టేరు. తమ చదువులకోసం యేదేనా వొక గది అద్దెకి దొరుకుతుందేమోనని బయలుదేరిన కాలేజీ కుర్రాళ్లు "అద్దెకు యివ్వబడును" అనే బోర్డులన్నీ యీ బానకడుపు పెద్ద మనుషుల గంభీరపు చూపుల వెనకాల మాయమైపోయాయని తర్వాత గ్రహించేరు.

మామూలు స్టేట్ కాంగ్రెస్‌వాదులు యీ రజాకార్ వుద్యమంచూసి బిత్తరగొనిపోయేరు, వారిలో కొంతమంది రజాకార్లతో రాజీకొచ్చేరు, మరికొంతమంది, నాయకత్వంలేని నిరాయుధులైన ప్రజానీకంలాగా బాధలకి గురి అయ్యేరు.

పసుపుపచ్చని జండాలు చేతబట్టి స్టేటు పోలీసువర్గం "లా అండ్ ఆర్డర్" ని లక్ష మైళ్లలోతున పాతిపెట్టి రజాకార్లతో చేతులు గలపగా రజాకార్లు పిచ్చికుక్కల్లాగా చెలరేగేరు.

వొక్క కమ్యూనిస్టుపార్టీ మాత్రం, సాధ్యమైనంత యెక్కువమంది ప్రజల్ని సమీకరించి, రజాకార్ పోలీస్ గుండాగిరీని యెదుర్కొంటూ, పసిపాప తన తల్లి స్తన్యానికి అంటిపెట్టుకొనేట్లుగా, ప్రజలకు అంటిపెట్టుకొని వున్నది.



# వింత ముంత

ఔర నిరంకుశుడా !
ఓరి కర్కశుడా !!
పిచ్చివాళ్ల ప్రజలనీ
అచ్చమెపు డట్లుందురనీ
తమ నెత్తురుతోడ నిన్ను
తాము మేపుతారనీ
తలచబోకు
వలచరాకు!
నిన్ను నీ రూపుజూస్తే
మిన్నూ గిన్నిరిగేట్లుగా
ప్రజలు పోరాడతారు
ప్రళయం పుట్టిస్తారు!
అవును!
నీ వక్రపు బుద్ధుల్నీ
నీ వికృత రూపాన్నీ
నీ కర్కశ హృదయాన్నీ
చూసిరి ప్రజ నేడు బాగ
లేచిరి నిన్నణచ వేగ !!!

"మోహన్"

**అ**ది మధ్యాహ్నం.........

దాదాపు మగవాళ్లంతానూ, స్త్రీలలో చాలామందిన్నీ పొలాలకో యెక్కడికో తమతమ పనులకి వెళ్లేరు. గ్రామమంతా నిర్జనమైపోయి, ఆ అరణ్యమూ, కొండల మధ్య వొంటరిగా అయిపోయినట్లు కనిపించుతోంది, స్మశానంలో లాగా అక్కడ నిశ్శబ్దంగా వుంది.

అక్కడక్కడా మాత్రం యే ముసలమ్మో తనయింటి గడప వద్ద కూచుని యే చిరిగినగుడ్డలో కుడుతోంది, లేదా యింటి వద్ద కూతురో కోడలో దిగవిడిచి పోయిన పసిపాపని ఆడిస్తోనో వుంది.

అయితే గ్రామంలో ముసలమ్మలు తప్పితే మరొకరు లేరనుకోవద్దు, కొంతమంది యువతులుగూడా వున్నారు. కాని, వారు పనికి పోకుండా వూళ్లో వున్న కారణంవేరు, రజాకార్ల దాడుల్ని యెదుర్కోటానికి ఆ గ్రామ కమ్యూనిష్టు కమిటీ నిశ్చయించింది. ఐనా, తామంతా

యేదో వొక పని చేసుకొని బతకాల్సిన వారు కాబట్టి రజాకార్ల కోసమని తీరికగా గ్రామంలో కూచోటం సాధ్యపడదు. అందువల్ల, స్త్రీలలో కొంతమందిని కొన్ని దళాలుగా పార్టీ యేర్పరచింది, ప్రతి రోజూ వొక దళం వూళ్లో వుండి, రజాకార్లు వస్తే యెదుర్కొని తోలేసెయ్యాలి.

అదీ సంగతి.

సుబ్బమ్మా, కోటమ్మా యిద్దరూ సుబ్బమ్మ యింటి చూరు కింద కూచుని వున్నారు. వారి మోకాళ్ల మీద పాత బట్టలు వున్నాయి. సుబ్బమ్మ ముసలమ్మ అవటం వల్ల చూపు సరిగా ఆననందున మాటిమాటికీ కోటమ్మ సూదిలో దారం గుచ్చి ఆమె కివ్వాల్సివస్తోంది. తన కళ్ళనీ, దేముడ్నీ, ముసలితనాన్నీ తిట్టుకొంటూ సుబ్బమ్మ బట్టలు కుట్టుతోంది.

"యేం జరుగుతుందంటావు, పెద్దీ ? " అని కోటమ్మ తల యెత్తకుండానే అడిగింది.

సూదిని తన పెదిమల సందున నొక్కిపట్టుతూ, సుబ్బమ్మ ఆమె వంక చూసి, ఆ తలాతోకా లేని ప్రశ్నని తాను అర్థం చేసికొన్న సర్వజ్ఞాని లాగా యిలా జవాబిచ్చింది.

"యేముండది సింగినాదం? ఆ? మన సంగపు కుఱ్ఱోండ్లా వాండ్ల నూరికే వొదిలి పెడతారా ? ఇయ్యాలగాపోతే రేపన్నా వాండ్ల అంతుసూడరా?...."

"యేందీ?" అని దీర్ఘం తీస్తూ, పరాకుగా సుబ్బమ్మను చూస్తూ కోటమ్మ అడిగింది.

"యేందిపిల్లా? మన సంగపు కుఱ్ఱోండ్లా యీ రజాకారుల్ని వూరికె వొదిలెడతారా యేంది? దొంగతనం యెంతకాలంపాటు దాగుద్దంటవు? ఆ? అన్నేయం యెంతగాలం సాగుద్దంటవు? మంచనేదెప్పుడూ మంచే!...."

"నువ్వు జెప్పేదిసత్తెమే, పెద్దీ. కానీ...."

"లేదు, పిల్లా. నా మాటనమ్ము. నేన్నీకంటె సాల పెద్దముండని. నాకు సాలా తెలుసు....."

"సూడూ అసలిదంతా యెందుకొచ్చినదంటవు?"

"యెట్టా శెప్పగలం అదీ? యిదంతా ఆ భగవంతుడే పెట్టెండేమో పెదకొలిమి!"

"అదిగాదు, పెద్దీ. జనం యెవురూ యేమీ అడక్కుండా నోరు మూసిపట్టేందుకే, జనాన్ని అదరగొట్టేందుకే యిదంతా సాగిచ్చిరనని మన సంగపు కుఱ్ఱోండ్లు అంటరే!?"

"అయితే అయ్యుండొచ్చు... అసలు యేదొచ్చినా మనింటి బీదోండ్లేగద ముందు బాదపడేది?!... సూడూ.... మన మమ్మూ సాయిబు కొడుకు గూడా వొక మొనగాడయ్యే? యింక శెప్పేదేంది! మమ్మూసాయిబుకి శిగ్గన్నాలేదు అట్టూంటి ముండాకొడుకుని కన్నందుకు! శీ.... ముక్కుమూసుకుంటే మూడుగడియలు పట్టదు సావటానికి!.... దేనికి...."

వారలా మాటాడుకొంటూండగానే, హఠాత్తుగా వొక కోడిపెట్ట భయంకరంగా అరిచింది. దాని వెంటనే ఆడవాళ్ల కీచురుధ్వనులు గాలిని నింపేశాయి.

"వాండ్లొంచ్చి(ను... పద....పద...." కోటమ్మ అలా అని దుడదుడా తన యింటికేసివెళ్లింది.

రజాకార్లు ధనికరైతు నాగయ్య యింటిమీద పడటాని కొచ్చేరు. ఖాసిమూ, ఆ వొంటికన్ను ముస్లిమూ తప్పితే తక్కిన రజాకార్లంతా గ్రామానికి కొత్తవాళ్లే, వాళ్లచేతుల్లో కొరడాలూ, లాఠీలు వున్నాయి

రామిరెడ్డి తండ్రి ఐన సుబ్బారెడ్డిగారింట్లో ఆ రోజుటి స్త్రీదళం వుంది. యీ దళానికి రామిరెడ్డి చెల్లెలు మంగమ్మ నాయకురాలు. రజాకార్లు ధనికరైతు నాగయ్య యింటిమీదపడటం మంగమ్మ చూసింది.

"మనం ఆడకి యెల్లొద్దు. నాగయ్యకేం మాయరోగం దోసుకుపోతే? వాడొక పెద్ద ధనికుడు.... వొట్టి పిసినిగొట్టుపీనిగ...." అని పాలిపోయినముఖంగల వొక స్త్రీ అన్నది.

"అదే మాట పిన్నాం? పక్కనే వొక యింటికి నిప్పుముట్టుకుంటే, దాన్ని దబ్బున ఆర్పకపోతే మొత్తం యిండ్లకి ఆ నిప్పు అంటుకొని యిక మిగిలేదిబూడిదా బొగ్గు మాత్తరమే! పదండి. ఆ మాటతప్పు...." అని మంగమ్మ వాదించింది. తనకూతురు మాటకారితనానికి మంగమ్మతల్లి లోలోన చాలా సంతోషించింది.

"అంతేలే, పిల్లా.... వాడు ధనికుడైతే వాడి పాపానవాడే పోతాడు... పదండి... మన పని మనంశేద్దాం...." అని రామిరెడ్డిని యిదివరకి బావివద్ద వెక్కిరించిన "చింపిరమ్మ" అన్నది.

అందరూ అందుకు వొప్పుకొన్నారు. అంతా బైటకొచ్చి, యేంచెయ్యాలోతోచక యింటిముందు నుంచున్నారు.

"ముంత సంగతేందీ, ఆమ్మీ?" అని వొకామె మంగమ్మచెవిలో వూదింది.

"ముందు నేనాడకి పోయొస్తా. పోయొచ్చినాక ఆమొయిన....." అని మంగమ్మ జవాబిచ్చింది బిగ్గరగా.

"వొద్దువొద్దే, అమ్మి! ఆడకి నువుబోవద్దు.... వాండ్లునిన్ను...." అని మంగమ్మ తల్లి మందలించింది.

కాని, తల్లిమాటలు పట్టించుకోకుండా మంగమ్మ సరసరా నాగయ్య యింటికెళ్లి బయటనుంచుంది. వొళ్లంతా నల్ల తామరతో నిండి లావుగా, పొట్టిగావున్న షావుకారు నాగయ్య తన రొమ్ము బాదుకొంటున్నాడు. రజాకార్లు వొక పెద్దకొయ్యపెట్టెని పగలగొట్టుతున్నారు.

మంగమ్మని చూడగానే నాగయ్య బైటకిపరుగెత్తివచ్చి ఆమె రెండు చేతుల్నీ పట్టుకొని వలవలమన్నాడు.

"అమ్మీ... నాచిట్టీ... యేదట్టాగ నుంచున్నవు? నేను మీ యిరోధినా? పగాణ్ణా? నేను మీకేమన్న అన్నేయం చేశానా? నేను సంగానికి యెతిరేకినా? మీ ఆడోండ్లదళం యాడుంది? ఆ? సంగపుకుర్రోండ్లు యాడున్నారు? పోయి శెప్పు... అందర్నీ కొట్టుకురా... పో.... వాండ్లు నాయిల్లంతా గుల్ల శేసేస్తున్నారు! యేమీలేదు... నేను మునిగిపోయినా.... నాకంటే కలిగినోండ్లువుండగా వాండ్లు నా యింటి మీదే పడ్డరు....."

అని అతను మంగమ్మని పొమ్మని ముందుకు నెట్టేడు. మంగమ్మ యింటికి పరిగెత్తింది. తలావొకప్రశ్న ఆమెని వేసేరక్కడ. యెవరికి యేమీ జవాబు చెప్పకుండా, ఆమె యింటోకి దడదడాపోయి ఆ ముంతని పట్టుకొచ్చి యిలాఅంది:

"పదండి పదండి, తొరగా. నాతో రాండి....రాండి...."

సర్రున ఆమె నాగయ్య యింటివేపు పరుగెత్తగా, తక్కినవాళ్లు ఆమె ననుసరించేరు యంత్రపు బొమ్మల్లాగా. నాగయ్య యింకా అక్కడేవున్నాడు. పెరటి దొడ్లోంచి ఆ యింటి ఆడవాళ్ల యేడ్పులు వినవస్తున్నాయి. స్త్రీల దళం రావటం చూసి నాగయ్య ధైర్యం చెందినట్లు అగుపించి, శోకాలు పెట్టటం మానేసేడు.

మంగమ్మ ఆ యింటిగడప వద్ద నుంచుని, తనచేతిలోని ముంతలో చేయిదూర్చింది. ఆ ముంతలో కారంవుంది! గుప్పిళ్ల తో కారంతీసి యింట్లో వున్న రజాకార్ల మీదికి విసిరిందామె. ఆఖరికి నాగయ్య గూడా వెనకబడలేదు. తానుగూడా కారంతీసి లోనికి గుప్పతున్నాడు. ఆ మిరపకాయల కారం రౌడీల అంతుదేల్చుకొంది. కారం కళ్లల్లోనూ, ముక్కుల్లోనూ పడగా వాళ్లు కళ్లు నులుపుకొంటూ, కోరుతో తుమ్ముతూ, బూతులు తిడుతూ, వొక్కొక్కరే బయటికి రాసాగేరు. ముంతలో కారం అయిపోయినా కసికొద్దీ వొళ్లు మరచిపోయి నాగయ్య తనవొట్టి గుప్పిళ్లని వారి కేసి విసురుతూ, వాళ్లు బయటికి రాగానే వాళ్లని చేతుల్తో బాదసాగేడు.

"లంజాకొడకల్లారా....లంజాకొడకల్లారా..." వాళ్లని బాదుతున్నంతసేపూ నాగయ్య నోటినుంచి ఆ బూతులు తప్ప రెండో మాట రాలేదు.

విసవిసా పరుగెత్తి ఆ స్త్రీలు రోకళ్లు పట్టుకొచ్చి వాటితో రజాకార్లని పొడవ నారంభించేరు.

అలా రోకళ్లతోనూ పిడికళ్లతోనూ పొడుస్తూ, నాగయ్య ఆ స్త్రీలు కలిసి రజాకార్లని గ్రామం బయట దాకా గుడ్డిపశువుల్ని తోలుకొచ్చినట్లు తోలుకొచ్చేరు.

అక్కడ తన మేకతో సహా మమ్మూసాహెబ్ యెదురయి, రజాకార్ల మందలో వున్న తనకొడుకు ఖాసింని గుర్తించేడు.

"యేమ్టీయిది? ఆ? ఆపండి ముండల్లాల!" అని మమ్మూ అరిచేడు.

"నువ్వు ముండవి; నీ కొడుకుముండ; నీ వాండ్లంతా ముండలు! యెవుర్రా ముండలు? మొకానికి సిగ్గులేక యింకా మమ్ముల్ని మండలంటావా?" అని "చింపిరమ్మ" ధగిడీసన్నది.

మమ్మూ యెందుకనో మారుపలక్కుండా, తనకొడుకు చేయిపట్టుకొని యిలా అన్నాడు: 'పదరా, సువ్వర్! పద, పదా....నువ్వా మహ్మదీయా కులంలో' శెడబుట్టావ్ రా..పదా...

పళ్లు బిగించి తిడుతూ, గుడ్డి బిచ్చగాణ్ణి మంచి బిచ్చగాడు నడుపుకు పోవునట్లుగా, మమ్మూ తనకొడుకుని యింటివేపు తీసికెళ్లేడు.

కళ్లు నులుముకొంటూన్న రౌడీల్ని అక్కడేవదిలేసి, నాగయ్యవాళ్లూ యింటికి తిరిగొచ్చారు.

అక్కడ వూళ్లో మిగిలిన వారంతా పొలాలకి పోనివారు చేరేరు. సరిగ్గా అదేసమయంలో రామిరెడ్డి పరుగెత్తుకొంటూ వచ్చేడు.

"యేం జరిగింది? వాళ్లేరి?" అని అడిగేడు.

"వాండ్లని ఆ లంజాకొడుకుల్ని వూరి బేటిదాకాతన్ని పంపినం...." అని నాగయ్య వీరుడిలాగా ప్రారంభించేడు. " నీ వల్ల బతికినాంరా, బాబూ.... బలేవుపాయం... యీ దళాలూ యిదంతానూ! బలేవుపాయం... ఆహ్.... యియ్యాల ఆ వింతముంత యెంతపనిజేసిందని శెప్పను! అబ్బా, అబ్బా, శెప్పతరంగాదు!! యిక మీద మనం యినుమిక్కిలి జాగర్తగా వుండాల్సుమా!ఆ?"

"అవునవును" అని రామిరెడ్డి జవాబిచ్చి చుట్టూ చూసేడు. అతనిదృష్టి "చింపిరమ్మ' ' మీదకిపోయింది. ఆమె చేతిలో వొక రోకలివుంది. అతనికి ఆశ్చర్యంవేసింది. యిదివరకి తననీ, సంగాన్నీ యీసడించిన ఈ చింపిరమ్మ యీనాడెంత ముందుకొచ్చిందీ!!

ప్రజలు అజేయులు సుమా!

ప్రజల మనస్తత్వం గ్రహించటం కష్టం సుమా!

పరిస్థితులకి తగ్గనినాదంయిస్తే ప్రజలు ముందుకొస్తారు సుమా!



# నిరంకుశుడు

ఆ రకం మనుష్యులు....

కాళ రాత్తిరి కన్న ! కడు భయానకమవ్వ
కూళ పనులకు వెను ! కాడంగ బోరు
వారి నీచాలనూ ! యెవరు గనరాకుండ
వారెట్టి పనికైన ! వొడిగట్టుతారు.

- పెరికిల్సు (షేక్స్‌పియర్)

❋ ❋ ❋

వొకనాటి రాత్రి తన ప్రయివేటు గదిలోని వొక మెత్తని పరుపుల కుర్చీలోకూచుని, జాగీర్దారు జగ్గారెడ్డి దిలాసాగా సిగిరెట్టు పీల్చుతున్నాడు. అతనేదో మందకొడిగా పైకి అగపడుతున్నప్పటికీ, అతని మనస్సు మాత్రం చాలా గడబిడగా వుంది. అతని పక్కకుర్చీలో వొక సీమకుక్క కూచుని, అటూయిటూ చూస్తోంది.

వొక మూలవున్న టేబిల్‌మీద కాంతివంతమైన వొక దీపంచుట్టూ - నాన్న తెచ్చిన కొత్తబొమ్మచుట్టూ పిల్లల్లాగా - ఆనందంతో యెగురుతున్నాయి. అసలాదీపంమీద ఆ పురుగులన్నీ కలిసి యుద్ధం ప్రకటించాయా అన్నట్లుంది. యెందుకంటే, ఆ దీపపు వేడిమికి ఆ పురుగులెన్నో చిమచిమ మాడిపోతున్నప్పటికీ, కొత్త పురుగులు యింకా ముందుకు దుముకుతూనే వున్నాయి, బూడిద అయిపోతూనే వున్నాయి.

జగ్గారెడ్డి ఆజానుబాహుడు; మనిషి చూపరిగావుంటాడు; యెర్రటి దుత్త లాంటి పెద్ద కళ్లు. భూస్వామ్య సమాజ పరిస్థితుల్లో అతను జీవిస్తున్నప్పటికీ, అతని మనస్సు మాత్రం బూర్జువా సమాజానికి తగినట్టిది. అదే అతనిలోని వైరుధ్యం.

అతని కింద కొన్ని గ్రామాలున్నాయి. ఆ గ్రామాల్లోని చాలా భూమి అతనిది. ధనిక రైతుల్ని మినహాయిస్తే, గ్రామస్తులకు స్వంతభూమి అనేది లేదని చెప్పినా విద్దూరంగాదు, వారంతా అతని కౌలుదారులు. ప్రతి యేటా అతను కౌలురేట్లని పెంచుతూ, రైతుల రక్తం పీల్చుతుంటాడు. మగతాకి యిచ్చిన భూములుగాక, అతనికి వేరే స్వంత వ్యవసాయం అంటూవుంది. ప్రతి కౌలుదారూ - పిలిస్తే ప్రతి మనిషీ - వచ్చి ముందు జాగీర్దారు వ్యవసాయం చేసిపెట్టాలి యే ప్రతిఫలమూ లేకుండానే.

స్త్రీలూ, కుక్కలూ, గుర్రాలూ, బ్రాందీ, నౌకర్లూ, చాకర్లూ ప్రధానంగా డబ్బూ అతనికి కావలసిన వస్తువులు, అవి వుంటే అతడు తన గాడిద వుంటే శాంకోపాంజా లోకాన్ని మరిచి పోయినట్లు యీ లోకాన్ని మరిచిపోయి బతగ్గలడు. అందువల్ల అతడే పనిచేసినా అది ఆ చెప్పిన వస్తువుల్ని పుష్కలంగా వుంచుకోటం కోసమే చేస్తాడు.

సంవత్సరంలో చాలా భాగం వాటికోసం - సుఖం కోసం - తాను బొంబాయిలోనో, హైదరాబాదులోనో గడిపినప్పటికీ, తన సింహాసనం కింద యేదో భూకంపం బ్రద్దలవ్వ బోతుందనీ, అది యే క్షణాన్నయినా బ్రద్దలయ్యి తననీ తన సింహాసనాన్నీ అత:పాతాళానికి తొక్కేస్తుందనే సామాన్య విషయం అతనికి తెలియకపోలేదు. అందువల్ల ఆ భూకంపం రాకుండా చేసేందుకు అతడు అన్నివిధాలా ప్రయత్నించేడు. కాని, అంతలోనే వచ్చిన రజాకార్ వుద్యమం చావబోయే ముసలి పులికి కోరలు మొలిచినట్లుగా అయింది....

ఖాసిమూ, పటేలూ గదిలోకొచ్చి, యెంతో అణుకువతో సలాంచేసి, నేలమీద కూచున్నారు. సీమకుక్క వారిని చూసి మొరిగి, కుర్చీ దిగకుండానే వీరెవరన్నట్లు జగ్గారెడ్డివంక చూసింది.

మనిషి ముందొకమాటా మనిషి వెనకాల మరొకపాట అన్నట్లుండే, మామూలు మాటామంచీ మర్యాదలూ సర్యాదలూ అయినాక, జగ్గారెడ్డి అసలు వ్యవహారం యెత్తుకున్నాడు.

“మనమిట్లాగే యికముందుగూడా చూస్తూవూరుకొంటే, యింకా మనం బతికే పనుందా? ఆ?”

“నిజమండయ్యా” అని పటేలు తనతల నాడించేడు.

“యేమిటో, అంతా చీకటి వ్యవహారంగా వున్నది. ఆ; అయినా మనం జంకగూడదు. మనం యేదో వొకటి గట్టిగా నిర్ణయించుకొని వాడిపని పట్టితీరాలి! యెవడూ? వాడా! తెలిసిందా? వాడూ - ఆ రామిరెడ్డిగాడు! యేంటిమరి?”

“చిత్తం”

“అసలు, వాడిమూలానే యిదంతా వచ్చింది. ప్రెతి దాంటోనూ వాడే! అటు ఆ మాలముండాకొడుకులకి - తన్నితే దమ్మిడీ చెయ్యని తొత్తుకొడుకులకి - యెక్కువ కూలీ అడగండిరా అని నూరిపోస్తున్నాడు, యిటు, రైతులకేమో తక్కువ కౌలుకి భూమి యియ్యమని అడగండని ప్రేల్తున్నాడు! ఆ? కనక వొక్కటే వున్నదిమార్గం. నేను మీకు నాలుగొందలు యిస్తా. కావాలంటే యింకా యెక్కువ తీసుకోండి. కాని, వాడిపని మాత్రం పట్టండి. వాడు చచ్చినవార్త నా చెవిని యెప్పుడు వేస్తారో అప్పుడే మీరు మొనగాళ్లు! అప్పుడే నాకు ఆనందం !! మీరు దేనికీ భయపడొద్దు. అందరూ మన చేతిలో వుండారు. అంతా - జిల్లా సూపరెండెంటు నుంచి మామూలు పోలీసోడిదాకా - అంతా - మన చేతుల్లో వుండారు. తెల్సిందా? మీకు వారంరోజులు గడువు యిస్తున్నా... తెలిసిందా? అదీ సంగతి! రామిరెడ్డి యిక యీ భూమ్మీద బతకటానికి వీల్లేదు...”

సరిగ్గా అదేసమయంలో “పిచ్చిపెద్దులు” దడాలున లోనికొచ్చి, తన దొరగారు అనిన చివరి మాటల్ని విన్నాడు. కాని అతని ముఖంలోమాత్రం ఏ మార్పు గూడా లేదు. పెద్దులు బయటకి వెళ్లినాక, పటేలు ముందుకువంగి పెద్దులు నమ్మదగ్గ మనిషేనా అన్నట్లు జగ్గారెడ్డి వంక చూసేడు.

"వాడిమొఖం వాడిదేముందయ్యా? వాడొక పిచ్చి ముండాకొడుకు. నేనిక్కడ వున్నన్నాళ్లూ నిమిషనిమిషానికీ నాచుట్టూ తిరుగుతూ వుంటాడు నాకేం కావాలిసొస్తుందోనని. అసలు, వాణ్ణి పిచ్చి పెద్దులంటారు నీకు తెలవదంటయ్యా? వాడంటే నాకు చాలాయిది. నా పెంపుడు కుక్కెంతో వాడు నాకు అంతా! తెలిసిందా? మరేంభయపడాల్సిన పనిలేదు...." అని జగ్గారెడ్డి అన్నాడు పక్క కుర్చీలోని సీమకుక్కని చేతితో నిమురుతూ.

# 2

జాగీర్దారుగారి దివాణంలో వెట్టిచాకిరీచేసే వాళ్లల్లో పెద్దులుగూడా వొకడు. లాంతర్లు తుడిచి వెలిగించటం, కుర్చీలూ మొదలైన వాటిమీద దుమ్ము దులపటం, దొరగారి బూట్లు పాలిష్ చెయ్యటం మొదలైనవి - అతని రోజు పనులు.

పెద్దుల్లాంటివాళ్లేగాక, ఆ నరకకూపంలో ఖాసాలు అనబడే తెగవారున్నారు. ఆ తెగలోని స్త్రీ పురుషుల్ని తన యిష్టంవచ్చినట్లు వుపయోగించుకునే సర్వాధికారం జాగీర్దారుకి వుంది.

పెద్దులు పూర్తిపేరేమిటో యెవరికీ తెలీదు, అసలు, తెలిసికోవాలన్నంత యిది యెవరికీ పట్టలేదుగూడాను. ప్రతి వారూ అతన్ని పెద్దులనో, పిచ్చిపెద్దులనో, పిలుస్తారు అంతే. అయితే అతని కెప్పుడున్నా గుబులురేగివున్నపుడు పిచ్చి పెద్దులని యెవరన్నా పిలిస్తే రుసరుసలాడతాడనే మాటమాత్రం నిజం. అసలతను పిచ్చి వాడిలాగానే కనిపిస్తాడు. అతని నడకా, అతని మాటలూ, అతని ముఖవైఖరీ - అంతాగూడా - వెర్రిగా, పిచ్చిగా అగపడతాయి. మరి అలాంటప్పుడతన్ని లోకులు కాస్త లోపం కనపడితే గంపంతచేసి మాటాడే లోకులు - అతన్ని పిచ్చి పెద్దులంటారంటే విడ్డూరమేమున్నది.

కాని, పైకి అగపడినంతగా అతను వెర్రివాడుగానీ, పిచ్చివాడుగానీ కాదు.

తన దొరగారి కఠోరపుమాటల్ని విన్న క్షణం నుంచి పెద్దులికి మనసు సరిగాలేదు. రామిరెడ్డి అంటే అతనికి ప్రత్యేకమైన ప్రేమ యేమీలేదు. ప్రజావుద్యమం యొక్క ప్రభావం యింకా అతనిమీద పడలేదుగూడాను.

ఐనా, నాంచారమ్మ తిరుణాలనాడు గంగిని రజాకార్ రౌడీల చేతులనుంచి రామిరెడ్డి తప్పించిన నాటినుండీ, రామిరెడ్డి అంటే పెద్దులకి వొక విధమైన గౌరవభావం యేర్పడింది. నిజమేమరి యీ "రగిడీసోల్లని" అలాయిష్టమొచ్చినట్లు వదిలేస్తే యింకా యేమన్నావుందా? ఆ పనిచేయటం మంచిదే. కాని, కౌలు రేట్లు తగ్గాలని అంటాడేమిటి? దొరగారి పొలాల్ని తన యిష్టం వచ్చినరేటుకి మగతాకి యిచ్చే హక్కు దొరగారికిలేదా? అంతే గాదు. దొరగారిభూముల్ని రైతులకి పంచాలని అప్పుడప్పుడూ రామిరెడ్డి అంటాడేమిటి? వొకరి సొమ్ముని యింకొకరికి యెందుకియ్యాలి? ఆ రెండు విషయాలు తప్పితే, రామిరెడ్డి చేసేదంతా పెద్దులకి నచ్చింది. యిక

పటేలు విషయంలో, పటేలు పచ్చి దొంగ! పటేల్ని, పట్వారీనీ విమర్శించాల్సిందే? కాని, దొరగారి భూమిసంగతిమాత్రం....

పనులన్నీ అయినాక, రాత్రి పొద్దుపోయినాక, పెద్దులు యింటికెళ్లేడు, కాని అతనికీ, యెంత తన్నుకొన్నా, నిద్రపట్టలేదు. ఆ మాటలు అతని చెవుల్లో యింకా రింగురుమంటూనే వున్నాయి. దొరగానికి యీ తుచ్ఛపుబుద్ధి యెలా పుట్టిందబ్బా!? యిదంతా దొరగారి పన్నుగడగాదు, యిది ఆ పటేలూ, ఆ "రగిడీసోడూ" ఆ యిద్దరి పన్నుగడ! అయితే దొరగారు అప్పుడప్పుడూ వాళ్లనీ వీళ్లనీ కొట్టిస్తాడనుకో పిలిపించి. అది వాళ్ల కౌలు యివ్వనప్పుడో, మరి అలాంటి మరొక కారణానికో చేయిస్తాడు, అందులో తప్పులేదు. కాని యీ కుట్ర మాత్రం ఆ యిద్దరిదే! ఇలా గూడుపుఠాణీ జరిగిందని పెద్దులు రామిరెడ్డితో పోయి చెబుదామనుకొన్నాడు. కాని, ఆ సంగతి చల్లగా దొరగారి చెవినిబడితే యింకేమన్నావుందా!? హమ్మో!?

మర్నాడు పెద్దులు మామూలు ప్రకారం పనిలోకి వెళ్లేడు. అతను యధాప్రకారంగా కనిపించాలని యెంత ప్రయత్నించినా "యుద్ధమూ, శాంతి" అనే టాల్‌స్టాయ్ నవలలోని బోల్‌కాన్స్‌కీ అనే ముసలి జమీందారులాగా అతను అగుపించక తప్పలేదు. అంతేగాదు. తనవద్ద యేదో పెద్ద నిధి నిక్షేపం వున్నట్లూ, దాన్ని కాజేయానికి చుట్టూ వున్నవాళ్లంతా యేదో కుట్ర పన్నుతూన్నట్లూ అతను అగుపించేడు. అతని ముఖవైఖరిలోనూ, చేతలలోనూ అంతభేదం వున్నప్పటికీ, అతను పిచ్చి పెద్దులు గాబట్టి యెవరూ గూడా ఆ విషయాన్ని పట్టించుకోలేదు.

నాలుగోనాడు, జాగీర్దార్ బొంబాయి వెళ్లినాక, పెద్దుల్లో వొక్కసారిగా కళాకాంతులు ప్రవేశించినాయి. ఇక రామిరెడ్డి వద్దకుపోయి ఆ సంగతి అతనికి చెప్పాలని నిశ్చయించుకొన్నాడు. యింటికిపోయి పిల్లల్ని చూసొస్తానని "దొరసాని"తో చెప్పి, మధ్యాన్నం కాడే అతను బయలుదేరేడు.

బజార్లో అడుగుపెట్టినాక జైలునుంచి విడుదలయ్యి జైలుగేటు దాటిన తర్వాత కొత్త ఖైదీ నిట్టూర్పు విడిచేట్లు - పెద్దులు వొక నిట్టూర్పు విడిచేడు. ఆ కలిగిన వుత్సాహంతో వుల్లాసంతో, కాళ్లీడ్చుకొంటూ కాళ్లసందునా వెనకా దుమ్మురేపే తన మామూలు మోటునడకను ప్రారంభించేడు.

అలా పోతుండగా, వున్నట్టుండి అతన్నెవరో పిలిచేరు. పెద్దులు చచ్చేంత అదిరిపడ్డాడు! ఆ పిల్చింది ఆ గ్రామపట్వారీ. పట్వారీ చాలా యోగ్యుడు; మునీశ్వరుడిలాంటివాడు. అతను కుడిచేత్తో వేదాంతం చెబుతూ లంచాలకోసం యెడమచెయ్యిని వెనక్కిచాపుతాడు! పటేలుకి మల్లే యీ పట్వారీగూడా తోడేలులాంటి సాధుజంతువే అయినప్పటికీ, యే యింట్లో యేమిజరుగుతున్నది మొదలైన విషయాలు ఆరాతీసే అణంగి స్వభావం అతనికున్నది. అందుచేతనే పట్వారీ పెద్దుల్ని కేకవేసి పిలవటం జరిగింది.

ధ్వని వచ్చిన దిక్కుకి దక్షిణంవైపుకి చూసి పెద్దులు శకునపక్షిలాగా వస్తోన్న పట్వారీని గుర్తించేడు. చూడగానే అతని జుట్టు నిక్కబొడిచింది.

"యెక్కడికోయ్ వేళగాని వేళలో పోతున్నావూ?" అని, దొంగచాటుగా ఓ చిటికెడునస్యం యెగబీకుతూ, పట్వారీ అడిగేడు.

అమ్మ ముండాకొడుకూ! తనవద్దవున్న రహస్యాన్ని వాసనపట్టేడా యేమిటి? పెద్దులు భయంతో వణికిపోయేడు. కాని యితనలా వణకటం పొడుంపీల్చుతున్న పట్వారీ గుర్తించలేదు.

"యేమిటి ఆలోచిస్తున్నావ్?" అని పట్వారీ మళ్లీ అడిగేడు.

"యింటికెల్తన్నా నండయ్యా"

"యెందుకూ?"

"యింటికెల్తన్నా నంటే యెందుకేంది? యింటి కెల్లగూడదా?" అని పెద్దులు విసుకున్నాడు.

పెద్దులు కులానికి చాకలీ, పట్వారీలాంటి దొరల చేతుల్లో లొంగి వుండాల్సిన మనిషీ అయినప్పటికీ, అతను ముఖ్యంగా దివాణంలో మనిషి, పెద్ద దొరగారి పనిమనిషి. యిలాంటి వాళ్లని యెందర్ని చూశాడో! అందువల్ల, మామూలు ప్రజల్లాగా వణికిపోకుండా, పెద్దులు ధైర్యంగా విసుక్కున్నాడు. దాంతో పట్వారీ తగ్గేడు.

'అదేంమాటలే. వూరికినే అడిగాలే. సరేగాని... పెద్ద దొరగారు యింటివద్ద వున్నారా!'

"అదుగో ఆ సంగతులే అడగొద్దన్నది!" అని పెద్దులు ఇంకా ధైర్యం చిక్కబట్టి అన్నాడు.

దాంతో యిక లాభంలేదనీ, యింకా కదిలిస్తే దొరగారితో అతుకులు చెబుతాడనీ భయంతో పట్వారీ వస్తానంటూ జారుకొన్నాడు.

"హు. నీ యాటలు నాదగ్గిర గాదియ్యో. అల్లా నోర్లేని జనందగ్గిర సాగాల్సిందే!" అని, పోతూన్న పట్వారీని చూసి, పెద్దులు అనుకొన్నాడు.

పెద్దులు యిక అక్కణ్నుంచీ సరాసరి సుబ్బారెడ్డి యింటికెళ్లేడు. యింట్లో మంగమ్మా, ఆమె తల్లీ మాత్రం వున్నారు. అతను గడపమీద నుంచుని, చేతుల్తో దరవాజాలను పట్టుకొని, లోనికి వంగి, యిలా అడిగేడు.

"రామయ్య, వుండాడా, దొరసానీ?"

"లేడు" అని మంగమ్మ యాదాలాపంగా అంది. రాట్నం వడుకుతూవున్న ఆమెతల్లి, తల యిటుతిప్పి, యీ "దొరగారికి తొత్తు"ని చూసింది, చూడగానే ఆమె ముఖ కవళికలు మారినాయి. అతని మీదనే దృష్టి నిలిపి, యేదో పరీక్షగా చూస్తూ, ఆమె యిలా అడిగింది.

"రామయ్యతో నీకేంపని?"

"వూరికే అడిగా, దొరసానమ్మా, మరేమంత పెద్ద పనిగాదులే...''

పెద్దులు అలా సూటిగా జవాబు చెప్పకుండా, రామిరెడ్డిని గురించి అదేపనిగా అడిగి హఠం వేసుక్కూచోగా, ఆమె అటూ యిటూ వూగిసలాడి, చివరికెలాగైతేనేం అరణ్యాం అవతల వున్న రామన్నగూడెం వెళ్లాడనీ, సాయంత్రానికిగాని తిరిగి రాడనీ చెప్పింది.

అది విన్నాక పెద్దులు వెళ్లిపోయేడు. అతనటుపోగానే మంగమ్మ తన తల్లిని ఆ సంగతి యీ "తొత్తు''కి యెందుకు చెప్పావంటూ కూకలేసింది. పెద్దులు దివాణంలో మనిషయ్యె, కాలం బాగా లేదయ్యె, తనకి తెలవదంటే పోయేదిగా!

అలా చెప్పగూడదనీ, తానుచేసింది తప్పనీ, మంగమ్మ తల్లికి మనసులో పీకుతున్నప్పటికీ, పైకిమాత్రం, "అందులో యేముందిలే, పిల్లా....'' అంటూ తననితాను సమర్థించుకొన్నదామె.

మనసులో గింజులాటగా వున్నప్పటికీ, పెద్దులు చులాగ్గానడుస్తూ అరణ్యాంవేపు బయలుదేరేడు. అవును మరి, యింత దూరమూ, వచ్చి వెనక్కి యెందుకు తిరిగెళ్లాలీ?

త్వరగానే అతడు అరణ్యాం వద్దకి చేరుకొని, అన్ని దిక్కులూ చూసేడు. యెవరూలేరు. దూరంలో, అతని వెనకాల, కొండలవద్ద వున్న పైరులు తమ శిరోభాగాలు అస్తమించుతూన్న సూర్యుని బంగరు కాంతిలో మెరుస్తుండగా ఆనందంతో చిరునవ్వు నవ్వుతూన్నట్లున్నాయి. యే నిర్ణయానికీ రాలేక, పెద్దులు అక్కడే కాసేపు నుంచుని, తర్వాత గబగబా పోసాగేడు. పక్షుల కీచుకీచు ధ్వనులు తప్పితే మరేధ్వనీ వినరాటంలేదు. అరణ్యాంలో వెచ్చగా వుంది. అదోరకమైన అరణ్యపు వాసన అతని ముక్కుపుటాల్ని సోకింది.

కొంతదూరం పోయినాక, యేవో వింతగొలిపే గుసగుసలు అతనికి వినపడ్డాయి. యేమిటా గుస గుసలు? హంతకులవా? తనలో కలిగిన భయాన్నీ ఆందోళననీ అణుచుకొనే ప్రయత్నంలో అతను పళ్లని బిగబట్టేడు. వాళ్లు తనమీద పడతారేమో!

అతను యింకా కొంచెం దూరం మెల్లగాపోయి చూసేడు. వొకచోట, యేదో వస్తువుచుట్టూ వలయాకారంలో కూచునివున్న మనుషులు కొందరతనికి అగపడ్డారు. వారిలో పాపన్ననీ, వీరన్ననీ అతను గుర్తించేడు.

అంతలోనే, హఠాత్తుగా, అందులో వొకరు తలయెత్తి యిటు చూసేరు, పెద్దులు చప్పున వొక పొదమాటున నక్కేడు.

అతనికేమీ వినరావటం లేదు.

కొంతసేపటికి యెండు టాకుల గర గరధ్వని వినవచ్చింది.

"యెవుడ్రాడూ?'' అని యెవరో బిగ్గరగా అరిచేరు.

చచ్చాన్రాబాబూ అనుకొన్నాడు పెద్దులు. భయంతో దిమ్మరగొనిపోయి, దడ దడలాడిపోతూ, పెద్దులు తటాలున నుంచుని హఠాత్తుగా నిద్రలేచినవాడు దీపాన్ని చూసినట్లు కళ్లు ఆర్పుతూ ఆ వ్యక్తివంక చూసేడు. ఆ వచ్చినవాడు పాపన్న!

"యేందిరా, లంజాకొడకా, యీడుండావూ?" అనడిగేడు పాపన్న.

పెద్దులికి యింకా భయమెత్తింది, యేమిచెప్పాలో యేమిచెయ్యాలో తోచలేదు, పారిపోటానికి ప్రయత్నించేడు.

కాని పాపన్న తనచేతిలోని కర్రతో బెదరించుతూ, అతను పారిపోకుండా ఆపేడు.

నలుగురు మనుష్యులు అందులో వీరన్న గూడా వొకడు - సర్రున పరుగెత్తుకొచ్చేరు. అప్పుడు పాపన్న ధైర్యంతో పెద్దులు పిలకని లంకించుకొని రెండువూపులు వూపి యిలా అన్నాడు.

"యెందుకుండావురా యీడనువ్వూ? ఆ?"

తక్కినవాళ్లు తలావొక బూతూ వుపయోగిస్తూ, తలా వొకగుద్దూ గుద్దేరు.

"శెపతా... అంతాజెపతా... కొట్టబాకండి..." పెద్దులు మొరబెట్టుకొన్నాడు.

అత్త కొట్టినందుకుగాక తోడుకోడలు నవ్వినందుకు యేడ్పొచ్చినట్లు, దెబ్బలు పెట్టే తీపులుకిగాక మాలవానిచేత దెబ్బలు తినాల్సి వచ్చినందుకు పెద్దులకి మంటతో కన్నీళ్ల పర్యంతమైంది!

తమ వేటతో సంతృప్తిపడి, తామేదో ఘనకార్యం సాధించిన వాళ్లకి మల్లే పొంగిపోతూ, యింకా బూతులు ఆపకుండా తిడుతూ, అతన్ని నడవమని పొడుస్తూ, వారంతా యిదివరకి కూచున్న చోటికి తీసుకొచ్చేరు.

అక్కడవున్న భయానకమైన దృశ్యం చూసేసరికి, పెద్దులు డీలా పడిపోయి నేలమీద కూలబడ్డాడు తక్కినవాళ్లు తమకి తెలీకుండానే అతని చేతుల్ని వదిలిపెట్టగా.

రామిరెడ్డి స్పృహలేకుండా, అక్కడ, భూమిమీద పడివున్నాడు. అతన్ని నజ్జు నజ్జుగా కొట్టేరు హంతకులు. అతని బట్టలు రక్తంతో తడిసివున్నాయి. నల్లగావుండే రక్తపు మరకలు అతని మెడమీదా, ముఖంమీదా, భుజాలమీదా వున్నాయి. అతని నుదుటమీద రంధ్రం వేసినట్లుగా వొక పెద్ద గాయంవుంది, వొకమనిషి తడిబట్టతో అక్కడక్కడా వొత్తుతున్నాడతన్ని.

కొంతసేపటికి రామిరెడ్డి మెల్లగా కళ్లు తెరిచి వారివంక తీక్షణంగా తేరిచూసేడు.

"మేమే, దొర్రా." అన్నాడు పాపన్న.

"ఆ లంజకొడుకుల్లో వొకణ్ణి పట్టేశినం. యీడుగో..." అని వీరన్న తనవేల్తో పెద్దుల్ని చూపేడు.

"హా.. అబ్బా..." అంటూ రామిరెడ్డి వొకపక్కకి వొత్తిగిల్లి, "పె...ద్దు...లు..."అన్నాడు.

"నేనే, దొరా...."

"యేం, దొరా, యీడు తముర్ని.... "' అని పాపన్న వింతగా రామిరెడ్డివంక చూసేడు.

"వుహూ... కాశీమూ... యింకా... యింకా కొంత మందీ... నన్ను ... యింటికి తీసుకు... పదండి... హబ్బా...."

అతన్ని యింటికి తీసుకుపోయే సమస్య విషయంలో వారందరికీ భయంగా వుంది. జాగీర్దారు చెవిని యీవార్త తాము రామిరెడ్డిని యిల్లు జేర్చామనే వార్త పడితే వారికేమీ పాలుపోలేదు.

"దణ్ణాలు, దొరా..." అని పెద్దులుచెప్పి, చల్లగా అక్కణ్ణుంచి జారుకొన్నాడు.

"యేందయ్యా వటవట వణుకుతరూ? మనమేమన్నా ఆడోండ్లమా యేంది? మగోండ్లంకాదా? అంతగా ఆడు యింటే యిననియ్యి. యింకా నాలుగు దెబ్బలు తిందం. అంతేనా? అంతకన్న యింకేంచేస్తడు? ఆ? వుండండి మీరీడ. నే బోయి సుబ్బారెడ్డిగార్తో శెపతా... రామయ్యగోర్ని మాత్రం జాగర్తగా జూడాలిసుమా! ఆ!" అని చెప్పి పాపన్న వూరివేపు విసవిసా నడిచిపోయేడు.

కొంతసేపటి తర్వాత అతనూ, సుబ్బారెడ్డీ యింకా కొంతమంది చుట్టాలూ కలిసివచ్చి, రామిరెడ్డిని మంచంమీద కట్టుకొని తీసుకొనిపోయేరు.

వీరన్నా వాళ్లూ భయంతో తలావొక దోవనే గూళ్లకి చేరుకొన్నారు.

## 3

కొండారెడ్డి ఈదారుణ వార్తని వినగానే వుబ్బసపు రోగిలాగా యెగరొప్పేడు, మ్రాన్పడిపోయి కొద్దిసేపటివరకీ పిచ్చివాడిలాగా చూసేడు. మమ్మూసాహెబు తన పక్కన ఆ సమయంలో కూచుని వుండకపోతే, ఖాసింని యెన్నిబూతులు తిట్టాలో అన్నీ తిట్టేవాడు.

అంతా నిశ్శబ్దంగా వున్నారు.

అందరి చూపుల్లోనూ భయం, బాధా, ద్వేషం కనపడుతున్నాయి.

"యిదంతా యినాశనానికొచ్చిందసలు!" అని అరిచి తన పిడికిల్తో మంచపుపట్టెని బాదేడు కొండారెడ్డి.

"నిజం, మామా.... పాపం! యెవరితోనూ తగూలకి వచ్చేవాడుగాదు... మనం పలక్కపోయినా నవ్వుతా పలకరించేవాడు... అయినా, అనగూడదుగాని, ఆ సదువుకొన్న

పిల్లగాడికి యీ సంగం గొడవ యెందుకుశెప్పు!" అని కోటమ్మ అన్నది.

"సదువూ గాడిదగుడ్డానూ!" అని ముసలాడు బొబ్బరించేడు. "అసలు నువ్వెప్పుడూ పదువు సదువని కొట్టుకొంటావు! ఆ పిల్లగాడు చేసిన తప్పేంది? సంగం తప్పేంది?ఆ. వొట్టిపుణ్ణేనికి వొక బుద్ధిగల పిల్లగాడ్ని యెవురోకొడితే, అదేమిటని అనకుండా, పైగా సంగమనీ, శింగినాదమనీ అంటావా? యేం? సంగం తప్పేందీ, అసలొకదాంటో తప్పేందీ?......"

అని కొండారెడ్డి ఆగ్రహంతో వొళ్లంతా వూగిపోతుండగా గాండ్రుపెట్టి, మమ్మూవంక కొరకొర చూసేడు.

"విన్నావా, అమ్మీ. పాపం, ఆ పిల్లగాడు చచ్చిపోయాడంట... నిజమేనా?......" వాండ్లంతా యేడుస్తున్నారు... పోయి చూసొద్దాంరా..." అని పొరుగింటి సుబ్బ లోనికొచ్చి పలికి, యెవరూ మారుపలక్కపోయేసరికి బేటికిపోయింది.

వొక మూలని నుంచునివున్న సీత, రామిరెడ్డి గురించి ఈ మాట వినగానే మొదలు నరికిన చెట్టులాగా కింద కూలిపోయింది. కోటమ్మ చప్పున లేచి కూతురు వద్దకి పరుగెత్తి యేడ్వసాగింది.

మమ్మూ తలవంచుకున్నాడు. రెండు పెద్ద కన్నీటి బిందువులు అతని వొడిలో పడ్డాయి.

"వుహూ.... ఆ లంజాకొడుకునీ సంపేస్తా... సంపీ రఖతం తాగుతా..." అంటూ పిచ్చెత్తిన వాడిలాగా అరిచి మమ్మూ గబగబా బేటికెళ్లేడు.



# భయంకర భూతం ! !

వాడి చావుని కోరుతో
వేడిగుండెల హోరుతో
భూకంపం బ్రద్దలయ్యెను
భూలోకం గ్రద్దరించెను
భూతలోకం మండుచున్నది
భూతప్రేతా లరచుచున్నవి
మునులు ప్రార్థన జేయుచున్నారు
కనుల మంటలు రగులుచున్నవి....

- మూడవ రిచర్డు నాటకంలో మార్గరెట్ రాణి (షేక్స్పియర్)

❋ ❋ ❋

అతని వంతు వచ్చినపుడు వొకనాడు రంగారెడ్డి జాగీర్దారు సమక్షానికి పిలిపించబడ్డాడు. ఆ ఆజ్ఞ వినగానే రంగారెడ్డి భయంతో బిర్ర బిగుసుకు పోయినట్లయ్యాడు. అతని గుండె దిగజారిపోయింది.

జాగీర్దార్ నౌకరు యింటికివచ్చి రమ్మన్నారని పిలచినప్పట్నుంచీ కొడుకు వాలకం కనిపెడుతూన్న ముసలాడు కొడుకువంక మిరి మిరి చూసి కాండ్రించి వూసేడు, "పిరికి.... ముండా... కొడాకా...ఛీ.." అని ఆయన అతి అసహ్యంతో అనుకున్నాడు.

కాళ్లు చిక్కబట్టినట్లుగా భారంగా నడుస్తూ రంగారెడ్డి జాగీర్దారు వద్దకి వెళ్లేడు.

యెప్పటి మాదిరిగానే, ఖాసిమూ, పటేలూ అక్కడ నేలమీద కూచుని వున్నారు. రంగారెడ్డి తమ్ముడు సత్తిరెడ్డి గూడా అక్కడ వున్నాడు. చలికాలంలోని లంకణాల రోగికి మల్లే ముఖంలో కళాకాంతులు లేకుండా, వణికిపోతూ, రంగారెడ్డి లోనికొచ్చి, జగ్గారెడ్డికి నమస్కారంచేసి చేతులు కట్టుకొని నుంచున్నాడు.

టేబిల్‌మీద దర్జాగా కాళ్లు పడేసి కుర్చీలో దర్పంగా కూచున్న జగ్గారెడ్డి నమస్కారానికి తిరుగు నమస్కారం చేయకుండా దీర్ఘాలు తీస్తూ యిలా అన్నాడు.

"యెందుకు పిలిపించానో తెలుసా?"

"తెలవదు దొరగారూ." అని రంగారెడ్డి గబుక్కున అన్నాడు. తెలవదంటే యేదో బాధ తప్పుతుందా అన్నట్లు.

"ఆయ్!" అని జగ్గారెడ్డి రాగంతీస్తూ తల రంగారెడ్డి వేపు తిప్పి, "తెలవకపోతే తెలిసేట్లు చేస్తానుండు!" అని అన్నాడు బిగ్గరగానవ్వి, చేతివేళ్లతో టేబిల్ మీద కొడుతూ.

"నేన్నీకు యిదివరకి అమ్మిన పొలంలోంచి తక్షణమే కాళీజెయ్యి! తెలిసిందా?" అని, తాగుబోతులాగా కనుగుడ్లు తిప్పుతూ, హఠాత్తుగా అతడు భోక్కురుమన్నాడు.

"అయ్యా.... మేము..."

"యేమిటీ!?" అని కుర్చీలోంచి సగం లేస్తూ, జగ్గారెడ్డి తిరిగి ఘయ్యిమన్నాడు, ఆ కేకకి పటేలూ, సత్తిరెడ్డి హడులుకొన్నారు.

"పిచ్చ పిచ్చగా ప్రేలమాక! యెవరితో మాట్టాడుతున్నావో తెలుసా?"

"అయ్యా.... మేము బీదోండ్లం..."

"ప్రేలమాక!అంతే!"

"నీకాళ్లకి మొక్కుతా... మీ బానిసని...."

"అయ్యగారు అడిగేదానికి జవాబు చెప్పు, రంగారెడ్డీ." అని పటేలు పలికి, చూశారా నేను తమరికి యెంత నమ్మకమైన నౌకర్నో అన్నట్లుగా, జగ్గారెడ్డి వంక బానిస నవ్వునవ్వేడు.

"నువ్వుండవోయ్. అతన్నే చెప్పనియ్యి." అని జగ్గారెడ్డి అన్నాడు.

"భూమిని యివ్వలేను, దొరగారూ..."

"యేంటీ? యెవరిముందు ఆ మాట అంటున్నావో తెలుసా?" పటేలు మరొకసారి తన బానిస బుద్ధిని ప్రదర్శించేడు.

"మాట్టాడమాకమని చెప్పలేదోయ్ నీకూ?" అని జగ్గారెడ్డి పటేలువంక వురిమిచూసేడు.

"అయ్యగారూ. నేను మీ బానిసని.... మీ పాదాలకి మొక్కుతా..."

జగ్గారెడ్డి ఆగ్రహంతో మండిపోయి ఖాసిముకి సైగ చేసేడు. ఖాసిం తన కొరడాతో రంగారెడ్డిని ఫెళ్లు ఫెళ్లున బాదసాగేడు. కొరడా మోత ఛెళ్లు ఛెళ్లుమని ఆ గదిలో మార్మోగింది. అదేమ్మని రంగారెడ్డి పెదిమ కదపనూలేదు, నొప్పితో మూల్గనూలేదు. ఆ కొట్టబడేది తన శరీరం కాదన్నట్లుగా రంగారెడ్డి వూరుకొన్నాడు. సత్తిరెడ్డికి యిదంతా చూస్తూంటే, తన అన్నని తన కళ్లయెదటే యిలా కొట్టటం చూస్తే ఆవేశమెక్కింది. దడాలున అతడు లేచి ఖాసిం చేతిలోని కొరడా లాగివేసి, జాగీర్దారువంక దిరిగి,

"యీ తప్పు క్షమించండయ్యా...." అని అన్నాడు.

రంగారెడ్డి ఇంతవరకూ తిన్నదెబ్బలు జగ్గారెడ్డికి సంతృప్తి గలిగించాయల్లే వుంది, సత్తిరెడ్డి కొరడా లాక్కుని ఆ మాటలనగానే, వూరుకోమన్నట్లు, జగ్గారెడ్డి ఖాసిముకి సైగచేసేడు.

"కుదిరిందా తిక్క? యిక పద పోయి చేలోంచి నడువు బయటికి. యిక పిచ్చ పిచ్చగా ప్రేలమాక!" అని జగ్గారెడ్డి ముక్కుతో పంది గుర్రుపెడుతూ, తన చేతివేలిని ఝుళిపించేడు.

నెత్తిమీద యేదో చాలాబరువు యెత్తుకొన్నట్లుగానో, లేక, చాలా వెడల్పున వుండే

ఇసుకరేవులో నడుస్తున్నట్లుగానో యెంతో ప్రయాసతో నడుస్తూ రంగారెడ్డి యిల్లు చేరుకొన్నాడు. దెబ్బలతో వాతలుబడి వాచిపోయివున్న అతని శరీరాన్ని చూడగానే కోటమ్మా, సీతా పెద్దపెట్టున యేడ్వసాగేరు. దెబ్బలు తినేటప్పుడు వీసమంతైనా అబ్బా అని అనని రంగారెడ్డి, తన భార్యా కూతురూ కన్నీరు కార్చటం మొదలెట్టగానే, హృదయం ఆగక తానుగూడా పసిపిల్లవాడిలాగా భోరుమని దు:ఖించేడు.

"ఆణంగి ముండాకొడకా!" అంటూ యిది చూసి ముసలాడు మంచంలోంచి తిట్టేడు. "యెందుకురా యేడుస్తవూ? మగాడివిగాదు? ఆ దెబ్బలు తిన్నాక యింకా యేమొకం పెట్టుకొని యింటి కొచ్చినవురా? ఆ యేట్లో దూకి సస్తే పేరూ పరువూ వుండేది గదరా! ఆణంగి ముండాకొడకా..."

## 2

తాను పెంచిన కౌలురేట్లని వొప్పుకొనమనీ, తానమ్మిన భూమిని తిరిగి తన స్వాధీనం చెయ్యమనీ, జగ్గారెడ్డి ప్రజల్ని అతిక్రూరంగా పీడించుతున్నాడు....

వరసాగ్గా నాలుగు రోజులపాటు, ఆగ్రామంలో చాలా యిళ్లనించి యేడ్పులూ మూల్గులూ వినవచ్చేయి.

ఇక్కడొక రైతు దెబ్బలుపెట్టే తీపులకి భరించలేక ఆవురుమన్నాడు. అక్కడొక గాయంనుండి నెత్తురు జుమ్మని ప్రవహించింది.

ఇక్కడొక తల్లి తన రొమ్ములు బాదుకొని జుట్టు పీకుకొన్నది, అక్కడొక పసిబిడ్డ తన తండ్రి వొంటిమీద రక్తం చూడగానే కేరుమన్నాడు.

అందరూ అందర్నీ తిట్టేరు, శపించేరు.

జాగీర్దార్ని, పటేల్ని, పట్వారీని, తమ భర్తల్ని తమ భార్యల్ని, తమ పిల్లల్ని ఆఖరికి భగవంతుడ్ని అందరూ అందర్నీ తిట్టేరు!

కాని వొక్క రైతుగూడా జాగీర్దారు యొక్క బెదరింపులకీ, దెబ్బలకీ లొంగలేదు!

అందువల్ల జాగీర్దారు తన చేతిలోవున్న రజాకార్లనీ పోలీసుల్నీ ప్రజలమీదకి తోలేడు.

## 3

వొకనాటి రాత్రి - తుపానుచేతనా అన్నట్లు - సుబ్బారెడ్డి యింటి తలుపు పగిలి పెద్ద మోతతో నేలమీదపడింది.

మంగమ్మా, ఆమె తమ్ముళ్లూ మాత్రమే యింటివద్ద వున్నారు. అతి భయంతో వారు ముగ్గురూ అరుస్తూ పడకల మీదనుంచి లేచారు. వొక టార్చిలైటు కాంతి మంగమ్మ ముఖంమీద పడింది; ఆమె భయవిహ్వల అయింది.

ఆ వచ్చిందెవరు ?

యెవరోగాదు

రజాకార్లు !

పోలీసులు !

వాళ్లలో కొంతమంది యింట్లో జొరబడ్డారు.

కుండల్ని, మంచాల్ని పగల గొట్టేరు; విరగ్గొట్టేరు. బట్టల్ని చించిపారేసేరు.

ఇంట్లోవున్న మంగమ్మ తమ్ముళ్లిద్దరూ తమ అక్క చేతుల్ని పట్టుకొని భయంతో వణికిపోతూ బావురమన్నారు.

ఆమె వులకలేదు, పలకలేదు.

కొయ్యబారిపోయి నుంచుంది.

రెండు బలమైన చేతులు మంగమ్మ భుజాల్ని గట్టిగా పట్టుకొన్నాయి. అవి ఖాసిం చేతులు! పిల్లల్లో వొకరు ఆ చేతుల్ని లాగటానికి ప్రయత్నించేరు. ఆ పిల్లవాని ముక్కుమీద ఖాసిం బలంగా గుద్దేడు. ఇజ్‌మని నెత్తురు చిమ్మింది.

మంగమ్మ వదలించుకొన ప్రయత్నించింది. కాని, నిష్ఫలం. మరో యిద్దరు ఆమెని గట్టిగా పట్టుకొన్నారు; ఆమెని ఆ ముగ్గురూ ఆ చీకట్లోకి దూరంగా తీసుకొనిపోయేరు. వెంటబడుతూన్న పిల్లల్ని యెవరో వొక్క తన్ను తన్నగా వారు కెవ్వుమంటూ నేలమీద పడ్డారు. వొక ముసలి పోలీసు టార్చిలైటు వేసి చూసి "యెవర్రా, పాపం, వీళ్లని తన్నిందీ?" అంటూ గొణగుతూ, ఆ పిల్లల్ని లేవదీసి బయటికి చేర్చేడు.

హఠాత్తుగా యింటిమీద కొంతపొగా, ఆ తర్వాత నిప్పూ అగపడ్డాయి. చూస్తూండగానే ఆ నిప్పు భయంకరంగా చెలరేగి బ్రహ్మాండమైన మంటగా తయారైంది అగ్నిజ్వాలలు తమ భీకరమైన నాలుకలు సాచి టప టప మనిపించాయి; హోరుమని గర్జించాయి. ఆ పూరిల్లు నిప్పులోనిప్పులాగా చిటపట కటకట మన్నది; ఆ అగ్నిలో భారంగా మూల్గింది; అంతలోనే కుప్పకూలిపోయింది. ఆ భయానకదృశ్యం చూస్తూ రజాకార్లూ పోలీసులూ అరుస్తూ గంతులు తొక్కేరు.

"హిందూ బద్మాష్‌లు నశించాలి!"

తర్వాత వారు యింకొక యింటికి వెళ్లేరు.

తమవైపు కుంటుకొంటూ వస్తూన్న అక్కనుజూసి, పిల్లలు "అక్కా! అక్కా!" అని గోలకెత్తేరు.

ఆ నీచులామెని అతి క్రూరంగా చెరిచేరు. ఆమె జుట్టు విడివిడిపోయి జీబిరి జీబిరిగా

వుంది. ఆమె రవికా, చీరా చిరిగిపోయి పేలికలు వేలాడుతున్నాయి. కాళ్ళీడ్చుకొంటూ ఆమె నడుస్తున్నది.

"యాడ కెల్తున్నావక్కా? మనయింటెంకజాడు..." అని ఆమె చిన్న తమ్ముడు ఆవురుమన్నాడు.

ఆమె మారు పలకలేదు; వారివంక చూడనూలేదు.

"యేందక్కా? యేం జరిగిందక్కా? నోటంట ఆ నురుగేంటి? గుడ్డలు శిరిగివున్నయ్యేంటి? ఆ? యాడకెల్తున్నావక్కా? అక్కా! మన యిల్లుజాడు యేమైందో!" ఆ పిల్లలు గోడు గోడుమంటూ ఆమె చీరకొంగుని పట్టుకొన్నారు.

వెనక్కి తిరిగిచూడకుండా ఆమె నడుస్తూనేవుంది. చిన్నవాడు ఆమె కళ్లల్లోంచి నీరుకారటం చూసేడు.

"యెందుకక్కా యేడుస్తావు? యెవురు కొట్టారు?"

"యాడకక్కా? అదిగో మనయిల్లు దాటివచ్చాం..."

గ్రామం బయటికి వెళ్లినాక, తమ్ముళ్లిద్దర్నీ కౌగలించుకొని, ముద్దుపెట్టుకొని, యిలా అన్నది.

"పొండిబాబూ, యింటికి పొండి"

"అక్కా మన యిల్లులేదు. మరే వాండ్లు తగలేశినారు"

"పొండిబాబూ"

ఆమె యింకా ముందుకి పోతూనేవుంది.

"యెందుకక్కా, అటుబోతావు?"

వారు ముగ్గురూ నాంచారమ్మ నదివద్దకి చేరేరు.

నది నిండుగానేవుంది; విసురుగా, హోరుతో, భయంకరంగా ప్రవహిస్తోంది. మంగమ్మ నది వొడ్డుమీద నుంచుని మరోసారి తన తమ్ముళ్ళి కౌగలించుకొని, ముద్దుపెట్టుకొన్నది.

"వెనక్కిపొండిబాబూ, యింటికిపొండి"

"మన యిల్లు లేదక్కా!"

"మరి నువ్వు రావూ?"

"అక్కా! అక్కా ..... అక్కా!"

అంధకారంగావున్న ఆ నదిలో మంగమ్మ దూకింది. నది భూతంలాగా వికటాట్టహాసంచేసింది.

# 4

"భూమిని దొరగారికి యిస్తావా లేదురా?" అని గూండాలు రంగారెడ్డిని అడిగేరు, లాఠీలతో అతన్ని బాదుతూ.

"యివ్వను! కావాలంటే నన్ను సంపండి! అంతే; యివ్వను!" రంగారెడ్డి అరిచేడు.

ఇంట్లో వాళ్లందర్నీ బయటికి లాక్కొచ్చి చావగొట్టేరు వాళ్లు.

ఇదంతా చూసి కొండారెడ్డి సహించలేకపోయేడు. ద్వేషంతో అతను అగ్గిలాగా భగ్గుమన్నాడు.

హఠాత్తుగా వొక గొడ్డలి అతని తలపైన బడింది.

ఆ ముసలివాని తల రెండు వ్రక్కలయ్యింది.

రక్తం చిమ్మికొట్టింది.

మళ్ళీ యింకొక దెబ్బ

అతని తల తెగి భూమిమీద పడి దొర్లింది.

వాళ్లు ఆ యింటికి గూడా నిప్పంటించేరు; చూస్తుండగానే అది మండి బూడిద అయ్యింది.

అలా రాత్రంతా యిష్టంవచ్చినట్లు మృత్యునాట్యం తొక్కుతూ, కొంపలు చాలా తగలేసిన తర్వాత, బంగారం మొదలైనవి దోచుకొన్నాక, యెంతోమంది యువతుల్ని మానభంగం చేసినాక, ఆ రాక్షసులు వెళ్ళిపోయేరు.

"అయ్యో నాకూతురేది?" యేడ్చి యేడ్చి గొంతుబొంగురుపోయిన కోటమ్మ వొక్కసారిగా భోరుమన్నది.

సీత యెక్కడా కనపడలేదు.

వెతికారు, వెతికారు; యేమీ లాభంలేదు.

యేమయ్యింది?

రజాకార్లు ఎత్తుకొనిపోయారా ?

తర్వాత వారు కొండారెడ్డి యొక్క తెగిన తలనుచూసి మరోసారి తమ రొమ్ములు బాదుకొని, నేలమీదదొర్లి పొరలి పొరలి యేడ్చేరు.



# అనేక కంఠాలు; కాని, వొకటే స్వరం!!!

రగిలే యెండు గుండెలు
పగిలే రాతిబండలు
పగలగొట్టును జైలు గోడల్
తగలబెట్టును దోపిడీలన్

- "ఏ మిడ్ సమర్ నైట్స్ డ్రీమ్" లో బాటమ్ (షేక్స్పియర్)

❊ ❊ ❊

ఆ రాత్రి చంద్రకాంతిలో బహు కళాకాంతులుగా వుంది. పిండి ఆరబోసినట్లున్న ఆ వెన్నెల వొడిలో ప్రకృతి నిశ్శబ్దంగా నిద్రించుతున్నదా అన్నట్లుంది.

కొండలవద్ద మైదానంగావున్న ప్రదేశంలో, జగ్గారెడ్డి కిందవున్న అన్ని గ్రామాలనుంచీ దాదాపు రెండువందలమంది రైతుకూలీ ప్రతినిధులు సమావేశమయ్యారు. వారు తలలమీదా వొంటిమీదా చెడుకంపుగొట్టే ముతక దుప్పట్లు కప్పుకొని వున్నారు. చలిగా వున్నప్పటికీ ఆ వెన్నెట్లో వారికి హాయిగా వున్నట్లుంది.

వారంతా వలయాకారంలో దగ్గిర దగ్గిరగా కూచుని చుట్టలు తెగ తగలేస్తూ చెడ వూసేస్తున్నారు. ఆ వలయం మధ్యకీ వలయం బయటకీనూ, అందరూ కడుపుమంటతోనూ, అసహనంతోనూ భగ భగ మండిపోతున్నప్పటికీ కమ్యూనిస్టులకి మల్లే చాలా శిక్షణగా కూచున్నారు; ఆఖరికి, అతివాగుడికి అలవాటు పడిన ముసలాళ్లు గూడా అతినిశ్శబ్దంగా కూచున్నారు. మధ్య మధ్య ముసలాళ్లు తమ గొంతులు సవిరించుకొని యేమిటో మెల్లగా తమలో తాము గుసగుసలాడుకొంటున్నారు.

అక్కడ కొచ్చినవారిలో ధనిక రైతులుగూడా వున్నారు.

కోటిరెడ్డి యెక్కడనించో వచ్చి ఆ వలయం మధ్యలో వుమ్ములు పడనిచోట జాగ్రత్తగాచూసి కూచున్నాడు. అతనలా కూచోగానే అయ్యో యిలాంటి సమయంలో రామిరెడ్డి లేడుగదా అని ప్రతివారు విచారించేరు.

"పెద్దలారా, సోదరులారా!" అంటూ కోటిరెడ్డి ఆరంభించేడు. "మన మిక్కడ యెందుకు సమావేశమయ్యామో మీరంతా యెరుగుదురు... యీ రాత్రి మనం మన భవిష్యత్తుని నిర్ణయించుకోవాలి. యీ నీచుడు జాగీర్దారుకి మనం తలవంచియన్నా బతకాలి, లేదా ÷ యేంజరిగినా సరే మన భూములకోసం, మన హక్కులకోసం పోరాడాలి! యేమంటారు మరి?'

జవాబుగా అందరూ ఆగ్రహంతో హుమ్మన్నారు.

“ యీ భూములు మనయ్యి...” కొద్ది క్షణాల తర్వాత తిరిగి కోటిరెడ్డి యెత్తుకున్నాడు: “యీ భూముల్లో మన తాత ముత్తాతల కాలంనుంచీ మనం చెమటగార్చి చాకిరీజేశాం, అందువల్ల యీ భూముల్లో పండే పంటని అనుభవించే హక్కు మనకున్నది! వాణ్ని వాడి యిష్టంవచ్చినట్లు చెయ్యనియ్యండి; మనం మాత్రం అంగుళంగూడా మన భూముల్లోంచి కదలగూడదు యేమంటారు?”

“అవునవును, అందులోనే పుట్టినం; అందులోనే పెరిగినం; అందులోనే సద్దాం పట్టండి! యాలీ, యేంది వొకడికి భయపడేది?” అని వొక ముసలాడు అన్నాడు.

“అదేటప్పుడు వాడి పనిలోకి బోకండి కూలోండ్లు గూడ సమ్మె గడితే వాడి ఆవజీవాలు కుంగుతియ్యి!” అని వొక రైతు అన్నాడు.

ఆ తర్వాత కోటిరెడ్డి రజాకార్లకీ పోలీసులకీ వ్యతిరేకంగా నిలబడి పోరాడాల్సిన అవుసరాన్ని వివరంగా మాటాడేడు.

కాని, నాగయ్య కొక సందేహం పట్టుకొన్నది

“వాండ్లకి తుపాకులూ గిపాకులు వుండయ్యి. మనకేమీ లేవు. మరెట్టా వాండ్లతో పోరాడేది?”

“మనం వాళ్లమీద దొంగచాటు దెబ్బతీసి వాళ్ల తుపాకుల్ని వశంజేసుకోవాలి, అంతవరకూ మనం కారపు ముంతల్నీ, వడిశెల్లనీ వుపయోగించాల్సిందే”

“మరి విల్లంబులూ?”

‘వో. అది చాలా మంచి వుపాయం, అవును వాటిని గూడా వుపయోగించి తీరాలి. కాని వొక్క సంగతి, మనం స్త్రీల నెప్పుడూ అవమాన పరచగూడదు. ఆ స్త్రీలు మన శత్రువుల తల్లులూ చెల్లెళ్లూ అయినప్పటికీ . . . . తెలిసిందా? శత్రువుల దాడుల్ని మాత్రమే మనం యెదుర్కోవాలి. జాకార్లలాగానూ పోలీసుల లాగానూ మనం స్త్రీలని చెరచటం మొదలైన పనులు చెయ్యగూడదు.’ ని కోటిరెడ్డి చెబుతూండగానే, జాగీర్దారుయొక్క కడగొట్టు కొడుకైన నర్సిరెడ్డి పదహారేళ్ల వాడు క్కడికొచ్చేడు. అతన్ని చూడగానే అక్కడివారంతా గుస గుసలు ఆరంభించేరు.

ఆ పిల్లవాడు గుంపుకి కొంచెం దూరంలో - తప్పు చేసినవాడికి మల్లే - నుంచున్నాడు తులు వెనక్కి పెట్టుకొని, కోటిరెడ్డి అతనివంక చూసి చిరునవ్వు నవ్వి, తనవద్ద వచ్చి కూచోమని గజేసి, తక్కిన వారితో యిలా అన్నాడు.

“అనుమానించమాకండతన్ని, అతను మనలో మనిషే!”

దానిమీద యెవరూ యెదురు మాట్లాడక పోయినప్పటికీ - కుర్రతనపు వుద్రేకంతో తనకి యెదురుతిరిగి తాను వద్దని చెప్పిన పిల్లని పెళ్లిచేసికొంటానని హఠంవేసిన కొడుకుని చూసి తండ్రి యెలాగూ యిక లాభంలేదని పళ్లు బిగబట్టి నిట్టూర్పు విడుస్తాడో - అలా వారంతా నిట్టూర్పు విడిచేరు.

నర్సిరెడ్డి ఆ వలయంగుండా త్రోవచేసికొని వచ్చి కోటిరెడ్డి పక్కన కూచుని బెరుకు బెరుకుగా ఆ మనుష్యులవంక చూసేడు. అతని బట్టలనుంచి గుమాయించికొడుతున్న అత్తరు కంపుని యెగబీల్చుతూ వారంతా అసూయతో గుటకలు మింగేరు.

"సరే మళ్లీ అసలు విషయానికొద్దాం" అంటూ కోటిరెడ్డి తిరిగీ మొదలెట్టేడు. "మనం గుడ్డిగా యెదురుదెబ్బతీయకూడదు. కేవలం పగ సాధించే ధోరణిలో మనం పోరాడగూడదు. మనం భూమికోసం; భుక్తికోసం పోరాడుతున్నామని మీరు ప్రధానంగా గుర్తుంచుకోవాలి. అందువల్ల ఆ పోరాటంలో మనకి అడ్డం వచ్చిన వాటిని మనం పక్కకి నెట్టేస్తాం; ముందుకి సాగిపోతాం. మన పోరాటం ఖాసింమీదో, పటేలుమీదోగాదు. భూస్వామ్య వ్యవస్థమీదా, దోపిడిమీదా మన పోరాటం, అదే ప్రధానంగా మనం గుర్తుంచుకోవాలి... అయితే ఖూనీకోరుల్ని, ప్రజా వుద్యమ శత్రువుల్నీ మనం దయతలచగూడదు. అలాంటి విషయాల్లో ఆ సమయానికి తగ్గ నిర్ణయాలు మనం తీసుకోవాలి."

అలా అతను ప్రజా వుద్యమం యొక్క పోరాట స్వభావాన్ని గురించి విపులంగా మాట్లాడేడు. తన వుపన్యాసం ముగించేయబోతున్నప్పుడు రంగారెడ్డి వచ్చి యిలా క్షమాపణ చెప్పుకున్నాడు.

"సూడూ... యేమీ అనుకోమాక. నువ్వెరుగుదువు, మా అయ్యని... వాండ్లు.... అందుకుదోడు ... నాకూతురు సీతమ్మ యాడకిబోయిందో యేమయ్యిందో... యింటికాడ నానా యిదిగా వుండది... అందుకని పెందరాడి రాలేకపోయిన ... నువ్వేం శెబితే అది శేద్దాం... యింకా అనుమానమెందుకు.... నేను మోసపోయినా... సంగానికి దూరంగావుంటే నా బూములయ్యా లాక్కోరనీ నన్నేమీ శెయ్యరనీ అనుకొన్నా... కాని ... నాకు బాగా తెలిసొచ్చింది. సంగంతోనే బీదోండ్ల ముక్తి వుందని... మరి యేం తేల్సినరు?"

"భూమికోసం పోరాటం జరపాలని!"

"ఆఁ అదుగదీ సంగతి! అదీ సంగతి!! అంతే, ప్రేణాలు పోయినాసరే మనం వొక్క అడుగ్గూడ యెనకాడగూడదు!!!"

రంగారెడ్డిలో వచ్చిన మార్పునిజూసి కోటిరెడ్డి ఆశ్చర్య పడ్డాడు.

"ఓహ్! యెలాంటి మార్పు! ప్రజలొక్కసారి కన్ను తెరిచారంటే భయంకరంగా పోరాడుతారు సుమా!!" అని కోటిరెడ్డి అనుకున్నాడు తనలో.

ఆఖరికి వెళ్లిపోయేప్పుడు, నాగయ్య యిలా అన్నాడు కోటిరెడ్డితో

"అబ్బాయ్, నేను జెప్పేది యిను... మేము మీకు డబ్బు కావాలన్నా, బట్టలు కావాలన్నా, తిండి కావాలన్నా యేది కావాలన్నా యిస్తాం. కాని మీరు మాత్తరం ఆ లంజకొడుకుల శేతుల్లో పడమాకండి. పడ్డారా యిక మిమ్ముల్ని వాండ్లు బతకనియ్యరు... ఆ?...."

అవును, కోటిరెడ్డి... మా ప్రేణాలకంటే మీ ప్రేణాలు యెక్కువ విలువ! యెట్టాగంటే, మీరు లేకపోతే గొల్లలేని గొర్రెలకి మల్లే అవుద్ది మాపని'' సంగం బతికుంటే బూమి యియ్యాలగా పోతే రేపన్నా వసద్ది. మేము సూడకపోతే మా పిల్లలన్నా జూస్తారు...'' అని చాలామంది అన్నారు.

"అదేమన్నమాట? మాతోపాటు మీరుగూడా కత్తిబట్టి తయారవ్వాలి. అందరమూ పోరాడాలి...''అనికోటిరెడ్డి అన్నాడు.

"ఆమాట నిజమే. మేము వూరికినే శేతులుముడుసుకొని కూసుంటామా? అదికాదు మేమన్నది... దారిసూపే వాడు వొకడు వుండాలని మేమన్నం..'' అని నాగయ్య బదులు పలికేడు.

## 2

తుపాను వచ్చినపుడు సముద్ర కెరటాలు భీకర ఘోష పెట్టేట్లుగా గర్జించుతూ, గాండ్రించుతూ ప్రజా వెల్లువ వొక్కసారిగా పెల్లుబికింది.

వడిసెల్ ఛట్ మన్నది. రాయి విర్ మని దూసుకుపోయింది. విల్లు ఝుంకారం చేసింది; బాణము విజ్‌మని దూసుకొనిపోయింది. యీ రాళ్లవర్షానికీ బాణవర్షానికీ తట్టుకోలేక రజాకార్లూ, పోలీసులూ పెద్ద పెట్టున అంకమ్మ శోకాలు పెడుతూ తోక ముడవసాగేరు.

చాలా తుపాకులు ప్రజా గెరిల్లా దళాలు స్వాధీనం చేసుకొన్నాయి.

కొంతమంది గూండాలు గాయపడ్డారు; మరికొంతమంది చచ్చేరు.

పోలీసు నాకాల మీద దాడిజరిగింది; రికార్డులు తగలేయబడినాయి.

పటేళ్లూ, పట్వారీలూ బలుసాకు కోసం పరుగెత్తేరు.

జాగీర్దారు హడావిడిగా ప్రయాణం కట్టేడు.

భూమిని ప్రజలు వశంచేసి కొన్నారు.

అలా రెండు వేల గ్రామాలకి పైగా ఫ్యూడల్ దోపిడీ నుండి విముక్తి చేయబడినాయి.

పదిలక్షల యకరాలకి పైగా భూమి భూస్వామ్య రాక్షసుల నుండి వశంచేసుకోబడి కూలీ రైతులకి పంచి పెట్టబడింది.

గ్రామ పంచాయితీలు యెన్నుకొనబడినాయి. ఆ పంచాయితీల కిందే గ్రామ పరిపాలన సాగుతోంది.

కూలీలకి కూలిరేట్లు పెంచబడినాయి.

## 3

దొంగచాటుగా బొంబాయి పారిపోయేముందు జగ్గారెడ్డి తన చిన్న కొడుకు నర్సిరెడ్డిని చాటుకు పిల్చేడు. నర్సిరెడ్డి కమ్యూనిస్టు భావాలుకలవాడని తండ్రికి తెలుసు. అందువల్ల అతనికొక మాంచి ఆలోచన తట్టింది.

"నేను చెప్పేది బాగా విని, చెప్పిందిచెయ్యి. అంతేగాని అదీ యిదీ అని యెదురు చెప్పమాక. తెల్సిందా? మేము బొంబాయి వెళ్తున్నాము. ఎప్పుడు తిరిగొస్తామో చెప్పడం కష్టం. కాని, ఇంట్లో అందరమూ - యింటిని కుక్కలకి వదిలిపెట్టి - వెళ్లలేము. యెవరో వొకరు యిక్కడ వుండాలి. అందువల్ల యిక్కడ నువ్వువుంటే బాగుంటుందని అనుకొన్నా. యెందుకంటే కమ్యూనిస్టులు నిన్ను బాగా యెరుగుదురు. కనక నువ్వు యిక్కడవుంటే నీమీద అభిమానంచేత మన యింటికి యే నష్టమూ చెయ్యకుండా వూరుకొంటారు. అదీ సంగతి! తెల్సిందా? కనక యిక్కడ వుండి యింటిని జాగ్రత్తగా చూడు. నీతోబాటు పెద్దులూ వాళ్లూ వుంటారు. కమ్యూనిస్టుల్తో గలిసి నీ యిష్టంవచ్చినట్లు తిరుగు. కాని ఆ తొత్తు కొడుకుల్ని మాత్రం యింటో కాలుబెట్టనీయమాక! అదీ సంగతి! తెల్సిందా?...."

నర్సిరెడ్డి ఆ మాటలకి చాలా వుబ్బిపోయేడు. యెందుకంటే యిక కమ్యూనిస్టుల్తో గలిసి హాయిగా తిరగొచ్చు! అందువల్ల తండ్రి చెప్పిన దానికి సరేనని వొప్పుకొన్నాడు. జాగీర్దారు వెళ్ళేటప్పుడు యెంతకాలానికి తిరిగివస్తామో అసలు రామో, స్వగృహాన్ని వదిలిపోవాల్సి వచ్చిందిగదా అనే బాధతో అతనికి కన్నీళ్ల పర్యంతమైంది. అతన్ని చూసి "అయ్యగారూ! దొరగారూ!" అంటూ పిచ్చి పెద్దులు ఆవురుమన్నాడు.

## 4

వొకనాటి సాయంత్రం పిచ్చి పెద్దులు విశాలంగావున్న ఆ మేడ వరండాలో కూచుని లాంతర్లు తుడుస్తున్నాడు. నర్సిరెడ్డి మాక్సిం గోర్కీ వ్రాసిన "అమ్మ" పుస్తకం - తెలుగుది - చదువుతూ తన గదిలో కూచుని వున్నాడు.

పిచ్చి పెద్దులు, హఠాత్తుగా, "వో దొరో, శిన్న దొరో!" అంటూ లోనికి పరుగెత్తేడు.

"యేంటి పెద్దులు?" పుస్తకాన్ని చేతితో పట్టుకొంటూ నర్సిరెడ్డి అడిగేడు.

"వాండ్లొచ్చిౖను, వాడ్లొచ్చిౖను! యిగనేంవుండదు... యిగనేం వుండదు!" అని పెద్దులు రొప్పుతూ రోజుతూ, రొమ్ము బాదుకొంటూ, అన్నాడు.

"యేమిటి జీలకర్ర? యెవరొచ్చారు? యేమిటి గోల!" అని నర్సిరెడ్డి విసుక్కున్నాడు చిరుకోపంతో.

"వాండ్లు! వాండ్లు!!"

"యేమిటావాగుడు! యెవరొచ్చారు??"

"అంతా... అంతా... వచ్చిౖను"

ఇక వీడితో లాభంలేదని నర్సిరెడ్డి చేతిలోవున్న పుస్తకంతో సహా వరండాలోకొచ్చేడు. పెద్దులు అతని వెనకాలే వొచ్చేడు.

వందలకొద్దీ ప్రజలు మేడముందున్న విశాలమైన మైదానంలో చేరి వున్నారు. వారిలోంచి కోటిరెడ్డి యింకా కొంతమందీ యిటువస్తున్నారు.

కొంతసేపటివరకీ, యిదంతా యేమిటో అర్థంగాక, నర్సిరెడ్డి నిలబడ్డాడు. కాని, కోటిరెడ్డి వచ్చి తన ప్రక్కన నుంచోగానే అతనివంక చిరునవ్వు నవ్వేడు. ఆ యిద్దరూ నవ్వుకోటం చూసి అనుమానంతో ఆందోళనలో పిచ్చిపెద్దులు వొకసారి తన చిన్న దొరవంకా మరొకసారి కోటిరెడ్డివంకా చూస్తూ నిలబడ్డాడు.

"యీ మన ప్రజలంతా యీ మేడని నేలమట్టం చెయ్యాలనే తలంపుతో యిక్కడికొచ్చారు!" అని కోటిరెడ్డి నిలబడివున్న ప్రజలవంక తన చేయి చూపుతూ, కుండ పగలగొట్టినట్లు మూడు ముక్కల్లో అసలు సంగతిని నర్సిరెడ్డికి చెప్పాడు.

అందుకు తన చిన్నదొర యేమి సమాధానం చెబుతాడోనని నోరుతెరచి, వూపిరిబిగబట్టి, పెద్దులు నర్సిరెడ్డి వంక చూస్తున్నాడు.

"మంచిదే! నేను కాదంటానా? నేనూ మీలో వొకణ్ణి. వెంటనే యీ దెయ్యాలకొంపకి నిప్పు ముట్టించండి!" ప్రజల యొక్క ముఖాలలో ద్వేషం, నిశ్చయత్వం చూసి తన హృదయం వుప్పొంగుతుండగా నర్సిరెడ్డి అన్నాడు.

"అయిపోయింది! అంతా అయిపోయింది!!" అంటూ పిచ్చి పెద్దులు పిచ్చికేకలేస్తూ, రొమ్ము బాదుకుంటూ, బజార్లోకి పరుగెత్తాడు.

ప్రజలకి కోటిరెడ్డి చేత్తో రమ్మని సైగజేశాడు; వారంతా కట్టతెగిన యేరులాగా - వొక్కసారి ఆ మేడలోకి విరుచుకు పడ్డారు.

"ఆరి లంజకొడకా! యెంత కమ్మగా వుందరా!" అని, వొక సోఫాలో కూచుని, వీరన్న అన్నాడు. వొక గదిలో గోడకి వేలాడుతూన్న రెండు తుపాకుల్ని పాపన్న, సైదులూ చూసి, వాటిని కోటిరెడ్డి వద్దకి పట్టుకొని వచ్చారు.

"తీసుకోదొరా, యీటితోనే వాడిబుర్ర ఠాక్కుమని పిచ్చొచ్చు!" అని పాపన్నయెంతో ఆనందంతో కోటిరెడ్డితో అన్నాడు.

పనికివచ్చే ప్రతి వస్తువునీ వారు స్వాధీనం చేసుకొని, సుందరమైన ఆ మూడంతస్తుల మేడకి నిప్పు ముట్టించారు. కిరసనాయిలుపోసి.

తర్వాత వారంతా గుర్రపుశాలవద్దకెళ్లి, దాన్నీ అంతే చేశారు.

ఆనాటి రాత్రే నర్సిరెడ్డి శాశ్వతంగా కమ్యూనిస్టు గెరిల్లా దళాల్లో కలిసిపోయాడు



# ప్రజాశక్తి ఆఫీసు

ప్రాణమంటే ప్రతివానికి తీపే
కాని పౌరుషవంతుడు
ప్రాణముకంటే యెన్నోరెట్లు
మానాన్నే ఘనంగా యెంచుకొంటాడు !

- "ట్రోయిలస్ అండ్ క్రెస్సిడా" లో హెక్టర్ (షెక్స్పియర్)



రామిరెడ్డి బెజవాడలోని వొక ప్రయివేటు ఆస్పత్రిలో చేరి సుమారొక నెల అయ్యింది. వారు బెజవాడే యెందుకు వచ్చేరంటే హైదరాబాదుకంటే అది దగ్గర అవటంవల్లా, బెజవాడలోని వొక కలపవ్యాపారస్తుడు తమకి చుట్టం అవటంవల్లా, అన్ని విధాలా మంచిదని అలా వచ్చేరు.

బెజవాడలో రామిరెడ్డికి యేమీ తోచలేదు; జైలులో పెట్టినట్లుగా వుంది. అడవీ, కొండలూ మధ్యవున్న తన గ్రామానికి యెప్పుడు వెళ్తానా అని అతడు అనుకొంటూ వచ్చాడు. అందుకు కొన్ని కారణాలు గూడా వున్నాయి. తెలంగాణలో వొకవేపున ప్రజావుద్యమం వురకలు వేస్తూపోతూంటే, యిక్కడి వారు తమకేమీ పట్టనట్లుగా వున్నారు, ఇక్కడ చలనమే వున్నట్లులేదు.

కాని, వొక్క విషయంమాత్రం అతనికి సంతృప్తి గలిగించింది. యూనియన్ ఆంధ్రలోని కమ్యూనిష్టులూ, మరి కొంతమంది ప్రజామిత్రులూ మీటింగులు పెడుతూ, తెలంగాణ వుద్యమానికి ధనం పోగుచేస్తున్నారు. దగ్గరనున్న తెలంగాణ గ్రామాల నుంచి రక్షణకోసం వచ్చిన స్త్రీ పురుషులకి రక్షణ యిస్తున్నారు. (తర్వాత వారిలో కొందర్ని ద్రోహబుద్ధితో మద్రాసు ప్రభుత్వం నైజాం నవాబుకి అప్పగించిందనుకోండి.) అన్నిటికీ మించి "ప్రజాశక్తి" తెలంగాణ ప్రజావుద్యమానికి యెంతో సహాయపడుతున్నది,

అంతకుమించి చెప్పుకోదగ్గ విశేషమేమీలేదు. గాంధీ టోపీలు, బొర్రలుగల సేట్‌లూ కనబడుతూనేవున్నారు. కాని వారిలో వొక్కరూ ఆ విషయాన్ని పట్టించుకొన్నట్టులేదు.

రాగా రాగా రామిరెడ్డి యిప్పుడు నడవగల్గుతున్నాడు, కాని తలకి కట్టిన కట్టుమాత్రం యింకా తీసివేయలేదు.

డాక్టరు మంచివాడు, రామిరెడ్డిని చాలా ప్రేమతో ఆదరించేడు. అతను బొద్దుగా వుంటాడు. తలనెరిసిన ముసలాడు. ముఖం కందగడ్డలా యెర్రగా వుంటుంది, యెప్పుడూ లొడలొడ మాటాడుతుంటాడు. రోజుకి మూడుసార్లు అతను రామిరెడ్డి వద్దకొచ్చి చూసివెళ్ళేవాడు. అతని గాయాల్ని త్వరగామాన్పాలని చాలా ప్రయత్నించేడు.

"నువ్వు ఉక్కులాంటి మనిషివయ్యా. లేకపోతే, మరొక మనిషైతే ఆ దెబ్బలకి తాక్కున అక్కడే ప్రాణాలు విడిచివుండేవాడు! అసలు మీ కమ్యూనిస్టులంతా అలాంటి ఉక్కు మనుషులే! పైకి పీలగావున్న మృత్యువుతో చాలా యుద్ధం చేస్తారు!!" అని నవ్వుతూ ఆ డాక్టరు అప్పుడప్పుడూ అంటూండేవాడు.

నడవగలిగినప్పట్నుంచీ "ప్రజాశక్తి" ఆఫీసుకి యెప్పుడెళ్దామా అని రామిరెడ్డి వువ్విళ్లూరుతున్నాడు.

వొకనాటి వుదయం, తన తల్లిదండ్రులు చూడకుండా, రామిరెడ్డి వొక జట్కాబండిలో యెక్కేడు. ఆ బండివాడు చుప్పనాతి జూపుగడ్డిన వొక యెత్తుపాంటి ముసలాడు రామిరెడ్డి బండియెక్కింది మొదలు బండిదిగేవరకూ యీ లోకాన్ని గురించీ, లోకుల్ని గురించీ అదీ యిదీ చెప్పి, లోకంలో పాపం పెరిగిందనీ, ఇక దానికి మందులేదనీ, అంతా బ్రహ్మరాత అనీ, మానవమాత్రులవల్ల యేమీచేతగాదనీ, వొక వుపన్యాసం చెప్పి నిట్టూర్చేడు....

రామిరెడ్డి బండిదిగి మూసివున్న గేటువద్దకెళ్ళేడు. దాని ప్రక్కనేవున్న వొక చిన్నపాకలో యెవరో నలుగురు ముగ్గురు - కార్మికులల్లేవుంది - కూచుని, దేనిమీదో వంగి, యేమిటో చూస్తున్నారు. యెవరో కొత్తమనిషి వచ్చింది వారు చూడలేదు. రామిరెడ్డి గేటు నెట్టగానే, అందులో వొకరు వుంగరాల జుట్టున్న కుర్రాడు వచ్చి, యితని తలకట్టువంక తేరిచూస్తూ, "యేం గావాలి, మిష్టర్? అని అడిగేడు.

రామిరెడ్డి, కొద్ది సెకెండ్లపాటు యేమి చెప్పాలోతోచక, చివరికెలాగైతేనేం యెడిటరుగార్ని చూడాలన్నాడు. ఆ కుర్రాడు గేటు తీయగా, రామిరెడ్డి లోనికెళ్ళేడు.

అక్కడొక విశాలమైన దొడ్డిలాంటి ప్రదేశంలో నాలుగైదు దొరపొగాకు బ్యారన్లు వున్నాయి. ఆ బ్యారన్లలో "ప్రజాశక్తి" కీ వాటికీ సంబంధించిన రకరకాల ఆఫీసులున్నాయి.

ఖాకీ నిక్కరు తొడిగిన వొక కార్మికుణ్ణి-అతను హడావుడిగా వొక ఆఫీసులోకి పోతూంటే ఆపి-యెడిటరుగారు వుండేదెక్కడని రామిరెడ్డి అడిగేడు. వొక బ్యారన్‌లో ఒక కుర్చీలో వున్న వొకర్ని అతను చేత్తోచూపి తనపనిమీద తాను వెళ్ళిపోయాడు.

రామిరెడ్డి ఆ బ్యారన్‌లోకి వెళ్ళి, వొక టేబిల్‌ముందు నుంచుని, యెడిటర్ యేదో రాసుకోటం చూసి, గుర్తుగా తన గొంతు సవరించాడు. యెడిటర్ ఆధ్వనికి తల యెత్తి చూసి, తన అలవాటుకి విరుద్ధంగా చిరునవ్వు నవ్వి, రామిరెడ్డిని కూచోమన్నాడు.

ఆ యెడిటరు చామన ఛాయగా వుంటాడు, మధ్యతరగతి స్త్రీకిమల్లే సిగ్గు సిగ్గుగా వుంటాడు. అట్టేమాట్లాడడు. మధ్య వయసువాడు, వెడల్పాంటి నుదురు, చురుకైనకళ్లు, వుండి వుండి కాకర పువొత్తులు వొక్కసారి వెలిగి ముత్యాలు రాల్చేట్లుగా హఠాత్తుగా నవ్వే స్వభావంగలాడు.

ఆయన్నే అందరూ "చంద్రం" అంటారు.

రామిరెడ్డి కూచుని, "'వూరికినే.... మిమ్మల్ని చూడాలని....'' అని గొణిగేడు.

ఆ తర్వాత యేమిమాటాడాలో తోచక మెదలకుండా వూరుకొన్నాడు. యెడిటరుగూడా యేమీ మాటాడక, యిక యితన్ని వెళ్లమందామా వద్దా అన్నట్లు అటూ యిటూ చూస్తున్నాడు.

కొంతసేపటికి రామిరెడ్డి తన దెబ్బల్ని గురించి యేదో చెప్పి, వస్తానంటూ, తక్కిన ఆఫీసులు చూట్టానికి బైటికొచ్చాడు.

ఒక బేరన్‌లో దక్షిణాన రాజేశ్వర్రావు, సుందరయ్య, బసవపున్నయ్య, వాసుదేవరావు అందరూ రాష్ట్రనాయకులే - కూచునివున్నారు. వారేమిటో దీర్ఘాలోచనలో వున్నట్లున్నారు. అందువల్ల, వారిపని చెడగొట్టట మెందుకని రామిరెడ్డి ఆ బేరన్ దాటిపోతోంటే, వారంతా తమకళ్లజోళ్ళల్లోగుండా, తెల్లనిగుడ్డ కట్టుకట్టివున్న యితని తలవంక వింతగా తేరిచూసేరు.

ఆపరేషన్ చేసే గదిలోని డాక్టర్లలాగా, ఆ బేరన్లలో వున్నవారంతా చాలా హడావుడిగా గంభీరంగా వున్నారు.

అవన్నీ చూసినాక రామిరెడ్డి తిరిగి వెళ్ళబోతూంటే, ప్రక్కనేవున్న బేరన్‌లోవున్న యెడిటర్ లోనికి రమ్మని అతనికి చేత్తో సైగజేసేడు. రామిరెడ్డి గబగబా వెళ్ళి కూచున్నాడు.

"మీ పేరేంటండీ?'' అని యెడిటరు, రామిరెడ్డి ముఖంలోకి చూస్తానికి యేదో భయం కలిగినట్లుగా ప్రక్కకి చూస్తూ అన్నాడు.

"రామిరెడ్డి''

"రామిరెడ్డా!? మీ చెల్లెలుపేరు మంగమ్మా?''

"ఆ అవును. యేం జరిగింది?'' కళ్ళు పెద్దవి చేసి చూస్తూ రామిరెడ్డి అడిగాడు.

"ఆ ఘోరం జరిగింది. రజాకార్లూ... ఆమెని చెరిచారు .... ఆమె నదిలోపడి ఆత్మహత్య చేసుకొన్నది.... మా కిప్పుడే వార్త అందింది'' అని ఆగి ఆగి, యీసారి రామిరెడ్డి ముఖంలోకే చూస్తూ, యెడిటరు చెప్పాడు.

"నా చెల్లెలా!!!?'' కుర్చీ తన అడుగుభాగానికి ఎలక్ట్రిక్ షాక్ యిచ్చిపైకి తన్నినట్లుగా తటాలునలేస్తూ, రామిరెడ్డి అన్నాడు బిగ్గరగా, ఆ ధ్వనికి ఆ ఆఫీసులో వారంతా ఆశ్చర్యంగా తలలిటు తిప్పారు.

హఠాత్తుగా అతని తలకట్టులోగుండా నుదురుమీద గాయంనుంచి నెత్తురుబొట్లు జారటాన్ని యెడిటరు చూసి, కళ్లు దించుకొన్నాడు.

"వస్తా కామ్రేడ్!'' అని గొణిగి రామిరెడ్డి బయలుదేరాడు.

"మంచిది కామ్రేడ్!'' అని యెడిటరు, రామిరెడ్డి ముఖం మీది నెత్తురుబొట్లువంక చూసి చలిస్తూ వుద్రేకంతో అన్నాడు.

# 2

తామున్న గదిలో కెళ్తుండాగా, రామిరెడ్డికి క్రొత్తగా అక్కడికి వచ్చిన వారు యిద్దరు కనపడ్డారు. అందులో వొకరు కోటిరెడ్డి, రెండోవారు సైదులు. విచారంగా వున్న వారి ముఖాలూ, వారి ప్రక్కచూపులూ చూసి యింతకు ముందు "ప్రజాశక్తి" యెడిటరు చెప్పిదంతా నిజమని రామిరెడ్డి నిశ్చయించుకున్నాడు.

"మనం వెంటనే వెళ్లిపోవాలి" అని రామిరెడ్డి తన తల్లిదండ్రుల్తో, కొంచెం కటువుగానే, అన్నాడు.

అతని తల్లిదండ్రులూ, మిత్రులూ గాయాలు బాగా నయమయ్యేదాకా వద్దని యెంత చెప్పినా అతను వినలేదు.

అతని తండ్రి సుబ్బారెడ్డి మెల్లగా డాక్టరు వద్ద కెళ్లి ఆయన్ని పిల్చుకొచ్చేడు.

"పితృసమానమైన" తన సలహాయిచ్చే ముందు ఆ డాక్టరు - కుటుంబ గొడవల్లో సలహా యిచ్చే వారందరికి మల్లేనే - విచారంతో గూడిన చిరునవ్వుని ముఖంలో ప్రదర్శిస్తూ, ప్రశాంతంగా యిలా ఆరంభించేడు.

"రామిరెడ్డి, నేను చెప్పేది శ్రద్ధగా విను. నీ చెల్లెలి మరణంతో నీ తల్లిదండ్రులు చాలా దుఖంలో వున్నారు.... యిలాంటి సమయంలో నువ్వు అలా ప్రవర్తించి, వారికి యింకా దు:ఖం కలిగించటం మంచిదిగాదు. వొక వేపున గాయాలు మానకుండా ఆ తలకట్టుతో పోయి నువ్వక్కడ చేసేదేమిటి? చచ్చిపోయిన నీ చెల్లెల్ని బ్రతికించగలవా? నువ్వు అలాంటిదేమీ చెయ్యలేవు, కాగా, యే పోలీసువాడో నిన్ను చూస్తే పట్టుకొని జైల్లో పడేస్తాడు! అదేమన్నా మంచిదేనా? అందువల్ల నువ్వు యిక్కడేవుండు, మీ నాన్న పోయి మీతమ్ముళ్లని యిక్కడికి తీసుకవస్తాడు. యిక బాగా నయం అయినాక వెళ్లొచ్చు. ఆపైన యిక భగవంతుని అనుగ్రహమూ, నీ అదృష్టమూనూ...."

మారు చెప్పకుండా రామిరెడ్డి ఆయన చెప్పింది విన్నాడు, కాని, ససేమిరా అంటూ భీష్మించాడు.

"నేను అన్నానని అనుకోమాకండి. అక్కడ మా తల్లుల్నీ, చెల్లెళ్ళనీ వాళ్లు మానభంగం చేస్తా మా కొంపలు తగలేస్తాంటే, యిక్కడ నేను గోళ్లు గిల్లుకొంటా కూచోలేను!...."

ఆ మాటల్తో డాక్టరు కళ్లు చెమ్మగిల్లినాయి, అతనేమీ యెదురు చెప్పలేదు. కొంతసేపటి తర్వాత - తన యువకత్వంలో తాను అనుభవించిన ఆనందకరమైన రోజుల్ని గురించి ఆలోచిస్తున్న వాడికిమల్లే - డాక్టరు నిట్టూర్పు విడిచి, యిలాఅన్నాడు.

"అయితే, సరే. వెళ్లు. యిక అంతా ఆ భగవంతుడి అనుగ్రహం. కాని వొక్కమాట. ఆ తురక ముండాకొడుకుల చేతుల్లో మాత్రం పడమాక!"

# 3

ఆ రాత్రే వారంతా ప్రయాణమై వెళ్లి, తమ రైలు స్టేషన్లో దిగేరు. అక్కడినుంచి యాదగిరిగూడెం నాలుగుమైళ్ళ దూరం వుంటుంది. స్టేషన్ నుంచి యాదగిరి వరకూ యెగుడు దిగుడుగా వుండే వొకడొంక వుంది. వారంతా ఆ బాటని పట్టేరు. రామిరెడ్డి, కోటిరెడ్డి, సైదులూ ముందు నడుస్తున్నారు. యిక రామిరెడ్డి తల్లిదండ్రులు యేమిటో చెప్పుకుంటూ, ఏడుస్తూ శత్రువుల్ని శపిస్తూ వెనకాల నడుస్తున్నారు.

ఆ రాత్రి చీకటిగానూ, ప్రశాంతంగానూ వుంది. యే మబ్బులూ లేకుండా విస్పష్టంగావున్న ఆకాశంలో చుక్కలు మిణుకు మిణుకు మంటున్నాయి. మంచువల్ల చల్లబడిన దుమ్ము కర్కశంగా వాళ్ళ కాళ్లకి అంటుకొంటోంది. రామిరెడ్డి తన భుజం మీదున్న తుండుగుడ్డతో చలిరాకుండా తలకి కప్పుకున్నాడు. కాని, సగం మాత్రమే మానిన అతని గాయాలు చలికి తీపుపెట్ట సాగాయి. వొక మైలుదూరం నడిచినాక అతని బట్టలూ వొళ్లూ చల్లబడి యెముకలు కొరికే చలి ప్రారంభమైంది.

కొంతదూరం వారు చేలగుండా నడవాల్సి వచ్చింది. బాటకి యిరుప్రక్కలా వున్న పైరులు వారిని రుద్దుకొంటూ - వారి రాకకి ఆనందబాష్పాలు రాల్చుతున్నట్లుగా - తమ మీదున్న మంచుబిందువుల్ని రాల్చేయి. దూరాన్నుంచి నక్కల కూతలు వినబడుతున్నాయి.

అంతవరకూ వారు బెజవాడని గురించీ, వారి నాయకులైన రావి నారాయణరెడ్డి, మగ్దూం, దేవులపల్లి వెంకటేశ్వరరావు, బద్దం యల్లారెడ్డి మున్నగు వారిని గురించీ మాటాడుకొన్నారు. కాని, తమ గ్రామం దగ్గరౌతుండగానే, రామిరెడ్డి గ్రామంలో సంగతులేమిటని అడిగేడు.

మన గ్రామం యెంతగా మారిపోయిందంటే, అసలు నువ్వు గుర్తేపట్టలేవు! నిజం!!" అని కోటిరెడ్డి అన్నాడు.

"యేమిటీ!" అని రామిరెడ్డి పరాకుగా అన్నాడు.

"మరి ప్రజలంటే యేమిటనుకున్నావ్!?"

"ప్రజలా?" అని సైదులు వెటకారంగా అన్నాడు.

ఛీ! వాండ్లొక గొర్రెమంద! చాటుగా జాగీర్దారుని తిడతారు, యెదట కొచ్చేతలికి దణ్ణాలుపెడతారు!! హు. ప్రజలు!"

సైదుల్ని గట్టిగా నోరు మూసుకొనేట్లు చెయ్యాలని కోటిరెడ్డి అనుకొన్నాడు, కాని, మళ్ళీ యెందుకో మనసు మార్చుకొని యిలా అన్నాడు.

"అది వట్టి చెత్తవాగుడు! కమ్యూనిస్టు అనేవాడెప్పుడూ అట్టా మాట్లాడగూడదు!"

"సరే, సరే. యిక నాపండి" నాలుకతో ఛుక ఛుక ధ్వనిచేసి రామిరెడ్డి అన్నాడు.

హు. ప్రజలు! రజాకార్లతోనూ, పోలీసోండ్లతోనూ పోట్లాడిందెవుళ్లు? మనమా, ప్రజలా? మనం లేకుండా హాండ్లశాత యేమన్నా అవుతాదా? పోట్టాడేది మనం, సచ్చేది మనం పైగా నువ్వు ప్రజలంటావు!" అని సైదులు ఖయిక్కు మన్నాడు.

"ప్రజలు లేందే మనమేపని చెయ్యలేము," అని రామిరెడ్డి అన్నాడు. "తెలిసిందా? ప్రజలే సర్వమూనూ. వారు అట్టాగో యిట్టాగో వుండారంటే నీ బాధ్యత వారికి నచ్చజెప్పటం... అంతేకాని వారి మీద అసంతృప్తి చెందటం గాదు... నువ్వు త్యాగంచేశావు. నిజమే. యెవరికోసం? ప్రజల కోసం గాదా? అందువల్ల ప్రజల్లోవున్న బలహీనతల్ని జూసి నువ్వు అసంతృప్తిపడగూడదు, వారిని మార్చటానికి ప్రయత్నించాలి. అంతేగాని వెకిలిగా మాట్లాడగూడదు..... యీ రజాకార్ గుండాదాడులు మొదలెట్టిన కాడినుంచీ ప్రజల్లో మార్పు రాలా? మనకిమల్లే వారు బాధలు అనుభవించలా? వారు ముందుకొచ్చి మనకి సహాయంచెయ్యలా? అట్లాతొందరపడటం మంచిదిగాదు, సైదులూః అసలు ప్రజలెవరు? మనమే ప్రజలం, ప్రజలే మనం గాదా? మనము వేరూనూ, ప్రజలు వేరూనా?......."

అని రామిరెడ్డి వివరంగా చెప్పేడు తనలో కల్గుతూన్న వుద్రేకాన్ని అణుచుకొంటూ, సైదులు యెందువల్లనో మరి మెదలకుండా విన్నాడు.

వారు తమ గ్రామంచేరి, సుబ్బారెడ్డి యింటికెళ్లేరు.

యేముందక్కడ బూడిదపోగుతప్ప?

ఆ బూడిదపోగుని చూడగనే, తమ కూతురు మనసులో కనపడగా రామిరెడ్డి తల్లిదండ్రులు యిద్దరూ గుండె పగిలే శోకంతో యేడ్వసాగేరు.

కొంతసేపైనాక కోటిరెడ్డి వారందర్నీ తన యింటికి ఆ రాత్రి ఆహ్వానించాడు.

"వొద్దునాయినా. యేమీ అనుకోబాక. కూతుర్ని పోగొట్టుకుని, కొంపపోగొట్టుకొని, యే మొకం పెట్టుకుని మీ యింటి కొచ్చేమీ? మా వాణ్ణి తీసికెల్లు...." అని సుబ్బారెడ్డి అన్నాడు, రామిరెడ్డి తల్లి యేమిటో తలుపుకొచ్చి ఆవురుమన్నది వొక్కసారిగా.

తల్లిదండ్రుల్ని విడిచిపెట్టి రామిరెడ్డి యెలాపోగలడు? వీరిని విడిచిపెట్టి కోటిరెడ్డీ, సైదులూ మాత్రం యెలాపోగలరు? అందువల్ల అందరూ ఆ రాతంత్రా ఆ బూడిదకుప్పవద్దే, ఆ చలిలో, గడిపారు.

# 4

మర్నాడు, తెల్లవారినాక బలవంతంచేసి కోటిరెడ్డి ఆ ముగ్గుర్నీ తన యింటికి తీసికెళ్ళేడు, సైదులు మాత్రం తన యింటికి తాను వెళ్ళేడు.

సుబ్బారెడ్డి ఇల్లు తగులబడిపోయినప్పటినుంచీ, నాగయ్య ఆ యిద్దరి పిల్లల్ని తన యింట్లోకి తీసికెళ్లి సాకుతున్నాడు. ఇలా సుబ్బారెడ్డీవాళ్లూ వచ్చారని తెలియగానే ఆ పిల్లల్ని కోటిరెడ్డిగారింటికి తీసికెళ్లేడు.

నాగయ్య వెళ్ళీ వెళ్లగానే రామిరెడ్డితో, "అబ్బాయ్, నాదొక పనివుండది. వింటావా, వినవా?" అని అడిగేడు.

అప్పటికి అక్కడ చాలామంది జనం చేరేరు. సైదులు గూడా వచ్చాడు.

"యేమిటా పని?" అనడిగేడు రామిరెడ్డి.

"శెప్పు. అసలు యింటవా, యినవా?" అని నాగయ్య మళ్ళీ అడిగేడు.

"మంచిదైతే వింటాను, చెడుదైతే వినను" అన్నాడు రామిరెడ్డి.

కొంతసేపు తటపటాయించి నాగయ్య యిలా అన్నాడు.

"అయితే యిను. నేను మీకు యెతిరేకినిగానుగందా? మీకేమీ అన్నేయం శెయ్యలేదుగందా?ఆ?"

"చెప్పు, చెపుతాలే చెప్పు"

"శేశానా యేంది?"

"నే నున్నంతవరకూ చెయ్యలేదు"

"సరిగందా? మీ సంగపోండ్లు జగ్గారెడ్డి భూమితోపాటు నా భూమినిగూడా పంచిన్రే యెందుకా అన్నేయం? ఆ?

"మా భూమిని గూడా పంచితిమే?" అన్నాడు కోటిరెడ్డి.

"యింట్లో పెత్తనం నీది. నీకు యిట్టమైంది. నువ్వు పంచావు. మరి నాదెందుకు పంచాలీ?"

"నువ్వు ధనికుడివి. అందుకని నీ భూమి పంచినం..." అన్నాడు సైదులు కుండ పగలగొట్టినట్లు.

"నాడబ్బు నేను వడ్డీకిచ్చుకుంటే మద్దెలో మీదేందిరా?"

"నీ డబ్బా? యాడదీ? అది ప్రెజలసొమ్ము గాదూ!" అన్నాడు సైదులు గుడ్లురిమి చూస్తూ.

"యేం రామిరెడ్డి, మాటాడవూ? ఆ? మీ యిల్లు తగలబడిపోయినప్పట్నుంచీ నీ తమ్ముళ్ళి నేను సాకినందుకు యిదన్నమాట ప్రెతిఫలం? ఆ?

"ధనికరైతుల అందరి భూములూ పంచామని మన వాళ్లు అంటున్నారు. అట్టాగే నీ భూమి గూడా పంచారు. అది పార్టీ నిర్ణయం....." అన్నాడు రామిరెడ్డి.

"అయితే మీరేది శెప్పితే అది శేసినందుకూ, నీ తమ్ముళ్ళి సాకినందుకూ యిదన్నమాట నువు శెప్పేది?"

"వో యబ్బ సాకినవులెత్తూ మాలావు! నువు సాక్కపోతె మా యిండ్లకి తీసుకెళ్ళి మేమే సాకేవాండ్లం!!" సైదులు అన్నాడు.

యీ గొడవంతా యేమిటో తెలవక, జాలితో, సుబ్బారెడ్డి యిలా అన్నాడు.

"ఆ మాట నిజమేరా పాపం! నాగయ్య మనకేం అన్నేయం చేసిండు? ఆయన భూమి ఆయన కిచ్చెయ్యండి, తక్కినోండ్లది పంచిపెడితే పంచిపెట్టారు...."

"నువ్వూరుకో నాన్నా"

రామిరెడ్డి తమ్ములు గూడా నాగయ్య వంక జాలిగా చూశారు.

"అయితే అంతేనా రామిరెడ్డీ? మీరు శెప్పింది యేది కాదన్నానూ? మీరు కూలోండ్లకి యెంత కూలిమ్మంటే అంత యిస్తానంటిని. మీరేది శెయ్యమంటె అది శేస్తానంటిని. మరి యేందోయ్ నాకీ రాతా?"

రామిరెడ్డి బాగా ఆలోచించి, "తొందరపడమాక, నాగయ్య మామా, నేను పైవాళ్లతో ఆలోచించి చెపుతాను. అంతవరకూ యేమీ చెయ్యటానికీ వీల్లేదు..." అని అన్నాడు.

ఆ మాటకి నాగయ్య కంటే యెక్కువగా రామిరెడ్డి తల్లిదండ్రులు సంతోషించారు, వారి నేత్రాలు నీళ్లతో నిండేయి.

సైదులు మాత్రం ముఖం బిగబట్టి నాగయ్య వంకచూసేడు.



# మేకల్ని మింగేవాళ్లు పోతే
# మనుషుల్ని మింగేవాళ్లు వచ్చేరు ! ! !

తోడేళ్లు పోవంగ దొడ్డపులులొచ్చాయి
పాడు బీడుగ ప్రజల పీక్కుతింటూ యీ
తల్లులూ తండ్రుల్లు తరలి రారండి
అన్నలూ సెల్లెళ్లు వేగరారండీ
సంకెళ్ల రంకెళ్ల సరకు గొనకండీ
తూపాకి తూటాలధ్వని కదరకండీ
భూమికై
భుక్తికై
పోరుసల్పండీ !

- "మోహన్"



రజాకార్ల నిజస్వరూపం యేమిటో తెలియకుండా కప్పిపెట్టివేసినాక, రజాకార్-పోలీస్ మిలాఖత్తూ నైజాంనవాబు కుటిల కుతంత్రాల్ని గురించిన యదార్థాన్ని పైకి కనబడకుండా చేసినాక, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం కింద ప్రజలు యెలా వీరోచితంగా యీ కుత్రంలను యెదుర్కొంటూ భూమికోసం బతుకుకోసం పోరాడుతున్నారో వొక్క వార్తగూడా వెయ్యకుండా తొక్కిపట్టిన తర్వాత, పైపెచ్చు కమ్యూనిస్టుల్ని గూండాలుగా చిత్రించినాక, 1948లో, యూనియన్ పత్రికలు పంచదారకంటే తియ్యగావుండే వొక వార్తను ప్రధానంగా వెయ్యసాగేయి-అదేమంటే - హైదరాబాదు సంస్థానం మీద యూనియన్ సైన్యాలు దాడిచేసి అక్కడి ప్రజలకి "విముక్తి" కలిగిస్తాయని!

మాటలగారడీతో గూడిన యీవార్త అమాయికుల్ని చాలా మోసగించింది; నిజమేనని నమ్మారువారు; యూనియన్ సైన్యాలు నిజంగా అక్కడి ప్రజలకి "విముక్తి" కలిగించటానికి పోతున్నాయనుకొన్నారు.

ఈ ప్రచారానికి బాగా మోసపోయిన కొంతమందికి "తురకజాతి" మీద వున్న ద్వేషం 107 డిగ్రీలవరకూ....మలేరియా రోగికిమల్లే...... పెరిగింది. ఇక ఆ సంధిలో వారు యిలా మొదలెట్టారు:

తురక వాళ్ళనా? తురకవాళ్ళని రామరామ అనగూడదు. గొర్రెల్ని నరికినట్లు... లంజాకొడుకుల్ని....నరకాల్సిందే!"

అని యింకా యేమిటేమిటో!......

ఉన్నత తరగతుల వారిలో అర్థం లేని వుద్రేకం, "జాతీయ ప్రభుత్వం" మీద అమాయకమైన విశ్వాసం, గుడ్డి జాతిద్వేషం ఆనాడు విపరీతంగా పుట్టింది. చక్కని దుస్తులు ధరించి, హాయిగా బతుకుతూ, బీదల పట్ల బిర్ర బిగిసిన ముఖవైఖరి ప్రదర్శించే యీ పెద్ద మనుషులు వొక నాటి వుదయాన "హైదరాబాదు సంస్థానం పై యూనియన్ సైన్యాల ముప్పేట ముట్టడి" అనే వార్తని పత్రికల్లో తాటికాయలంతేసి అక్షరాల్లో చూడగనే, యేదో పెద్ద భారం తొలగిపోయినట్లు వెర్రిగా నిట్టూర్చేరు; వారి టెంపరేచరు అప్పుడు మామూలు స్తితికి వచ్చింది. అయితే, ఆ తర్వాత...అంటే "జాతీయ ప్రభుత్వం" హైదరాబాదును ఆక్రమించుకొన్నాక...దాని నిజస్వరూపం చూడగానే సిగ్గుతో చలితెరలు పుట్టినాయను కొండి; అది వేరే సంగతి.

యీ వార్తని తెలంగాణా కూడా నమ్మిందనే చెప్పాలి; కాని యిదివరకి గ్రామాలు వదిలి పెట్టి పారిపోయిన జాగీర్దారులూ, దేశముఖులూ, పట్టేళ్ళూ పట్వారీలూ మొదలైనవాళ్ళు కాంగ్రెసు జెండా నీడకింద తిరిగి తమ తమ స్థానాల్లోకి రావటం చూసి, తెలంగాణ పళ్లు నూరింది; యీ ద్రోహుల్ని మట్టు పెట్టటానికి తన అమరహస్తం యెత్తింది!!!

0 0 0 0

హిందూ ముస్లిం విభేదాలూ, మతపిచ్చా ఆఖరికి నైజాంస్టేట్ పోలీసుల్లోకి గూడా పాకింది.....

అంతేగాదు,

తామేదో "హిందూజాతి" ని "తురకజాతి" విషపుకోరలనుండి రక్షిస్తున్నామని అపోహపడి యూనియన్‌సైనికులు, ముస్లిం మత ద్వేషం తో, అన్నిటికీ మించి రజాకార్లు చేసిన హింసాకాండను చూసి కడుపు మండిన యూనియన్ సైనికులు " పంటికి పన్ను; కంటికి కన్ను" అనే రకంగా ప్రవర్తించేరు.

కొన్నాళ్ల తర్వాత ...... తాము యే నవాబు మీదైతే గుడ్డినమ్మకంతో హత్యాకాండకు తలపడ్డారో....ఆ నవాబు "జాతీయ ప్రభుత్వం" తో గలిసి విందులు గుడుస్తున్నాడని రజా కార్లు గ్రహించగానే వారిలో చాలా మంది, తాయలం యిస్తానని తండ్రి చేత యివ్వబడకుండా మోసగించబడిన పిల్లాడికి మల్లే, కోపంతో జుట్లు పీక్కుని యేడ్చేరు; వారిలో మరికొందరు ప్రజలకి అనుకూలమయ్యేరు; యింకా కొందరు మొదటి స్తితిలో నన్నా వున్నారు, లేదా, యెటూ కదలకుండా యూనియన్ సైన్యం చేతుల్లో ప్రజలందరికి మల్లే నానా బాధలూ పడ్డారు.

కాంగ్రెస్ ప్రభుత్వం తన సేవల్ని పంపి నైజాం సంస్థానాన్ని "ఆక్రమించిన" తర్వాత యింకా యెక్కువ కరువు యింకా యెక్కువ మరణాలు కలిగించటం ద్వారా "నూత్న శకం", "నవయుగం" ప్రారంభింపజేసింది!!

అందువల్లనే ప్రజలు ఆగ్రహంతో పళ్లు పట పట నూరుతూ, "గొర్రెల దినేవాండ్లు బోతే బర్రెల దినే వాండ్లొచ్చిన్రా!" అని మండి పడ్డారు.



# నీచపు పగసాధింపు

పాపాల భైరవులు కొందరు పుణ్యాత్ములౌతారు
యే పాపమెరుగని మరికొందరు అధః పతనమౌతారు;
పాప కూపాలనుండి కొందరు పరుగెత్తిపోతారు..........
పాపం! వొక్క చిన్నతప్పుకే కొందరు దండించబడతారు.

....'మెఝర్ ఫర్ మెఝర్'' లో ఎస్కేలస్ (షేక్స్పియర్)



**మొ**త్తం తెలంగాణ కమ్యూనిస్టు పార్టీ అంతా రహస్య జీవితం గడపాల్సి వచ్చింది.

యాదగిరి గ్రామానికి సంబంధించి మూడు గెరిల్లా దళాలు వున్నాయి. వొకటి రామిరెడ్డి దళం; యిందులో కోటి రెడ్డి, సైదులు, నర్సిరెడ్డి మొదలగువారు సభ్యులు. రెండోది పాపన్నదళం. మూడోది సీతదళం...........

0 0 0 0 0

ఒకనాటి రాత్రి పాపన్న దళం ఖాసింని చంపటం కోసం రహస్యంగా గ్రామంలో కెళ్లింది. వీధుల్లో యెవరూలేరు. కుక్కలు అసలు కనబడనేలేదు; బహుశా అవి వెచ్చగా యెక్కడో ముడుచుకొని పడుకొని వుంటాయి. ఆకాశంలో అక్కడక్కడా నల్లటి మబ్బులున్నాయి. వాటి మూలం గా చుక్కల వెలుగు అట్టే కనబడకుండా పోతుంది. దళం నిశ్శబ్దం గా మమ్మూసాహెబ్ యింటి మీదికి పోతూన్న సమయంలో, అకస్మాత్తుగా భూమి లోంచి పుట్టుకొచ్చినట్లు, సత్తిరెడ్డి పాపన్న దగ్గర ప్రత్యక్షమయ్యేడా అంధకారంలో, చటాలున పాపన్న అతని గొంతు లంకించుకొన్నాడు. వెంటనే ఫలానా అని గుర్తించేడు.

"యెవుడాడు? ముక్కలు ముక్కలుగా నరుకు!'' అని వొక గెరిల్లా అన్నాడు. 'నే...నే... నన్ను మాట్టాడనియ్యండి. మీరెందుకొచ్చిందీ నాకు తెలుసు....నేనూ అందుకే వచ్చా... ఆ లంజాకొడుకు మా తండ్రిని చంపలా? ఆ కసి నాకు లేదూ? నేను పగసాధించాలని వచ్చా....నన్ను గూడా మీతో రానియ్యండి...''

పాపన్న కొంతసేపు ఆలోచించి సరేనన్నాడు. నిజము గూడా అంతేగా మరీ? కొండారెడ్డిని ఖాసిం చంపలామరీ? ఆ ద్వేషం కొడుక్కివుండదూ?

మమ్మూ యింటిచుట్టూ నలుగుర్ని కాపలా బెట్టి పాపన్నా వాళ్లూ లోనికెళ్లేరు. యింట్లో అందరూ నిద్రల మీద వున్నారు. మమ్మూ చూరుకింద పోటీగా పెట్టిన వొక కొయ్య స్తంభానికి అతని మేక కట్టివేయబడివుంది. అది పడుకొని నెమరేస్తుంది. చీకట్లో దానికళ్లు అదోరకంగా మెరిసేయి.

నిద్రపోతూన్న వారి ముఖాల మీద కప్పబడివున్న గుడ్డలు తొలగించి, బాగావంగి,పాపన్న పరీక్షగా చూస్తూంటే ఖాసింతల్లి కళ్లు తెరచి చూసింది. వెంటనే వొక గెరిల్లా నోరుతెరిస్తే చంపేస్తానని ఆమెని బెదిరించేడు! శవంలాగా కదలకుండా ఆమె అట్టే పడుకొంది.

వొక గోతంపట్టలో చుట్టివున్న పుగాకు పాపన్న కంటబడింది.

"బాబో",పెల్లాం బిడ్డలు లేకపోయినా బతకొచ్చు పుగాకు లేందే బతకలేం!" అనుకొంటూ పాపన్న ఆ పొగాకుని తన చంక కింద పెట్టివేసేడు.

నిజంగా యిరవై రోజుల నుంచి ఆ దళం పొగాకు లేక కుతి బుట్టి కొట్టు కాడి చస్తున్నారు. యెండుటాకులవ్వీ చుట్టలుగా చుట్టి తగలేసేరు. అయినా పొగాకు చుట్టలో వుండే మజా యింకో పిచ్చాకు లో వుందా?

యే అలికిడి వల్ల నైతేనేమి, మమ్మూ గూడా లేచేడు; యిలా వణుకుడు గొంతుతో అరిచేడు:

"యెవురు మీరు?"

"నిద్రపో, తాతా, నిన్నేమీ శెయ్యంలే.?" అని పాపన్న అన్నాడు.

ఖాసిం యింట్లోలేడు; అందువల్ల, ద్వేషంతో పళ్ళు నూరుతూ, గొణుక్కుంటూ దళం త్వరగా బైటికి వెళ్ళిపోయింది.

సత్తిరెడ్డి మాత్రం వారి వెంట పోలేదు; వారంతా బయటికి వచ్చి వెళ్ళిపోయేప్పుడు తాను తెలివిగా నొక చాటున నక్కి, వారు వెళ్లిపోగానే మమ్మూవున్న చూరువద్దకి మెల్లగా వచ్చాడు.

మమ్మూ మంచం మీద కూచునివున్నాడు, ముఖం యింటి వైపు పెట్టి; తన ముసల్ది చెప్పే సోది వింటున్నాడు.

సత్తి రెడ్డి తన గొడ్డల్ని యెత్తి మమ్మూ మెడమీద లాగిపట్టి వేసేడు.

ఇజ్ మని వెంటనే నెత్తురు చిమ్మికొట్టింది.

సత్తిరెడ్డి ముఖం నిండా వెచ్చని నెత్తురు బొట్లు.

నెత్తురు!

రెండో దెబ్బ.

తల తెగిన గోవులాగా మమ్మూ భీకరంగా అరిచేడు. అతని మేక అదిరిపడి అరుస్తూ తాడు తెంపుకోజూసింది. తట్‌మంటూ మమ్మూ తల నేలపైబడింది.

విపరీతమైన భయంతో గడగడలాడిపోతూ సత్తిరెడ్డి ఆ అంధకారంలోకి వొక్క లగువుతీసేడు....

# 2

పాపన్న దళం మమ్మూ సాహెబుని చంపిందని రామిరెడ్డికి తెలిసింది.

ఆవార్త వింటూండగానే అతని ముఖం నల్లబడిపోయింది; అతని హృదయంలో యేదో తీపోటుపొడవ సాగింది. పాపం! మమ్మూ వీళ్లకి యేమి అన్యాయం చేసేడు?

తన కామ్రేడ్స్ పక్కన కొండముంగిట కూచుని, అస్తమించుతూన్న సూర్యునివక్కల దీర్ఘాలోచనలో చూస్తూ, రామిరెడ్డి, తన జీవితంలో మొదటి సారిగా, బొటబొట కన్నీళ్లు గార్చేడు. అన్యాయాన్నీ అక్రమాన్నీ అతనెప్పుడూ ద్వేషించేడు. బెజవాడనుంచి అతను యిక్కడకు రావటానికి ఆ ద్వేషం వొక్కటే కారణం కాదు; పాపన్న, వీరన్నలలాంటి సామాన్య ప్రజలుగూడా దళాలుగా తమంతతామే యేర్పడి శత్రువుని వీరోచితంగా యెదుర్కొంటున్నారనే వార్త అతన్ని ముగ్ధుణ్ని చేసి, ముందుకు వురికింపజేసింది!

కాని, మరి.....

యీ విషయంలో పాపన్నని సంజాయిషీ అడిగి తగిన చర్య తీసుకొందామనే వుద్దేశంతో, రామిరెడ్డి వొకర్ని పాపన్న వద్దకి కబురంపేడు.

పాపన్న వచ్చేడు.

కాని తననెందుకు పిలిపించారో అతనికి తెలీదు.

అందువల్ల అతడు తన మామూలు ధోరణిలో అదీ యిదీ సోది మొదలెట్టి నవ్వసాగేడు. ఇదిచూసి రామిరెడ్డికి తగలేసుకొచ్చింది.

"యికనాపు, ఆపు! మీరు మమ్మూని చంపిందెందుకో చెప్పు!" అని రామిరెడ్డి రుంజుకుంటూ అడిగేడు.

బలమైన కర్రతో బలంగా నెత్తిమీద ఠాక్కున కొట్టినట్లు, ఆ ప్రశ్నతో పాపన్న దిమ్మరపోయేడు.

"మే....మే....మేం; దొరా,.... మేం సంపలేదే!...." అని నత్తులు కొట్టేడు పాపన్న.

"నీ దొరా గిరా తుంగలో దొక్కు: నన్నెప్పుడూ దొరాగిరా అని పిలమాక.... యెంత ఘోరం! యెంతఘోరం! వొక అమాయక ముసలాణ్ణి చంపి, పైగా సిగ్గులేకుండా ఎరగ నంటావా? ఆ?....."

వుద్రేకంలో రామిరెడ్డి కంఠం వణికింది.

"చేసింది వొప్పుకో!..... నువ్వు కమ్యూనిస్టు సభ్యుడివి గాదు. కాని ప్రజలేమనుకొంటారు? నువ్వు కమ్యూనిస్టువి అవునో కాదో ప్రజలకి యెట్టా తెలుస్తుంది? ఆ నువ్వు కమ్యూననిస్టువి కానప్పటికీ, నీ మూలాన కమ్యూనిసుష్టపార్టీ యీపాపాన్ని మోయాల్సివస్తుంది. నువ్వు పార్టీకి అపకీర్తి తెచ్చిపెట్టావు!..."

అంతవరకూ పాపన్న మెదలకుండా విన్నాడు; తన మూలాన పార్టీకి - తాను **యెం**తగానో ప్రేమించిన పార్టీకి అపకీర్తి వస్తుందని వినగానే, పాపన్న నేత్రాల్లో నీళ్లు గిర్రున **తిరి**గాయి.

తన చేతిలోవున్న గొడ్డల్ని రామిరెడ్డి పాదాలవద్ద పెడుతూ, వుద్రేకంలో పాపన్న **ఆవురు**మన్నాడు.

"యిదిగో గొడ్డలి.... నన్ను సంపండి, దొరా.... సంగానికి శెడుపేరు దెచ్చి యికనేను **బతి**కేంది, సచ్చేంది? సంపండి దొరా...."

ఇంతవరకూ వింటూ కూచున్న కోటిరెడ్డి యిది చూడగానే, రామిరెడ్డి తొందరపడుచున్నాడని గ్రహించి యిలా అన్నాడు.

"అంత తొందరపడమాక, రామూ, పాపన్న నొకప్రశ్న అడగనియ్యి...."

"వొద్దు దొరా.... సంపండి నన్ను!" అని పాపన్న అన్నాడు.

కోటిరెడ్డి యెంతోపట్టుపట్టినాక, సత్తిరెడ్డి గూడా ఆ రాత్రి తమతోపాటు వచ్చాడనీ, కాని తిరిగొచ్చేటప్పుడు సత్తిరెడ్డి తమతో కలసి రాలేదనీ, బజార్లోకొచ్చినాక చూస్తే తమలో అతడులేడనీ, వెనక్కితిరిగితే యేదైనా ప్రమాదం రావచ్చునని తాము త్వరగా వెళ్లిపోయామనీ, ఆ తర్వాత యేమిజరిగిందో తమకి తెలియదనీ, పాపన్న చెప్పాడు.

ఆ మాటలకి కోటిరెడ్డి ముఖం వికసించింది.

'రామూ, అర్థమైందా యిప్పుడన్నా? మమ్మూసాహెబుని సత్తిరెడ్డే చంపాడని తేలటల్లా?' అని కోటిరెడ్డి అన్నాడు. "యే.....మి...టీ !? అని పరాకుగా, వొక్కసారి నిద్రమేల్కొన్న వాడికిమల్లే, రామిరెడ్డి దీర్ఘం తీసాడు.

"పాపన్న నిర్దోషి, సత్తిరెడ్డే మమ్మూని చంపాడు!"

వొక్క రామిరెడ్డి తప్ప, దళం అంతా పాపన్న నిర్దోషి అని నిర్ణయించింది. మెజారిటీ అలా నిర్ణయించటంవల్ల రామిరెడ్డి గూడా వొప్పుకున్నాడు.

కాని తనవల్ల సంగానికీ అపకీర్తి వచ్చిందిగదా అనేబాధ పాపన్నని యింకాపట్టి పీకుతుండగా, పాపన్న తన దళం వద్దకి వెళ్ళేడు.



# "రష్యా ఏజంటు"

నీతిలేని ధనికుడు నీచుండువాడు
నీతిగల నిరుపేదె వన్నె దేగలాడు.

"ఆలీజ్ వెల్‌దటెన్డ్స్ వెల్" (షేక్స్ పియర్)



శ్యామసుందరరావు పొట్టిగా బలంగా వుంటాడు, నిక్కబొడిచిన కరుకుజుట్టుగల తల; చుప్పనాతిలాగా కనపడే చిన్నకళ్లు.

తెలంగాణాలోని వొక తాలూకా ఆర్గనైజరుగా పంపబడిన మరుక్షణంనుంచీ అతను హృదయ పూర్వకంగా తెలంగాణ ప్రజల జీవితాల్లో కలిసిపోయేడు. ఆ ప్రాంతంలోని పార్టీ కామ్రేడ్సుకీ, ప్రజలకీ అతనంటే యెంతప్రేమ వున్నదంటే, యెవరుగూడా అతన్ని అతనిపూర్తి పేరుతో పిలవకుండా, తమ అన్ననో మరెవర్నో పిలిచినట్లు "సోములు" అని పిలిచేవారు. ప్రజలు తమలో తాము అతన్ని గురించి మాటాడుకొనేప్పుడు అతన్ని "రుస్సా సోములు" అని పిలుచుకొనేవారు. యెందుకంటే, అతను యే మీటింగులో, యెక్కడ మాట్లాడినా, సోవియట్ రష్యా (సోవియట్ యూనియన్) యొక్క మహనీయమైన పాత్రని గురించి మాటాడకుండా వుండేవాడు గాదు! అందువల్ల అతన్ని పూర్తిపేరుతో పిలవరు; "ఆ పొట్టి రష్యా యేజంటు" అంటారు.....

ఆదినుంచీ సోములంటే రామిరెడ్డికి అదోవిధమైన అయిష్టత వుంది; రానురానది వైరుధ్యంగా మారిపోయింది.

యీ "గుంటూరు కామ్రేడ్"ని యెప్పుడైనా కల్సికోవటం తటస్థించినపుడు - పిచ్చి తలనొప్పితో బాధపడుతున్న వాడికిమల్లే - రామిరెడ్డి తన కనుబొమ్మలు చిట్లించి, ముడిచి, సోములుతో పెడసరంగా మాటాడేవాడు. సోములు యిది గమనించేడు. రామిరెడ్డిని కల్సికొన్నపుడు అతనికేదో అదటుగా వుండేది; కాని తాను మాత్రం అలా ప్రవర్తించలేదు.

వొకనాడు సైదులుతో రామిరెడ్డి సోముల్ని గురించి యేమిటేమిటో అన్నాడు. దాంతో సైదులు ఖయిక్కుమన్నాడు;

"హు, అట్టాంటి శెత్త నీ బుర్రలో యెట్టాదూరిందో నాకు బోధపట్టలేదు! అతనాపనికి బనికిరాడని నీ కెట్టా తెలుసు? ఆ? అతను తెలంగాణావాడు గాడనీ, యెక్కడో గుంటూరుజిల్లా వాడనీ, నువ్వు యెందుకు అనుకోవాలి? యెవ్వరైతే యేంది? అతను గుంటూరులో పుడితేయేంది, గోంగూరలో పుడితే యేంది? ఆ? నువ్వు కమ్మ్యూనిష్టువిగాదు? ములికీ, నాన్‌ములికీ అని కాంగ్రెస్ నాయకుడికిమల్లే నువ్వెందుకు అనుకోవాలి? నువ్వంటే నాకిదివరకి పెద్ద గురివుండేది ! కాని

నువ్వు ఘుంత.... యింత.... నీశకంగా...." అని సైదులు వుద్రేకంతో వుక్కిరిబిక్కిరౌతూ, మధ్యలోనే మాట్లాట్టం ఆపేడు.

తాను నేరం చేస్తున్నానని తన హృదయమాంతరాళంలో రామిరెడ్డి నమ్మేడు. అలాంటి నీచపు ఆలోచన పార్టీకి హానికరమనిగూడా అతను నమ్మేడు. కాని, తన బలహీనతని అతనింకా వదిలించుకోలేక పోయేడు...

## 2

వొక దళంనుంచి యింకొక దళంవద్దకి పరుగెత్తుతూ, వారికి సలహాలిస్తూ, దళాన్ని దృఢతరంచేస్తూ, వొకనాడు సోములు రామిరెడ్డి దళాన్ని కల్సుకోడానికి బయలుదేరి, తెల్లారేట్లుండగా లాభంలేదని, మార్గమధ్యంలో యాదగిరిలో రక్షణ తీసుకోవాల్సి వచ్చింది. అందుకుతోడు అతని కొరియరు ఐన గణపతి ఆ వూళ్ళో ఆగాలంటూ పట్టుబట్టేడు. అందువల్ల వూరికి వుత్తరానవున్న రంగారెడ్డి యింట్లో సోములు ఆ పగటికి మకాంవేయక తప్పిందిగాదు.

ఆ యిల్లంతా నిర్జీవంగా, అంధకారంగా ఉంది;

నిప్పులు కురిపించే ముసలాడు కొండారెడ్డి - యీనాడా యింట్లో లేరు; అతన్ని ఖాసిం హత్య గావించేడు.

చలాకీగా, వుషారుగా, కిలకిలాడుతూండే సీత ఈనాడా యింట్లో లేదు; ఆమె గెరిల్లాదళంలో చేరిపోయింది....

అందువల్ల సోములికి విచారంగా, బాధగా వుంది; అతను మాటాడకుండా నిశ్శబ్దంగా కూచున్నాడు.

దట్టంగా గడ్డం పెరిగి, కళ్లు దించుకుపోయి, భూతంలాగా వున్న సోముల్ని చూడగానే కోటమ్మ మనసులో తుపాను చెలరేగింది; వెనకటి సంగతులెన్నో ఆమెకి జ్ఞాపకం వస్తున్నాయి. నోట్లో గుడ్డలు కుక్కుకొని యెవరికీ వినరాకుండా ఆమె వెక్కి వెక్కి యేడ్చింది. సోములు గుండెలో ఏదో ముల్లుపోట్లు పొడిచింది; కళ్ళల్లో ఇసుకపడినట్లుగా, కళ్లు బాధలు పెట్టినాయి...

రంగారెడ్డి పూర్తిగా మారిపోయినట్లు అగుపించాడు; తనపని తాను చురుగ్గా చేసికొనిపోతున్నాడు. కనీసం పదిసార్లయినా కాంగ్రెస్ పోలీసులు అతన్ని చావమోదివుంటారు; కాని యేమాత్రం చలించనట్లు అతని ముఖం చెబుతోంది....

యింట్లోకి వచ్చినాక సోములు కొరియరు - గణపతి - ఆవూరివాడే - తాను యింటికిబోయి వస్తానని సోములుతో అన్నాడు.

"వద్దు, కామ్రేడ్. శత్రువులెవరైన చూడొచ్చు." అని సోములు మరీ మరీ చెప్పేడు. అయినా, యెంత చెప్పినా ససేమిరా అనేసరికి, సోములు వొప్పుకున్నాడు; గణపతి యింటికెళ్లేడు.

"యిట్టా యెంతగాలం వుంటది, బాబూ?" అని కోటమ్మ అమాయికంగా, ఆవేదనతో అడిగింది.

"యెట్టా చెప్పగలం, అమ్మా? మూడేళ్లు పట్టొచ్చు; లేదా, పదేళ్లుపట్టొచ్చు, యింకా యెక్కువ గావచ్చు.... అదంతా మన వుద్యమంమీదా, మన వుద్యమానికి దేశంలోని యితర ప్రజలు యిచ్చే సహాయంమీదా ఆధారపడి వుంటుంది....." అని సోములు అన్నాడు.

ఆ సమాధానంతో కోటమ్మ మరలా తన ఆవేదనపు ఆలోచనల్లో పడిపోయింది; ఆ సమాధానంమీద యేమీ వ్యాఖ్యానించలేదు.

"వాండ్లని రానియ్యి, పోనియ్యి జరగాల్సిందంతా జరిగింది. యింకా బయపడే అవసరమేంది?" అని ఆమె అనుకున్నది.

పొయ్యివద్ద కూచుని, వొక వెదురుగొట్టంతో పొయ్యి వూదుతోందామె. నిప్పు బుసలుకొట్టి, చిటపటమని, మంటల నాలుకలు సాచి భగ భగమన్నది; ఆకాంతిలో ఆ యింట్లో వున్న చీకటి నిలబెట్టిన మంచాల చాటుకీ, కుండలచాటుకీ.... పోయింది.

సోములు మంచంమీద కూచుని పొయ్యివంకా, గోడల వంకా, కోటమ్మ ముఖంవంకా, పరాకుగా చూస్తున్నాడు.

హఠాత్తుగా ఆమె ఆ నిశ్శబ్దతని భేదిస్తూ, "హంతా మన కర్మ!" అని నిట్టూర్చింది. కొంతసేపటి తర్వాత మళ్లీ మాట్లాడ సాగింది.

"యేంది దీనివల్ల వుపయోగం? తల్లికి పిల్ల దూరమయ్యిపోయె, పిల్లకి తల్లి దూరమయ్యిపోయె! మొగుడికి పెండ్లాం, పెండ్లానికి మొగుడూ దూరమైపొయ్యె !! ఆ లంజ కొడుకులు రోజూ యెవర్నో వొకర్ని - బంగారమంటాళ్లని - సంపుతూండిరి ! ! ! ఆ డోండ్లని శెరుస్తుండిరి .... యింకా యేందంట? .... అసలిదంతా ఆ పటేలు ముండాకొడుకు మూలానా, ఆ కాశిము మూలానా వొచ్చింది.... వాండ్లిద్దరూ సస్తే బాగుండును...."

"అది తప్పమ్మా ..... యింతకీ పటేలూ, ఖాసిమూ యెవరు? వాళ్లేమన్నా భూస్వాములా? కాదు. వాళ్లు జగ్గారెడ్డిలాంటి భూస్వాములతొత్తులు.... జగ్గారెడ్డిలాంటి వాళ్లు తమ ఆస్తిపాస్తుల్ని రక్షించుకొని, మనలాంటి బీదాళ్లనింకా దోచుకోటంకోసం యీ కుక్కల్ని మనమీదికి వదిలారు; అంతే. వాళ్లేగాదు. యీ నవాబుకీ, యీ కాంగ్రెసు ప్రభుత్వానికీ బీదలు తమ హక్కుల్ని అడగటం యిష్టంలేదు. యెందుకంటే అది తమ వునిక్కి భంగం. అందువల్ల వీళ్లంతాగలసి మన మీద యీ హత్యాకాండ మొదలెట్టారు... కనక యీ పటేలులాంటివాళ్లు ఆ దోపిడీగాళ్లకి కుక్కల్లాంటి వాళ్లు....."

అని సోములు యింకా వివరంగా చెప్పేడు.

అప్పటికి మధ్యాహ్నామైంది. అయినా యింకా గణపతి రాలేదు. సోములికి అతనేమైపోయాడోనని చాలా విచారంగా వుంది.

"పాపం! పిచ్చి కామ్రేడ్ .... పోవద్దన్నాను. పోలీసులకి చిక్కాడేమో!" అని సోములు విచారంగా అన్నాడు.

"అవును, బాబూ..." అంటూ కోటమ్మ నిట్టూర్చింది.

ఆ సమయంలో పొరుగింటి సుబ్బమ్మ వచ్చి రొప్పుతూ యిలా చెప్పింది.

"పిల్లా, పోలీసోండ్లొస్తున్నారే? మీ యింటో యెవురన్నా వున్న రేందీ;"

అని లోపలికి తొంగిచూసి, సోముల్ని చూసి, నోటి మీద చెయ్యి వేసుకొని, గబ గబా బయటికి వెళ్లిపోయింది సుబ్బమ్మ.

సోములు అనుకొన్నట్లుగా గణపతి "పిచ్చి కామ్రేడ్" గాదు; వాడొక పిరికిపంద. వాడు సరాసరి పటేలు యింటికెళ్లి అక్కడ క్యాంపు పెట్టిన పోలీసు ఆఫీసరు కాళ్లమీదబడి, తన ప్రాణాన్ని రక్షించమనీ, సోములుజాడ చెబుతాననీ, యేడ్చి, సోములు ఫలానా యింట్లో వున్నాడని చెప్పేడు!

.......

సుబ్బమ్మ చెప్పినవార్త వినగానే కోటమ్మ భయవిహ్వాల అయ్యింది; గత్తరపడిపోయింది. లోన ఆందోళనగావున్నా, సోములు ఆమెని శాంతిపరచజూసేడు.

కాని, ఆమె అతని మాటలు లక్ష్యపెట్టలేదు.

ఆమె మాతృహృదయం పగిలిపోయింది.

"అయ్యొ నా చిట్టిబాబూ.... వాండ్లు నిన్నింక వదుల్లరా? .... వాండ్లు ఆ లంజకొడుకులు .... నిన్ను సంపేస్తరు.... బతకనివ్వరు.... అయ్యొ నాచిట్టిబాబూ.... యాడ దాయసు నిన్ను? అయ్యో యాడ దాసేది?...." అని ఆమె యేడ్వసాగింది.

'అమ్మా... యిదుగో చూడూ... వూరుకో.... యేడవమాక.... నేను చస్తే పదివేలమంది యోధులు పుడతారు..... యేడవమాక.... చావంటే నేను భయపడటంలేదు..... ప్రజల కోసం నేను చచ్చిపోతున్నా... అంతకంటే గౌరవం యింకోటి లేదు..... అమ్మా.... అమ్మా...."

"నా చిట్టిబాబూ... అయ్యొ నాచిట్టిబాబూ...." అని ఆమె అతన్ని అమాంతంగా కౌగిలించుకొని యేడ్చింది; " నాచిట్టితండ్రీ... నిన్ను బతకనివ్వరు... రా.... దాసేచోటు లేదు... నా చీరకింద దాస్తా.... నా చీరకింద దూరు... రా......... నా చిట్టిబాబూ.... సిగ్గుపడమాక..... నేన్నీకు తల్లివంటిదాన్ని..... సిగ్గుపడమాక ..... చీరకిందదూరు.... కూచుని యెవరూ లేరని శెపుతా..... రా...."

"వుహూ. యిక నాపు. నేను దాక్కోను. పోరాడి చస్తాను. నేను పిరికిపందనుగాను... కాని.... పాపం గణపతి యేమయ్యాడో! చాలా మంచివాడు..."

బూట్లచప్పుడు వినబడుతోంది; దగ్గరగా, యింకా దగ్గరగా.... సోములు కోపంతో కోటమ్మని వొకపక్కకి పడదోసి, తలుపువోరగా మూసి, తన సంచిలోని రివాల్వరుతీసి, తలుపు వెనకాల తయారుగా నుంచున్నాడు.

అంతా అయిపోయిదంటూ అరచి కోటమ్మ వొక ధాన్యం బస్తా చాటున దాక్కొని, కళ్లుమూసుకుంది.

అంతలోనే రైఫిల్‌గుండ్ల ధనధనలు వినపడ్డాయ్. రివ్వున వచ్చి ఆ గుండ్లు గోడలకి

కొట్టుకొని బెత్తికలు వూడకొట్టేయి. తలుపులోవున్న కంతగుండా సోములు చూసేడు. చాలామంది పోలీసులు, వారివెనకాల ఖాసిమూ, పటేలూ!

సోములు మనసు మార్చుకొని, తలుపు సాంతంగా మూసి, తలుపుకంతలో రివాల్వరుమూతి దూర్చి, కాల్చటం మొదలెట్టేడు....

ధన్, యిద్దన్....

యిద్దరు పోలీసులు నేలమీద దొర్లేరు.

కోటమ్మ హృదయం సుడిగాలిలో చెత్తపరకలాగా గిర్రున తిరుగుతోంది. తుపాకిగుండ్ల గాండ్రింపుతప్పితే ఆమె కేమీ వినపడటం లేదు.

కొంతసేపైన తర్వాతకాల్పులు ఆగిపోయాయని ఆమె అనుకొంది. యేం జరిగిందో? వాళ్లు వెళ్లిపోయారా? సోములు సంగతేంటి మరి? పట్టుబడ్డాడా? చచ్చిపోయాడా? యేమిటి?

మెల్లగా ఆమె తలయెత్తి, తలుపంతా కంతలు కంతలుగా వుండటం చూసింది; ఆ కంతల్లోగుండా వెలుగువస్తోంది. పైకి లేవాలనుకుంది, కాని లేవలేక పోయింది. యెందువల్ల నబ్బా!? తననిగూడా కాల్చారా?

హఠాత్తుగా తలుపు తెరుచుకొంది; దడాలున తలకిందికి వంచింది కోటమ్మ.

"ఆ! యిడుగో రష్యన్ యేజంటు! రష్యన్ యేజంటు!" పటేలు పరమ సంతోషంతో అన్నాడు.

"బేట్కీలాగండీ సువ్వర్‌నీ!" అని ఖాసిం అన్నాడు.

"యెవడ్రా లాగేదీ? నువ్వు లాగరా! మేము నీ నౌకర్లమా యేంటి?" అని సర్కిల్ యిన్‌స్పెక్టర్ గామాలు గైమన్నాడు.

"అర్వమాకా! నేనూ నీ నౌకర్నిగాదూ.... జాగీర్దార్ దొరా వెళ్లమంటే వొచ్చా!! మాలుం?" ఖాసిం యెదురు చెప్పాడు.

"నోర్‌ముయ్, భటాఛోర్ ! యెవడ్రానువ్? తురక లంజాకొడకా!" అని సర్కిల్ భౌక్కుమన్నాడు.

పటేలు వణికిపోయేడు; ఖాసిం నోరుమూసాడు యేదో గొణుక్కుంటూ.

కోటమ్మ తలెత్తి నేలమీదపడివున్న సోముల్ని చూసింది; అతనిచుట్టూ వొక రక్తపుమడుగు వుంది !!

సర్కిల్, సోములుమీదకి వంగి అతనినాడి చూసాడు. అవును, సోములు బ్రతికేవున్నాడు; కాని స్పృహలేదు.

కొంతసేపటికి సోములకి తెలివివచ్చింది; ప్రసవవేదనతో వున్న బలహీనమైన గర్భిణీలాగా విపరీతమైన బాధతో మూల్గసాగేడు. ముక్కులతో గాలిపీల్చలేక పోతున్నాడు. నోటితో గాలి బయటికి వదిలినప్పుడుల్లా నోటి మూలలనుండి యిజ్‌మని నెత్తురు కారుతోంది; మధ్య మధ్య చిన్న చిన్న బుడగలేస్తోంది.

పోలీసులు అతని రెక్కలకింద చేతులుపెట్టి కూర్చో బెట్టేరు. అతని తల వొకవేపుకి

వాలిపోయింది; కళ్లు సగం మాత్రం తెరచివున్నాయి; మరణం ఆసన్నమవుతుండగా, గురక ప్రారంభమైంది.

ఆ ఆఫీసరు అతని ముందుకొచ్చి ముఖంలోకి చూస్తూ యిలా అన్నాడు.

"నువ్వు చావకుండా నిన్ను బతికిస్తాను. రామిరెడ్డి వాళ్లు యెక్కడుండారో చెప్పు..."

"హు......" అని సోములు మూలిగి, యెంతో ప్రయత్నంతో కళ్లు సొంతం తెరచి, సర్కిల్‌వంక వురిమి చూసాడు. సర్కిల్ మళ్ళీ అదేప్రశ్న అడిగాడు. ఈసారి సోములు అతని మీద వూసేడు; సర్కిల్ బట్టలమీద పిడికెడు నెత్తురు పడింది.

తర్వాత వాళ్లు సోముల్ని బయటికి యీడ్చుకుపోయ్యేరు. అలా యీడ్చుకుపోతుండగా సోములు తల టప టపా నేలని కొట్టుకొంది; నెత్తురు, యింకా నెత్తురు, నోటినుంచి చిందింది.

అతన్ని యింటిముందున్న తాటిచెట్టుకి కట్టివేసేరు. వొక రైఫిల్ రెండుసార్లు మొరిగింది.

సోములు శాశ్వతంగా వూపిరి విడిచేడు.

"ఆ రష్యన్ యేజంటు, రష్యన్ యేజంట్!" అని పటేలు పరమ సంతోషంతో అరిచేడు.

సర్కిల్ అతనివంక అసహ్యంతో చూసేడు.

రామిరెడ్డి దళం భయంకరమైన యీవార్తను శ్వాస బిగబట్టి విన్నది. ఆవేదనతో రామిరెడ్డి హృదయం వ్రయ్యలయ్యింది.

సోముల్ని తాను తప్పుగా అర్థంచేసి కొన్నాడు. పిరికి తనంతోనో, శత్రుభావంతోనో సోములు తమయొక్క స్థావరం గురించి చెప్పివుంటే, యీపాటికి తమగతి యేమయ్యేది? కాని నిజమైన విప్లవ సింహంలాగా - సోములు ఆపని చెయ్యలేదు. అంతకంటే మరణమే మేలు అనుకొన్నాడు. తన కర్తవ్యాన్ని తాను నెరవేర్చేడు.

"వొక కామ్రేడ్ ముల్కీయో నాన్‌ముల్కీయో అనే సమస్య యెందుకసలు? నన్ను చీవాట్లు పెట్టటంలో సైదులు మంచిపనే చేశాడు. కమ్యూనిష్టులంతా - యేకులానికి, మతానికి, ప్రాంతానికి, యేదేశానికి, యేరంగుకి - చెందినప్పటికీ అందరూ వొక్కటే కుటుంబం! అసలింతకీ యీ బలహీనత నాలో యెట్లా ప్రవేసించింది??? ......" అని రామిరెడ్డి తనలో తాను అనుకొన్నాడు.

తన బలహీనతకి, తన నేరానికి తనమీద తనకే ఆగ్రహం పుట్టి - పళ్ల సందున పడేసి తన బలహీనతని నమిలి వేస్తున్నట్లుగా పళ్లు నూరుతూ - రామిరెడ్డి కొంచెం దూరంలో కూచున్న తన కామ్రేడ్స్ వద్దకెళ్లి "నన్ను క్షమించండి, కామ్రేడ్స్ ! నేను పాపిని !! " అని అన్నాడు పిచ్చి చూపులు చూస్తూ.

మర్నాటి రాత్రి దాపులోవున్న దళాలకి కబురంపి, రామిరెడ్డి దళం పటేలు యింటిమీద భీకరంగా దాడిచేసి, యిద్దరు ముగ్గురు పోలీసుల్ని హతమార్చేరు. పటేలుమాత్రం దొరకలేదు.

తర్వాత, దళం గణపతి యింటిమీదకెళ్తే వాడుగూడా దొరకనందున, బూతులు తిట్టుకొంటూ వెళ్లిపోయేరు.

# కుచ్చితుని నిట్టూర్పు

గొర్రెలమీది ఉన్నినంతా కత్తిరించుకొన్నాక, మోసం!

గొప్పవాళ్ళా

గొర్రెల్ని ముక్కలుగా నరికేందుకు గొడారివాని కిస్తారు మాంసంకోసం!

- "ది వైట్ డెవిల్" లో, లోడొవికో (వెబ్‌స్టర్)

❋ ❋ ❋

**జ**గ్గారెడ్డి మరోసారి బొంబాయికి వెళ్ళాడని తెలియగానే, పటేలు పరమానందంతో వుబ్బిపోయాడు.

ఖాసింనీ, సత్తిరెడ్డినీ సఫాజేయించ దలచుకొన్నాడు పటేలు. యెందుకంటే గ్రామంలో తనకి పోటీగా ఆ యిద్దరూ పెత్తందార్లు అయ్యే ప్రమాదం యేర్పడింది. గ్రామాన్ని ఎవరు పరిపాలించాలి? తానా? ఆ యిద్దరా? ఎవరు ? ప్రతిదాంట్లోనూ వాళ్ళే. యిదివరకి తానొక్కడే లంచాలు గుంజేవాడు. ఇప్పుడు పోలీసుల ఆసరా జూసుకొని ఆ యిద్దరుగూడా గుంజుతున్నారు ! యెవరు లంచాలుగుంజాలి? తానా? ఆ యిద్దరా? యెవరు?

అందువల్ల వొకనాడు సర్కిల్‌తో మెల్లగా యిలా అన్నాడు, "యేమండోయ్, మనగ్రామంలో యింకా యిద్దరు కమ్యూనిష్టు లుండారు!"

"అయితే యింతకుముందు నాకెందుకు చెప్పలేదు?" సర్కిల్ భౌ మన్నాడు.

"వాళ్లు నన్ను...... అని.... భయపడ్డానండీ!"

"యెవళ్లు? వాళ్ళా? నిన్నాచంపేది? మా క్యాంపు నీ యింట్లో వుండగానే!? యెవరా లంజాకొడుకులు?"

"ఆ ! కాశిం కమ్యూనిష్టా? వాడొక తురకలంజాకొడుకైతే!?"

"అమ్మా అట్లాగాదండోయ్. రాత్రిళ్లు వాళ్లు కమ్యూనిష్టులకి అన్నం గిన్నం...."

"అయితే వుండు. యీ రాత్రే లంజాకొడుకుల్ని కాల్చేస్తాను"

## 2

తర్వాత యేంగూడుపుఠాణీ జరిగిందోగాని, పోలీసులారేత్రి ఖాసిం యింటిమీదబడి, ముస్లింద్వేషంతో అతని చెల్లెల్ని చెరిచి, అతన్ని క్యాంపుకి లాక్కొచ్చేరు సత్తిరెడ్డితో గూడా కలిపి.

ఆ యింట్లోవున్న వొక స్తంభానికి యిద్దర్నీ కట్టిపడేసేరు. ఆసమయంలో ఆఫీసర్లంతా అన్నాలు తింటున్నారు. నలుగురు పోలీసులు ఆయిద్దరివద్దా కాపలావున్నారు. సత్తిరెడ్డి యేడ్వసాగేడు.

"ఆడదానికిమల్లే యెందుకయ్యా యేడుస్తావు? ఆ తురకవాడు జూడు యెట్టా వూరుకొన్నాడో. నువ్వు కమ్యూనిష్టువి గాదూ? సిగ్గులేదంటయ్యా? వొక్క కమ్యూనిష్టన్నా

నీకుమల్లే యేడవటం నేను చూడలేదు! అసలు నువ్వు కమ్యూనిష్టువేనా? నీకు చావంటే అంతభయమైతే కమ్యూనిష్టుల్లో యెందుకు చేరా? అసలు నీయంటి పిరికివాళ్ల నెట్టా వాళ్లు పార్టీలోకి తీసుకున్నారయ్యా? ఆ?ఛీ! రష్యా సోముల్ని నువ్వెరగవూ? అబ్బ, వాడయ్యా మనిషంటే మనిషీ! అయ్యగారు చంపనని చెపుతున్నప్పటికీ ఆఁ వూఁ అన్నాడా!? ప్రాణాలన్నా వదులుకొన్నాడు గాని పార్టీ రహస్యం వొక్క ముక్క జెప్పాడా? వాడయ్యా కమ్యూనిష్టంటే కమ్యూనిష్టూ! యేడవమాకయ్యా. యేందయ్యా, యెప్పుడైనా చచ్చేదే! యెధవబతుకు, భూమ్మీద శాశ్వతంగా వుంటామా?'' అని వొక పోలీసు సత్తిరెడ్డి నిజంగా కమ్యూనిష్టే అనుకొని బోధచేసేడు.

తర్వాత ఆ పోలీసు, ఖాసింవంక తిరిగి యిలా అన్నాడు:

"నువ్వు తురకాడివని నాకు మండుకొస్తాందిగాని, నువ్వు నిజంగా గుండెగల కమ్యూనిష్టువి?''

"నేనూ కమ్మీనిష్టుని గాదువాయ్!'' అని ఖాసిం అన్నాడు.

"మరి?''

"రజాకార్‌ని!''

"తురకతొొత్తుకొడుకువా?''

"నోరు ఖాలీగా రానియ్యి!''

ఆ మాటకి ఆ పోలీసు క్రోధంతో తన చేతిలోవున్న రైఫిల్ మడమతో ఖాసింని పొడిచేడు.

అంతలో వొక పొడుగాటి ముక్కుగల పొడుగాటి పోలీసు వొకరు లోనికొచ్చి తక్కిన పోలీసుల ప్రక్కన కూచుని బందీలని యిలా అడిగేడు:

"యెందుకురా మీరు గౌర్నమెంటుతో యుద్ధంచేసేది? ఆ? మీ కమ్యూనిష్టులకి అసలు బుర్రలేదురా. మీరుపోయి యే అడివిలోనో కొండల్లోనో దాక్కుంటారు, మధ్యలో మీకోసం తిరగలేక మేము చస్తన్నాం! కాసేపు తీరుబాటు లేదయ్యే. కాసేపు నిద్రలేదయ్యే. మీరూ పెళ్లాం బిడ్డలికి దూరమైతిరి; మేమూ పెళ్ళాం బిడ్డలికి దూరమైతిమి. యెందుకురా యిదీ? మీరు గవర్నమెంటుని వోడగొట్ట గలరా? దేనికిరా యిదీ?''

"అరె, నేను కమ్మీనిష్టుని గాదువాయ్!'' అని ఖాసింఖైమన్నాడు. "నాకు తెలుసురా మీ సంగతీ! పట్టుబడ్డప్పుడు మీరు అట్టాగే అంటార్రా నాకు తెలుసురా.... నాకు తెలుసు.'' అని ఆ బారాంటి పోలీసు అన్నాడు.

తర్వాత కొంతసేపు విరామం.

హఠాత్తుగా ఖాసిం యెందుకో సత్తిరెడ్డివేపు తిరిగి యిలా అన్నాడు:

'నీ తండ్రినీ సంపీనందుక్కా నాకూ సాలా బాధగా వుందయ్యా. నేనూ మోసపోయా...'

ఆ మాటలనేప్పుడు ఖాసిం గొంతు వణికింది.

నీ తండ్రిని చంపింది నేనేనని యెరుగుదునా? హు. నాతండ్రిని నువ్వు చంపితే నీ తండ్రిని నేను వదుల్తానా!?'' అని సత్తిరెడ్డి అన్నాడు.

"ఆ ! యేమిటీ? నువ్వా ? పాపన్నా దళమ్ కాదూ?"

"కాదు. నేనే!"

"అరే, బద్మాష్! సువ్వర్...." అంటూ బూతులు తిడుతూ ఖాసిం గభాలున సత్తిరెడ్డి గొంతు పట్టుకొని నొక్కసాగేడు.

"ఛీ. నీచపు లంజాకొడకల్లారా. కని పెంచిన తండ్రుల్ని చంపారంట్రా!?" అంటూ ఆ బారాంటి పోలీసు తన చేతిలోని తుపాకితో చెరొకపోటూ పొడిచి యిద్దర్నీ వదిలించేడు.

"ఛీ నీచపు లంజాకొడకల్లాలా!"

కొంతసేపైనాక, "నేను కమ్యూనిష్టుగాదు" అంటూ సత్తిరెడ్డి మళ్లీ యేడ్వసాగేడు: "నన్ను వొదిలిపెట్టండి."

ఛీ, మీ ముఖాలు చూడగూడదురా. మిమ్ముల్ని వదిలిపెట్టాలా? మిమ్ముల్ని ముక్కలుముక్కలుగా నరికి వుప్పుపాతళ్లు వెయ్యాల్రా!" అని బారాంటి పోలీసు అన్నాడు.

"వదలవోయ్ పాపం. యెన్ని పనులుండయ్యో యింటికాడా" అని యింకొక పోలీసు వెటకారంగా అన్నాడు.

సత్తిరెడ్డి యిదేమీ వినిపించుకొన్నట్లు లేదు.

"కావాలంటే పటేలుగార్ని అడగండి నేను కమ్యూనిస్టు నేమో! ఆయన యెరుగు! ఆయన్నడగండి..."

ఆ సమయంలో ఆఫీసర్లంతా లోనకొచ్చేరు. వొక ఆఫీసరు - సత్తిరెడ్డి యింతకుముందు అనిన మాటలు విన్నాడల్లే వుంది యిలా అడిగేడు.

"నువ్వు కమ్యూనిస్టువి కాదురా?"

"కాదండయ్యా."

"అయితే యెవరవు నువ్వు?"

"నేనూ యేమీగాదండీ"

"యేమిటీ! మనిషివిగూడా గాదా?"

"అదిగాదండయ్యా...."

"అరే, సీత యెవర్రా?"

"సీతా?"

" నీ అన్నకూతురు గాదూ?"

" మా అన్నకీ నాకు ఇరవైయ్యేళ్లమట్టీ యిరోధమండీ! యింకా పటేలు నడగండీ.... అయ్యా.... అయ్యా.... నన్ను రచ్చించండి .... అయ్యా"

కొంతసేపటి తర్వాత ఖాసింనీ, సత్తిరెడ్డినీ బయటికి తీసికెళ్ళి కాల్చిపారేశారు.

మంచంమీద పడుకొని తుపాకిమోత విన్న పటేలు సంతృప్తితో నిట్టూర్పు విడిచేడు!!!



# ప్రజల పుత్రిక

ఇప్పుడొక మహనీయ జ్యోతి
గప్పుమని ఆరిపోయింది....
నిదురించు, నిదురించు కమనీయమూర్తీ
నల్లడల వెలుగొందుగాత నీ కీర్తీ

- హోరాషియో - సీజర్‌లో (షేక్స్‌పియర్)

❊ ❊ ❊

ఆ రాత్రి చాలా వుక్కగావుంది. ఆకాశంలో చుక్కలు నిద్రపట్టక రెప్పలార్పుతున్నాయి. దోమల్నీ, వుక్కనీ, నల్లుల్నీ, యేడ్చేపిల్లల్నీ, ముసలాళ్ల దగ్గుల్నీ తిడుతూ గ్రామం కునుకు తీస్తోంది.

అంతలో, అకస్మాత్తుగా, వొకకుక్క అరిచింది; తక్కిన కుక్కలు అది అందుకొన్నాయి. కొంతమంది గ్రామస్థులులేచి తమతమ తలుపుల కంతల్లో గుండా చీకట్లోకి చూసేరు; యేమీ కనపడటం లేదు. కాని కొంతసేపటి తర్వాత కుక్కల అరుపుతో బూట్లచప్పుడు విన వచ్చింది.

మలబార్ స్పెషల్ పోలీసులూ, స్పెషల్ ఆరన్డ్ పోలీసులూ గ్రామంమీద దాడిచేస్తున్నారు. గ్రామస్తులకి యింకా నిద్రమత్తు వదిలీవదలక ముందే ఫట్ ఫట్‌మంటూ వారి శరీరాల మీద "అహింసా" లాఠీలు విరుచుకపడినాయి. గ్రామస్తుల్ని తోస్తూ, తన్నుతూ, బాదుతూ, బూతులు తిడుతూ పోలీసులు గ్రామ మధ్యంలోకి కొట్టుకొచ్చేరు. అక్కడ అందర్నీ వరసల్లో నిలబెట్టేరు.

తర్వాత ప్రశ్నలు మొదలైనవి ప్రారంభమైనాయి బూతుల్లో గలిసిః

"పంచుకొన్న భూమి యిస్తారా లేదురా?"

" ఆ లంజాకొడుకులకి యెందుకురా మీరు అన్నాలు జేరేసేదీ?"

"కాంగ్రెసుకీ జైయ్యని అరవండి"

"కమ్యూనిస్టులు నశించాలని అరవండి, హూ."

"రామిరెడ్డివాళ్లు యెక్కడుండారు?'

........................................................

దెబ్బలకి తాళలేక ప్రజలు అరిచారు, యేడ్చారు, బొబ్బలుపెట్టి మూలిగారు - కాని వొక్కరంటే వొక్కరుగూడా పెదిమలు విప్పలేదు! వారికి గెరిల్లాలను గురించి చాలా తెలుసు. కాని గెరిల్లాలెవరు? తమబిడ్డలు గాదా? తమకోసం పోరాడటంలేదా?

సామాన్య పోలీసులెవరూ ప్రజల్ని కొట్టలేదు వాళ్ళలో వొకరో అరో తప్పితే; వారంతా హాత్‌హుత్ అని అరిచి లాఠీల్ని కొట్టినట్లు అటూయిటూ తిప్పారేగాని కొట్టలేదు. కాని ఆఫీసర్లలోచాలామంది ప్రజల్ని నిర్దాక్షిణ్యముగా, రాక్షసంగా, మానవత్వం లేకుండా చావబాదేరు.

ఆడవాళ్లు కీచుమని అరుస్తూ ఆఫీసర్లని తిట్టిపోసారు. కోటమ్మకి, యీ నరకమంతా చూస్తావుంటే, పిచ్చెత్తినట్లైంది.

"మీ పెళ్ళాల తాళ్లు తెగ! మీరంతా సస్తార్రా లంజకొడకల్లారా!'' అని ఆమె చేరెడు దుమ్మెత్తిపోసింది; ఒక మలబారు పోలీసు ఆమెని గుండెల్లో పొడిచాడు తన తుపాకితో;

ప్రశ్నలవ్వీ అయినాక, దిలాసాగా పటేలు బయలుదేరేడు. ప్రజలు అతనివంక మింగేట్లు చూసారు. ప్రజల్లోంచి కొంతమందిని పటేలు బయటికి లాగించి నుంచో బెట్టించాడు

ఆ కేటాయించబడినవారిలో గంగీ, ఆమెభర్త సోమన్నా ఆమె మామ వీరన్నా మొదలైనవారున్నారు.

వీరన్న సంగతి వొకటుంది.

కాంగ్రెసుసైన్యం నైజాంమీదకి రాకముందు వీరన్న తాను పాపన్నదళంలో సభ్యుడు. కాని, నెహ్రూ సైన్యాలు తమని వుద్ధరించటానికి వస్తున్నాయనే ప్రచారానికి వీరన్న గూడా మోసపోయేడు. అందువల్ల దళం అనుమతి తీసుకొని వీరన్న బయటికొచ్చి గ్రామంలో వుంటున్నాడు.

అదీ సంగతి........

కేటాయించబడినవారు పటేలు యింటికి - అంటే పోలీసు క్యాంపుకి - తీసుకొని పోబడ్డారు.

"నన్నొదలండి, మాప్రెభో...... నేను బీదోణ్ని........... ముసలోణ్ణి నాకేమీ తెలవదు......' ' అంటూ వీరన్న దోవ పొడుగూతా దణ్ణాలు పెట్టేడు.

తన మామను మింగేట్లు చూసింది గంగి; సోమన్న - ఆమెభర్తమాత్రం మౌనంగా, విచారంగా వున్నాడు. అతనేమీ మాటాడలేదు.

"జరగాల్సిందేదో జరుగుద్ది. సచ్చేవాండ్లం సావకుండ వుంటమా. బతికేవాండ్లం బతక్కుండ వుంటామా? అంతా ఆ పరమాత్తుడిదయ!'' అని సోమన్న అనుకొన్నాడు.

క్యాంపులో, వారిని మరోసారి ప్రశ్నించేరు. వొక్క వీరన్న తప్ప తక్కినవారు నోరు విప్పలేదు. వీరన్న మాత్రం, "నాకేం తెలవదు, మాప్రెభో..........'' అంటూ మొదలుపెట్టేడు.

ఇద్దరు సార్జంటూ - అందులో వొకడు నల్లగా, లావుగా, పెద్దకళ్లు గలిగివుంటాడు; రెండోవాడు యెత్తుగా, అందంగా వుంటాడు - మరికొందరు మలబార్ పోలీసులూ గలిసి వీరన్నా వాళ్లని నదివొడ్డుకి తీసికెళ్లేరు వొక్క గంగినితప్ప.

తమ పని ఖాళీయని వీరన్న అనుకొన్నాడు. కాని పొడుగ్గా, అందంగా వుండే సార్జంటు ముఖం చూస్తుంటే - ఆ ముఖంలో కరుణ కనబడుతుంది. వీరన్నకి యింకా ఆశగానే వుంది. అలాంటి దయగల ముఖంగల మనిషి తమని చంపగలడా?

నది నిండుగా, ప్రశాంతంగా వుండి - మంచి ఆరోగ్యం గల పసిపాపకుమల్లే - నిద్రించుతూన్నట్లుంది. అక్కడా యిక్కడా వొడ్డుప్రక్కల మాత్రం మధ్యమధ్యయేదో గలగల

శబ్దంవస్తూ దాని ప్రశాంతతని చెడగొట్టుతోంది. మురికిజేబు రుమాళ్లతో ముఖాలు తుడుచుకొని, ఆ సార్జంట్లు తమ ఆఫీసరు తమకిచ్చిన రాక్షస ఆజ్ఞల్ని పూర్తిచేయ పూనుకొన్నారు.

మొదట వీరన్ననీ అతని కొడుకునీ తాళ్ళతో కట్టివేసారు. నదిఒడ్డున వొక చెట్టుతొర్రలోంచి వొక గుడ్లగూబ కేర్‌కేర్ మన్నది; తర్వాత మలబార్ పోలీసులు వణికే చేతుల్తో ఆ యిద్దరి జన్మ అంగాలూ, బీర్జాలూ కోసారు. వారిద్దరిబట్టలూ రక్తకొల్లులయ్యాయి. యిద్దరూ అతితీవ్రమైన బాధతో అరుపులు పెట్టసాగేరు. ఆ పైని మళ్ళీ ప్రశ్నలవర్షం, అందుకు జవాబు యేడ్పులు మాత్రం.

ఆ యిద్దరికీ కొన్ని రహస్యాలు తెలుసు.

కాని ఆ నీచపు పనికంటే చావే వుత్తమం.

తర్వాత సార్జంట్లు ఆ బీర్జలనీ జన్మ అంగాలనీ ఆ ఇద్దరి నోళ్ళల్లో కుక్కారు.

ఆ తర్వాత పోలీసులొక గొయ్యి తవ్వేరు.

ఆ గొయ్యి తన భయంకరమైన అంధకారపు నోరు తెరిచింది. ఆ ఇద్దర్నీ ఆ గోతిలో వేసి పూడ్చిపెట్టేరు బతికి వుండగానే!

అంతే, మళ్ళీ వారియేడ్పులు వినబడలేదు.

క్యాంపువద్ద యింకొక రకంగా వుంది.

పటేలు పెద్దయిల్లు పోలీసుల్తో, సైనికుల్తో తిరణాలగా వుంది. వారి ఆఫీసర్లు తాగి తందనాలు తొక్కసాగారు.

గంగిని నలుగురు ఆఫీసర్లు వొక చీకటిమూలకి తీసికెళ్ళి క్రూరంగా.... నీచంగా.... రాక్షసంగా.... చెరిచారు. ఆ తర్వాత మరికొంతమంది.... ఆఖరికి, ఆమెకి స్మృహతప్పినాక, తీసికెళ్ళి బజార్లో పడేశారు.

కాని ఆ రాక్షసత్వం అంతటితో ఆగలేదు.

పటేలు కొక కూతురుంది. యీ మధ్యనే ఆ అమ్మాయికి పెళ్ళి అయింది. ఆఫీసర్లు ఆ యింట్లో క్యాంపు పెట్టినప్పటి నుంచీ అదో రకంగా వుంటున్నారు. వారి విషపు చూపులు ఆ అమ్మాయి చక్కని ముఖముమీదా, గుండ్రని కోమలమైన మెడమీదా, యెత్తుపాటి వక్షోజాలమీదా పడినాయి. కాని ఆఫీసర్లకీ అవకాశం దొరకలేదు. యీ రాత్రి వారు మృగాలకి మల్లే పెచ్చురిల్లటంవల్ల వారికి నిద్రపట్టలేదు.

మెల్లగా వారు ఆ అమ్మాయి నిద్రించుతూన్న గదిలో జొరబడి, ఆమె మంచాన్ని పెరటిదొడ్లోకి పట్టుకొనిపోయి, అక్కడ ఆమెని....

తనకూతుర్ని దొడ్లోకి తీసికొనిపోవటం పటేలు చూసే వున్నాడు. కాని, పిరికితనంతో, ముఖంనిండా గుడ్డకప్పుకొని, కన్నీళ్ళు పెట్టుకున్నాడు. ఆ బంగారుబొమ్మ - తన కూతురు అంటే పటేలుకి అంతప్రేమ తన పిల్లలందరిమీదకన్నా....

# 2

గంగి ఆ నేలమీద, బజార్లో, దోమలుపట్టి పీకుతున్నా, మైకంతో పడివుంది. బజార్లో మనుషులెవ్వరూలేరు. యిళ్లచూరులకిందుగానూ, తలుపు కంతలగుండానూ, కిటికీలగుండానూ స్త్రీలూ పురుషులూ ఆ చీకట్లో సరిగా కనపడీ కనపడని గంగి ఆకారంవంక కళ్లు పొడుచుకొని చూస్తున్నారు.

ఆమె పెంపుడుకుక్క వొకటి - నల్లగావుండి దొప్పచెవులు గల వొక విశ్వాసం గల జంతువు - ఆమె పక్కన కూచుని అతి విచారంతో మోరయెత్తి యేడుస్తూ, మధ్య మధ్య వంగి ఆమెని వాసనజూసి నాకుతోంది.

కొందరు పిల్లలు - అబ్బ, తెలంగాణపోరాట సమయంలో పిల్లలు యెంతగా తోడ్పడ్డారు!! చల్లగా ఆమె వద్ద కొచ్చి ఆమెని పైకి యెత్తటానికి ప్రయత్నించి విఫలులయ్యారు; దీనంగా దిక్కులు చూశారు. ఇంతలో ఆదృశ్యాన్ని వొక తండ్రి చూసేడు; అంతలో మరొకతండ్రి, వొకతల్లి, మరొక తల్లి........త్వరలో కొందరు పెద్దవాళ్లు అలావచ్చి ఆమెని మోసుకెళ్లి యింటివద్ద వొక మంచంమీద పడుకోబెట్టేరు.

గంగికి స్పృహ వచ్చేసరికి తొలికోడి గూసింది. యేడ్చి యేడ్చి యెర్రబారిన కళ్లతో, విచారంతో ముడుచుకుపోయిన ముఖంతో, ఆమె అమ్మమ్మ ఆమె పక్కన కూచునివుంది. గొంతు పగిలేట్లు యేడ్పులుపెట్టి దొర్లినాక గంగి చంటిపాప అవ్వవొడిలో నిద్రిస్తోంది.

గంగి యింటి కప్పులవంక వెర్రిగా చూసింది. ఆమె కడుపులో యేవో ఖూనీపోట్లు పొడుస్తున్నాయి, పెదిమలు విరుచుకొంటూ, పళ్లు బిగబట్టి మూల్గుతూ ఆమె మంచంమీద నడుంపైగా బండిపోయిన ఆవుదూడలాగా - మెలికలు మెలికలు తిరగసాగింది.

"వొండిన బువ్వేది?" గంగి మూలిగింది.

"యెందుకు? యెవరు తీసుకెళ్తిరు బువ్వని?" ముసలమ్మ అంది.

"నేను! యాడుంది.... కూటికుండ?.... వాండ్లు ఆకల్తో సస్తుండి వుండాలి...."

ప్రతిరాత్రి గంగి రామిరెడ్డి దళానికి అన్నం చేరవేసేది. ఆ అన్నాన్ని మళ్లీ రాత్రి వచ్చేవరకూ వారు సరిపెట్టుకొనేవారు. కాని యీరాత్రి ఆమె.......

విశ్వప్రయత్నం చేసి గంగి లేచింది; ఆమె అమ్మమ్మ ఆవురుమన్నది నోటిలో గుడ్డ కుక్కుకొని....

గంగి ఆ అన్నవుకుండని నెత్తిమీద పెట్టుకొని, పసిపాప వంకనన్నా చూడకుండా, అరణ్యానికి బయలుదేరింది......

యింకా తెల్లారలేదు. తమ రాత్రి కాపలా తర్వాత చుక్కలు నిద్రమత్తుగా వున్నాయి. వీధుల్లో యెవరూ లేరు. వాయవ్యమూల నుండి అదో చలిగాలి వీస్తోంది. గ్రామంలో కొచ్చే బాటలన్నీ కాపలా గాయబడుతున్నాయని గంగికి తెలుసు. అందువల్ల పొలాలమీదుగావున్న బాటకి ఆమె బయలుదేరింది. ఆ బాటనిండా ముళ్లూ ముతకా వుంటాయి. అయినా తప్పదు.

గ్రామం దాటినాక, ఆమె తొడలమీదుగా వెచ్చని రక్తం కారసాగింది. యీ మరకల గుర్తులు పోలీసులు చూస్తే యింకేమన్నా వుందా!? అందువల్ల ఆమె కుండనిదించి, చీరని యెగగట్టి, గట్టిగా గోచీ పెట్టింది.........

మధ్య యుగాల్లోని పెద్దకోటగోడలాగా, నల్లగా, యెత్తుగా భయంకరంగా దూరాన అరణ్యం అగపడుతుంది.

నడిచీ నడిచీ ఆమె అరణ్యం చేరింది. అప్పటికి తూర్పు రేఖలు తెల తెలవారుతున్నాయి. అరణ్యంలో యింకా చీకటిగానే వుంది. ముళ్ళపొదలమధ్యగానూ, చెట్లగుంపులచుట్టి తిరుగుతూనూ, ఆమె నడవాల్సివచ్చింది. కుళ్ళిన ఆకులకంపూ, బాగా పెరిగిన గడ్డికంపూ మిళితమై అదోరకం వాసన గొడుతోంది. యెండుటాకులు ఆమె పాదాలక్రింద గరగర మంటున్నాయి, మధ్య మధ్య ముళ్ళతీగెలు ఆమె కాళ్ళని చీరుతున్నాయి.. యింకా బయటికి పోకుండా గూళ్ళల్లో కూచుని పక్షులు విచారంగా ధ్వనులు చేస్తున్నాయి. గంగిచీర రక్తంతో బాగాతడిసి తొడలకి అంటుకొన్నది.

క్రమక్రమేసి ఆమెచూపు తగ్గిపోతోంది.

ఆమె నరాలు గుంజుతున్నాయి పట్కారుబెట్టి లాగినట్లు.

మృత్యువు ఆమెని నమలసాగింది....

అయినా ఆమె ముందుకు పోతూనేవుంది.....

ఆమెని చూడగానే రామిరెడ్డి, కోటిరెడ్డి ముందుకొచ్చి కుండ దింపేరు. ఆమె ముఖంలో మృత్యువుని చూసి రామిరెడ్డి నివ్వెరగొనిపోయేడు. యెందుకబ్బా?

కుండని దింపుతూండగానే, గంగి తూలి, విరగదీసుకుని పడబోతూంటే కోటిరెడ్డి పట్టుకున్నాడు; తాను కూచుని తన తొడమీద ఆమెని పండుకోబెట్టాడు. రక్తం! రక్తం!!

ఆమె నోటంట రక్తపు నురుగు పడుతోంది.

ఆమె కళ్ళు గిరగిరా తిరుగుతున్నాయి.

కొంతసేపటి తర్వాత ఆ నేలమీదపడి ఆమె గిలగిలా కనేప్పుడు గోర్కీ తల్లిలాగా కొట్టుకొంది.

హఠాత్తుగా ఆమెగొంతులో యేదో గురగుర వినపడింది.

రామిరెడ్డి ఆమె శరీరాన్ని తాకిచూసాడు. చలికాలంలో పసిపాప చేతులకన్నా ఆమె శరీరం చల్లగా వుంది.

ఆమె చనిపోయింది ! ! !

వొక వారంరోజుల తర్వాత దళాలు మరొకసారి పటేలు యింటిమీద పడ్డారు.

పటేలు దొరికేడు.

అతన్ని తుంపులు తుంపులుగా నరికారు.

అతని కొంపకి నిప్పుముట్టించారు.....

# కమ్యూనిష్టు పార్టీ జిందాబాద్ ! ! !

అలా,

భూమికోసం
భుక్తికోసం
శాంతికోసం
సుఖంకోసం
వేలకొద్దీ ప్రజలు పోరుచు
నేలకొరిగారండి !
మూడువేలమంది ప్రజలూ
నాడు ప్రాణము లిచ్చిరండీ !!

కానీ,

పోరుయింకా ముగియలేదు
వారి జీవం చావబోదు.
నిశ్చితంగా
ఖచ్చితంగా
ప్రజలు విజయమ్మందుతారు
విజయధ్వజమ్మెత్తుతారు
తెలుగు వీరులరక్తమదిగో
తెలంగాణాకు హారతిదిగో ! ! !

- "మోహన్"



ఇంతవరకూ రామిరెడ్డీ, సీతా కలిసికోనేలేదు. అసలామె యెక్కడుందో యేమిటో, అసలు బతికుందో లేదో గూడా రామిరెడ్డికి తెలీదు. మిలిటరీ, పోలీసు దాడులు అంతతీవ్రంగా వున్నాయి.

కాలం - గలిబిలిగా, భయంకరంగా వుండేకాలం - దొర్లుకొని పోతున్నది. ఆఖరికి వొకనాటిరాత్రి సీతని గురించిన వార్త రామిరెడ్డికి చేరింది. సీత, మట్టయ్య అనే హరిజన కామ్రేడూ మాత్రమే బతికున్నారట. అందువల్ల వేరే దళం యేర్పాటు చేయటంకోసం ఆ యిద్దర్నీ నాంచారమ్మ గుడివద్దకి వచ్చి, తన కోసం యెదురు చూస్తూండమని రామిరెడ్డి కబురంపేడు....

అప్పటికి అర్ధరాత్రి అయ్యింది. ఆకాశం నిర్మలంగా వుంది. అంతూ దరీ లేని దాని అంధకారపు కోణాల్లో నక్షత్రాలు చిరునవ్వు నవ్వుతూ కనుసైగ చేస్తున్నట్లున్నాయి. సన్నని పొగమంచుతెర భూమిమీదనిలిచివుంది. చలివేస్తోంది.

ఒకస్కాటూ, రామిరెడ్డి గలసి నాంచారమ్మ గుడిమెట్లమీద కూచున్నారు. రైఫిళ్లు రెడీలో వున్నాయి.

కొంతసేపటి తర్వాత వారు యెవరివో పాదాలచప్పుడు విన్నారు. రెండు ఆకారాలు ఆ పొగమంచు తెరలోగుండా వారివద్ద కొచ్చినాయి. అందులో వొకరు సీత, రెండో వారు మట్టయ్య.

సీత, రామిరెడ్డి ముందు నుంచుని సిగ్గుసిగ్గుగా చిరునవ్వు నవ్వింది. లోపల యేదోనేరం చేసినట్లు, బాధ పీకుతున్నప్పటికీ రామిరెడ్డి ముఖం ఆనందంతో వికసించింది.

ఆ నలుగురూ అక్కడినుంచి కొండలవద్దకెళ్ళి, వాటి ముందర కూచున్నారు. రామిరెడ్డి, సీతా ఆ తక్కిన యిద్దరికీ కొంచెం దూరంలో కూచున్నారు.

యెన్నాళ్లనించో వొకర్నొరు చూడాలని ఆ ప్రేయసీ ప్రియులు వుబలాట పడుతున్నారు. నేడు వారి కోర్కె ఫలించటంతో వారికి బ్రహ్మానందంగా వుంది. ఆ నైజాం నరకంలో రాక్షసుల చేతుల్లో బాధలుపడుతూ, ఆ యిద్దరూ తాము వొకనాటికైనా కలిసికొంటామని అనుకోలేదుసరిగదా, కనీసం కలలోగూడా ఆ విషయాన్ని నమ్మలేదు. యేమో, యేక్షణాన యేం జరుగుతుందో!? భవిష్యత్తు అంతా అగమ్య గోచరంగా వుండింది.

కొంతసేపటివరకీ, తమలో రేగుతూన్న భావాల్ని వారు మాటలద్వారా వెలిబుచ్చుకోలేక పోయారు. వొకరి కళ్లల్లోకి వొకరు తేరిచూసుకొంటూ కూచున్నారు.

యిదివరకి సిగ్గుగా, అమాయికంగా వుండే సీతని గురించి ఆలోచించుతూ రామిరెడ్డి వింతనొందేడు. యెంతమార్పు ! యెంతలో యెంతమార్పు!! సీత గూడా రామిరెడ్డిని గురించి అలాగే అనుకొంది యెంత మారిపోయాడు !

జీవితం - భయానకమైన జీవితం విజ్ఞాన జ్యోతిని వెలిగించే జీవితం యెల్లప్పుడూ మారుతూండే జీవితం వారిలో చాలమార్పు తీసుకొచ్చింది.

భూస్వామ్య విధానానికి వ్యతిరేకంగా తెలంగాణ జరిపే పోరాటంలో యెక్కువమందికిమల్లే ఆ యిద్దరుగూడా తమ తప్పు తుప్ప వదలిపోగా పునర్జన్మ యెత్తేరు.

మొదట రామిరెడ్డే మాటాడేడు.

"జరిగినదాన్ని మరిచిపోదాంపట్టు.... నేను నిన్ను తప్పుగా అర్థంచేసికొన్నాను..... క్షమించమని అడుగుతున్నా....."

"ఇశ్.... యేమున్నది అందుట్లో? అయిందేమో అయిపోయింది. యింకా యెందుకు తడిమేది దాన్ని?" అని అడ్డు తగిలింది సీత.

"సరే సరే" అన్నాడు రామిరెడ్డి, గతాన్ని తడిమితే దానికేదో బాధకలుగుతుందా అన్నట్లు.

"మీ తాత కొండారెడ్డి చనిపోయిన సంగతి నీకు తెలుసా?"

"ఆ...." అని ఆమె అన్నది, భారంగా గాలి పీల్చుతూ.

"యెంత మంచాడు! యెంత గొప్ప హృదయంగల వాడు!!"

"అవును... మరి మమ్మూ సాయిబూ?"

"అవునవును!"

"పాపం, యెంతో యిదిగా నన్ను పలకరిచ్చేవాడు. నాతో సరసమాడేవాడు... అసలు యెవరన్నా యెంతో ప్రేమగావుండేవాడు. పాపం!"

"ఆ..... నీ విషయమేంటో కాస్త చెప్పు......"

"యేమున్నది? యెక్కడైనా వొకటే... నిద్రలేదు.... తిండిలేదు. కొన్నిసార్లు... నాలుగేసి రోజులపాటు గూడా తిండి దొరికేదిగాదు... యేదో ఆకో అలమో తినేవాళ్లు.... వొక కామ్రేడు ఆ ఆకు తినే యిరేచనాలతో చచ్చిపోయాడు గూడాను... యిదే సంగతి.... మరి నీ..."

"సరిగ్గా అంతే మా సంగతి గూడాను."

"మరి మన ప్రజల సంగతేంటి? మాకు పెద్దగా తెలవటం లేదు...."

"ప్రజల కేం? ప్రజలు యెప్పటి మాదిరిగా మన పార్టీ మీద విశ్వాసంతోనేవున్నారు. కాని యీ దాడులు కొంచెం వారిని....."

'అబ్బా, యెంతమార్పు, యెంతమార్పు ! మనమంతా చాలా మారిపోయాం సుమా!!!' అని సీత - పెళ్ళికూతురు తన కొత్త ముస్తాబుచూసి వుబలాటంతో అనుకొనేట్లు - అన్నది వుబలాటంతో.

"నిజం!"

"వీరన్నని బతికుండగానే పాతిపెట్టారంటగదూ?"

"అందులో వింతేముంది? రోజూ అట్లాంటివి జరగటల్లా? వీరన్నేగాదు, పాపన్న పని గూడా అంతేఅయ్యింది...."

"యేమిటి! యేం జరిగిందేమిటి?

"వొకనాడు పాపన్నని పట్టుకొన్నారు; రహస్యాలు చెప్పమని బాధించారు. అతను చెప్పలేదు. ఆపర్నే వొక నల్ల చీమలపుట్ట వద్దకి లాక్కెళ్లి, పుట్ట నాలుగేపులా కట్టుగొయ్యలు పాతి, అతన్నా పుట్టమీద వేసి, ఆ కట్టుగొయ్యలకి కట్టేశారు లంజాకొడుకులు... అక్కడ పోలీసుల్ని రెండు మూడు రోజులపాటు కాపలాబెట్టారు... నల్లచీమలు అతన్ని.... పీలికలు పీలికలుగా.... మాంసమంతా..... పీక్కుతిన్నయ్యి.... అతను చచ్చిపోయాడు!"

"హబ్బా!"

"ఆ సంగతిపోనియ్యి. నీకొక గమ్మత్తు సంగతి చెపుతావిను.... వొకనాటి రాత్రి, బాగా నిద్రలమీదవుండగా, గెరిల్లాలు వచ్చినట్లు, పటేలు యింటో క్యాంపుపెట్టిన పోలీసుల్లో వొకడికి కల వచ్చింది. యింకేం? వాడు అరుస్తాలేచి మారో మారో ఫైర్ ఫైర్ అన్నాడు. యిక జూడు సామిరంగా అందరూ గెరిల్లాలు గెరిల్లాలంటూ లేచారు. అంతా చీకటిగా వుంది. ఆ చీకట్లో అందరూ కాల్పులు మొదలెట్టారు ! యెవర్ని? తమలో తమనే కాల్చుకోటం మొదలెట్టారు !! దుగ్గు, దుగ్గు!!! చూశావా పార్బు?" అంటూ రామిరెడ్డి నవ్వేడు. సీత గూడా ముసి ముసి నవ్వులు, వినబడకుండా నవ్వింది.

"తర్వాత వారు పోరాట విధానాలను గురించీ, దళాల యేర్పాటుని గురించీ మాటాడుకొన్నారు.

వారలా అదీ యిదీ మాటాడుకొంటూండగానే హఠాత్తుగా వారికి తుపాకిమోత వినిపించింది.

అందరూ సర్రున కొండయెక్కి మాయమయ్యేరు.

## 2

తెలంగాణా ఆకాశపథంలో కారునలుపు మబ్బులు అలముకొని భీకరంగా బెదరించుతున్నాయి.

రైతులు తయారుగావున్నారు. తాము దున్ని పండించిన పంటల్ని తాము అనుభవించనన్నా అనుభవించాలి, లేదా కరువు బాధతో కాలి చావనన్నా చావాలి.

అంతే; మరోమార్గం లేదు.

పంటలు కోసుకొనిపోటానికి జాగీర్దారు విశ్వప్రయత్నం చేస్తున్నాడు. కాని, బాధలకన్నా సహించారుగాని, కూలీలు మాత్రం తాము రామని యెదురు తిరిగేరు. యిక పోలీసుల చేత కోయించినా యెంతని, యెక్కడని, కోయించగలడు?

ఒకనాటిరాత్రి రామిరెడ్డి దళంతోపాటు యింకా మూడు దళాలుకలసి జొన్నచేలలో తయారుగా కూచున్నాయి.

పెద్ద గోధుమరంగు సముద్రంలాగావున్న జొన్నచేలు తమ తలలూపుతూ మర్మరధ్వనులు చేస్తున్నాయి.

అన్ని రకాల స్త్రీ పురుషులూ - కుంటీ గుడ్డీ, చెవిటీ మూగా, రోగులూ గీగులూ, పిల్లాజెల్లా, చిన్నా పెద్దా ముసలీ ముతకా, రైతులూ కూలీలూ, వ్యాపారులూ, వారూ వీరూ, అందరూ చేత కొడవళ్లుబట్టి, యెర్రజండాలు తమపైన రెప రెపలాడుతుండగా, వందలకొద్దీ, వేలకొద్దీ జొన్న చేలవద్ద కొస్తున్నారు. వారి ముఖాల్లో ఆగ్రహం, ద్వేషం కనపడుతున్నాయి.

కుచ్చులాగావున్న బంగారు కంకుల్ని వారంతా కోయసాగేరు; కొద్ది నిమిషాల్లో పసిపాప కన్నీళ్ళకుమల్లే, సూర్యునిముందు చీకటికిమల్లే, వారి మౌనవ్రతం త్వరగా మాయమైపోయింది. వారంతా సరసాలాడుకొంటూ, నవ్వుకొంటూ కోయసాగేరు.

అకస్మాత్తుగా, వారికి మోటార్ల ధ్వని వినిపించింది.

అవును, అవి మిలిటరీ ట్రక్కులూ, పోలీసు వ్యానులూనూ!

కిందికి దిగకుండా వాళ్లు కాల్పులారంభించేరు. కోసే ప్రజలు చప్పున నేలమీద పడుకొని, దూరంగా, చేలమధ్యలోకి ప్రాకిపోయేరు.

దళాలు అప్పుడు ముందుకి ప్రాకివచ్చినాయి. కాల్పు ప్రారంభించాయి. విజ్ విజ్‌మంటూ దళాల నెత్తిమీదుగా గుండ్లు దూసుకొనిపోతున్నాయి. దళాలు కాల్చిన గుండ్లు పోలీసువ్యానులకి తగిలి టంగ్ టంగ్ మంటున్నాయి; అందువల్ల అవి నిష్ఫలమౌతున్నాయి.

"వుండండి. నే బోయి పేల్చేస్తా ఆ బండ్లని" అన్నాడు సైదులు.

"సరే.పో. జాగర్త"అన్నాడు రామిరెడ్డి.

సైదులు మెల్లగా ప్రాకిపోయి ఒక గ్రెనేడ్ విసిరేడు; వ్యాను టైరు వొకటి ఠాప్‌మని ప్రేలిపోయింది అంతే. పళ్లు నూరుతూ సైదులు యింకొకటి విసిరేడు. వ్యానుకి కొట్టుకొన్నది.

ఇంతలో అతని తలలో యేదో మేకులాగా గుచ్చుకొంది. అవును, తుపాకి గుండు! అదేమిటి కళ్లు తేలిపోతున్నాయి? అవును, యిక తాను బతకడు!!

సైదులు వొక చేత్తో రైఫిల్ పట్టుకొని ప్రాకుతూ దళాల వద్దకి పోయేడు.

"యిదిగో, కామ్రేడ్.... యిదిగో రైఫిల్..... శె...ల...వు!" ఆ మాట అంటూండగానే ాణాలు వదిలేడు.

ాత నర్సిరెడ్డి - జాగీర్దారు చిన్నకొడుకు ముందుకి ప్రాకిపోయేడు. అతనూ వొక ...ఎ.... అతని గూబలో వొక... నర్సిరెడ్డి గూడా అసువులు ...దిలేడు.....

...మ్యూనిస్టుపార్టీ జిందాబాద్!" అదే అతని ఆఖరు మాట.

తర్వాత రామిరెడ్డి ముందుకి ప్రాకిపోయేడు. పోయి పోయి వొకట్రక్కు వెనకాలకి వెళ్ళేడు. యేంజరిగిందో యేమో వొక మలబార్ పోలీస్ అతని మీదకి దూకేడు... తర్వాత యింకొకడు.. అందరూ గలిసి కట్టివేసి, అతన్ని ఆ ట్రక్కులో పడేసేరు.

వొక అరగంట తర్వాత తుపాకి మోత ఆగింది. పోలీసులంతా మళ్ళీ క్యాంపుకి తిరిగొచ్చేరు....

పొట్టిగావుండి, యెర్రటి కళ్లుగల వొక ముసలి ఆఫీసరు వద్దకి రామిరెడ్డి తీసుకొని పోబడ్డాడు. అతనేదో సిగరెట్టు కాలుస్తూ వొక కుర్చీలో కూచునివున్నాడు మత్తుగా.

రామిరెడ్డి గుండె మెషీన్‌లాగా దడ దడ కొట్టుకొంటోంది; కాని అందరివంకా అతను భయంకరమైన సింహంలాగా చూసేడు.

"అబ్బాయ్ నేను అడిగే ప్రశ్నలకి సరిగ్గా సమాధానం యిస్తే నిన్ను కాల్చి చంపకుండా తప్పిస్తాను... లేదూ...." అంటూ ఆ ముసలి ఆఫీసరు టేబిల్ మీదవున్న రివాల్వర్ వంక చూపేడు. "అదీ సంగతి! తెల్సిందా? చెప్పు... మీదళంలో యింకా యెంతమంది వున్నారు?"

అని ఆఫీసరు ఆగి రామిరెడ్డి వంక చూసేడు.

రామిరెడ్డి మాటాడలేదు; ద్వేషంతో వురిమిచూసేడు.

"యింత చిన్న ప్రశ్నకే సమాధానం చెప్పలేవూ?" అంటూ ఆఫీసరు స్కూళ్ల ఇన్‌స్పెక్టరు లాగా అన్నాడు.

"అయితే యింకొకటడుగుతా చెప్పు. మీదళాలు వుండేదెక్కడ?"

మళ్లీ సమాధానంలేదు.

"పోనీ కోటిరెడ్డి, సీతా యెక్కడున్నారో చెప్పు."

యిక్కడ రామిరెడ్డి నోరువిప్పేడు.

"ప్రజల హృదయాల్లో వున్నారు?"

"చూడూ. అలా కొంటె సమాధానం చెప్పగూడదు! నువ్వలా అంటూంటే నేన్నిన్నెలా రక్షించను చెప్పు? సరేగానీ,. మీ అన్నం జేరవేసే దెవరు?"

"ప్రజలు!"

"అదుగో మళ్ళీ! నీకు చావంటే భయంలేదా!"

"లేదు!"

"యెందువల్ల?"

"నాకు చావులేదుగనక!"

"అదేమిటి? నిన్ను చంపుతాం; నువ్వు చస్తావ్...."

"నీది మట్టి బుర్ర! నేను చచ్చినా ప్రజల హృదయాల్లో బతికే వుంటాను గన నా చావులేదు!!"

"ఆపు. కనీసం మీ పార్టీకి రాజీనామా అన్నా యివ్వు. నిన్ను కాపాడతాను..."

"యివ్వన్రా కుక్కా!"

"నిన్ను వదిలేస్తే యేంజేస్తావు?"

"ముందు మా తాలూకా ఆర్గనైజరు సోముల్ని పట్టించినందుకు గణపతిగాడ్ని కా చంపుతాను... తర్వాత మళ్ళీ మా దళంలోచేరి ప్రజల కోసం, భూమి కోసం, శాంతి కోసం, సుః కోసం పోరాడతాను!"

అంతవరకూ పిచ్చివాడికిమల్లే నటించిన ఆ ఆఫీసరు

"హు. యిక కానీయ్యండి!" అని భోక్కురు మన్నాడు.

తర్వాత ఆ రాక్షస చర్య ప్రారంభమయ్యింది. నలుగురు సార్జంట్లు రామిరెడ్డి మీదప అతని కనుగుడ్డుని వూడబీకి అతనికి చూపించేరు.

"యేం?"

"కమ్యూనిస్టు పార్టీ జిందాబాద్?" అని రామిరెడ్డి బాధతో అరుస్తూ అన్నాడు.

ఆ కనుగుంట నుంచి రక్తం కారసాగింది. తర్వాత వాళ్లు రెండో కనుగుడ్డు గూడా తోడేరు. ఆ రెంటినీ తమ బూటు కాళ్ళ కింద పిసర పిసరగా తొక్కేరు....

"కమ్యూనిస్టుపార్టీ జిందాబాద్!" కనుగుంటల్లోంచి రక్తం ధారలుగా కారుతుండగా, రామిరెడ్డి గర్జించేడు.

తర్వాత అతని చేతులూ, కాళ్ళూ నరికేరు ముక్కలు ముక్కలుగా, అతని చుట మూస్తుండగానే రక్తపు మడుగు యేర్పడింది.

ఆ తర్వాత అతని గుండెకి గురిచూసి కాల్చేరు.

"కమ్యూనిస్టుపార్టీ జిందాబాద్!!!" అని రామిరెడ్డి **సింహగర్జన** చేస్తూ అసుఁ వదిలేడు...



# లక్ష్మీకాంత మోహన్

## :: కొన్ని ఇతర రచనలు ::

1. గానుగాళ్ళ నవల
2. సింహగర్జన నవల
3. సింహపురి రాణి నవల
4. మేరియానా నవల
5. Marriages on the Horizon
6. Dance of the Devil (Novel)
7. సమ్మె పిలుపు నాటిక
8. కాలం మారింది నాటిక
9. కాంగ్రెస్ మంత్రుల వీధిభాగోతం
10. తెలంగాణా జానపద గేయాలు
11. ఆత్మబలి కథలసంపుటి
12. చైనా గెరిల్లా యోధులు బుర్రకథ
13. కూలీ బుర్రకథ
14. కౌలుదారు బుర్రకథ
15. కన్నకూతురు బుర్రకథ
16. ఝాన్సీ లక్ష్మీబాయి బుర్రకథ
17. ప్రసాద్ చరిత్ర బుర్రకథ
18. అల్లూరి సీతారామరాజు బుర్రకథ
19. స్వామి వివేకానంద బుర్రకథ
20. మరికొన్ని రేడియో బుర్రకథలు
21. పేదరాశి పెద్దమ్మ కథలు
22. బాల కథామాల
23. Storms & Struggles
24. Shakespeare's men & Women Vol. I
25. " Vol. II. The Kings from the Historicals
26. మహాకవి షేక్స్‌పియర్
27. రోమియో జూలియట్ అనువాదం
28. జూలియస్ సీజర్ "
29. తుఫాను "
30. ఆంటనీ క్లియోపాత్ర "
31. మాక్బెత్ "
32. వెనిస్ వర్తకుడు "
33. దెబ్బకుదెబ్బ "
34. హేమ్లెట్ "
35. లియర్ రాజు "
36. కొరియ లేనస్ "
37. ఒథెల్లో "
38. పన్నెండవ రాత్రి "
39. ఎలా ఇష్టమైతే అలా "

40. 41. మరి రెండు నాటకాలు "

## *To be Published*

1. Richard Nixon, A Man of the Centuary
2. Shakespeare's Men and Women Vol. III
3. Granny's after Supper Yarns
4. Is Revolution Dead in India?

etc., etc.,



తెలంగాణా రైతాంగ పోరాటంలో (1946 – 1951) కార్యాచరణకు సిద్ధమౌతున్న దళం

146

